

# బ్రహ్మచర్య విజ్ఞానము

టి. సూర్యనారాయణ

ప్రకాశకులు :

గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)




య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే
ప్రశిషం యస్య దేవాః ।
యస్య చ్ఛాయాఽమృతం యస్య మృత్యుః
తస్మై దేవాయ హవిషా విధేమ ॥

(యజు. 25-13)

ఎవడు మాకు సర్వోత్తమమైన మానవ శరీరము నిచ్చెనో, ఎవడు కర్మానుష్ఠాన శక్తియుక్తుల నిచ్చెనో, ఎవనిని విశ్వమంతయు ఉపాసించుచున్నదో- పొందగోరుచున్నదో, దేవతలు- విద్వాంసులు విజ్ఞానవేత్తలు ఎవని సృష్టి నియమములకు అనుకూలవర్తు లగుదురో, ఎవనిని ఆశ్రయించి అమృతమును- దుఃఖ నివృత్తిని పొందుదురో, ఎవనిని ఆశ్రయించక మృత్యువును- దుఃఖములను పొందుదురో అట్టి సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు నగు పరమేశ్వరునికి వేదవిహిత కర్మానుచరణరూప హవిస్సులతో వినమ్రులమై నమస్కరింతుము గాక ।

డా. జయరాజ్ ఆర్య




# బ్రహ్మచర్య విజ్ఞానము

హిందీ మూలము :

**డా॥ సత్యవ్రత సిద్ధాంతాలంకార్**

అనుసరణ :

**టి. సూర్యనారాయణ**

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)**

వ్యాసనగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్

గాయత్రీ గ్రంథమాల - 20

ప్రతులు : 2000

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 092

దయానందాబ్దము : 167

ప్రథమోత్పత్తి, సంక్రాంతి, 1992

**మూల్యము : రు. 15-00**
(పోష్టు ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమము
   12-10-586/6, వ్యాస్‌నగర్,
   సీతాఫలమండి, సికింద్రాబాద్-500 361

2. వైదిక సాహిత్య భండార్,
   ఆర్య సమాజము, సుల్తాన్ బజార్,
   హైదరాబాద్ - 500 001

3. శ్రీ మాశెట్టి వెంకటేశ్వరరావు,
   స్టెయిన్లెస్ మెటల్ ప్రొడక్ట్స్, 3-3-738,
   కంచరి బజార్, సికింద్రాబాద్ - 500 003

ముద్రణ :
అమర్‌నాథ్ ప్రింటర్స్,
సీతాఫలమండి, సికింద్రాబాద్

# ప్రకాశకీయము

విషయ ప్రవేశము : [illegible] (Anatomy) మరియు ధర్మ శాస్త్రము (Physiology) [illegible] మనము సేవించు ఆహారము జీర్ణకోశములో [illegible] కలిసి అణువులుగా విశ్లేషింపబడి రక్తములో [illegible] ద్రవ రూపమగును. దీనినే ఆంగ్ల వైద్యులు Lymph [illegible] ఆయుర్వేదజ్ఞులు 'రస' మనియు అందురు. ఆ రసము ముందుగా కాలేయమునకు పోవును. కాలేయము రక్తములో ఉండవలసిన పోషక విలువల శాతము ననుసరించి రసమును నియంత్రించి ఎక్కువైన పోషకములను తనయందు నిలువ చేసికొనును. తక్కువైన పోషకములను యిదివరలో తనయందు నిలువ చేసికొన్న పదార్థముల నుండి సిద్ధపరచి సరియైన పాళ్లలో రక్తము లోనికి పంపుచుండును. తదుపరి ఆ రసము బృహద్శిరలో కలిసి ఊపిరి తిత్తులలో [illegible] వాయువునుకూడా స్వీకరించి గుండెనుండి ధమనుల ద్వారా, [illegible] ద్వారా శరీర మంతటకు ప్రతి కణమునకు చేరును. [illegible] రక్తముతో శరీరములోని వివిధ కణములు- మాంస, అస్థి, [illegible] కణములు కణ విభజన ద్వారా వృద్ధి పొందుచుండును.

ఆ పోషక రక్తమే బీరిజములను (Testicles) [illegible] బీరిజములలోని కణములు ఆ రక్తములో [illegible] హార్మోనులను, వీర్యాణువుల (Spermatozoa) [illegible] వీర్యాణువులు Prostate మరియు (Cowper's) [illegible] కలిసి వీర్యాశయమును జేరి అచట నిలువ [illegible]

తన శిశ్నేంద్రియము మృదువైన రాపిడికి గురియై ఉన్నతమైన నాడీ ఉద్రేకత కలిగినపుడు వీర్యాశయము, వీర్య నాళములు సంకోచింపబడి వీర్యము బహిర్గతమగును క్రమముగా మరల ఆ వీర్యాశయము పూరింప బడుచుండును.

వీర్యము ఒక అత్యద్భుత సంక్లిష్ట, సజీవ రసాయన పదార్థము. దానిని విశ్లేషించిన కోట్లాది వీర్యాణువులు Albumin, Glucose, Calcium మొదలగు పోషక పదార్థ యుక్త ద్రవములో ఈదులాడు చుండును. వీర్యాణువు ఒక విశిష్టమైన సజీవ కణము. శరీర మందలి అన్ని కణములు 23 జతల క్రోమోజోములు కలిగి యుండగా వీర్య కణము 23 ఒంటరి క్రోమోజములను కలిగియుండును. అయినను అవి పరిస్థితులు అనుకూలించిన తగిన క్షేత్రము (అండము) దొరికిన-మరొక మానవ ప్రాణిని సృష్టించగలదు. వీర్యాణువులు మానవులను సృష్టించ గల అద్భుత విత్తనములు.

ప్రకృతిని పరిశీలించిన మానవేతర ప్రాణులన్నియు ఋతు కాలగాము లగుచుండుటయు, వ్యర్థముగా గాని కృత్రిమ పద్ధతులద్వారా గాని, యువావస్థకు రాక పూర్వముగాని వీర్యమును నష్టపరచ కుండుటయు గాన నగును. కాని సర్వోత్తమ ప్రాణిగా బుద్ధి జీవిగా కొనియాడబడు మానవుడు తన అమూల్య సంపదను మురుగు కాల్వలో వ్యర్థముగా ప్రవహింపజేయుచున్నాడు. ఆధునిక వైద్యులు కొందరు దీనిని నివారించక పోగా ప్రోత్సహించుట దురదృష్టకరము. నేటి సామాజిక వాతావరణమే కొండంత చెరుపు జేయుచుండ కొందరు వైద్య సోదరులు మరింత కామోద్రేకతను కలిగించు హార్మోనులను, ఉపదేశములను యిచ్చి ఆ చెరుపుకు దోహదము చేయుచున్నారు.

ఋషి ప్రణీత గ్రంథములైన సుశ్రుత, చరకాది ఆయుర్వేద గ్రంథములందు శుక్ర నిర్మాణ క్రమము ఈ విధముగా వర్ణించబడినది.

శ్లో॥ రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే ।
మేదసో అస్థిః తతో మజ్జాః, మజః శుక్రింతు జాయతే ॥
(సుశ్రుత సూత్ర 14-13)

మనము తీసికొన్న ఆహారము జీర్ణమై మొదట రసధాతువుగా మారును. ఆ రస ధాతువునుండి రక్తము, రక్తము నుండి మాంసము, మాంసము నుండి మేద (క్రొవ్వు), క్రొవ్వు నుండి ఎముక, ఎముక నుండి మజ్జ, మజ్జ నుండి శుక్రము అనుధాతువులు యేర్పడు చున్నవి.

ఒక ధాతువునుండి మరొక ధాతువు నిర్మితమగుటకు దాదాపు అయిదు దినములు పట్టుననియు, అట్లు పరిణతి జెందు చున్నప్పుడు కొంత మలము (సారహీన పదార్థము) యేర్పడుననియు కూడా వర్ణింపబడినది.

శ్లో॥ కఫః పిత్తం మలః ఖేషు స్వేదః స్యాన్నఖరోమ చ ।
నేత్రవిట్ త్వక్షు చ స్నేహో ధాతూనాం క్రమశో మలాః॥
(సుశ్రుత సూత్ర. 46-531)

రస ధాతువునుండి రక్తమేర్పడునప్పుడు సారహీన భాగము (మలము) కఫముగాను, రక్త మలము, పిత్తముగాను, మాంస మలము శ్రోత్ర ముఖాదులందలి గులిమి, పాచీ మొదలగునవిగాను మేదో మలము స్వేదముగను, అస్తి మలము నఖరోమములుగను. మజ్జ యొక్క మలము కండ్ల పుసులు, చర్మముపైన తైలముగాను ఏర్పడునని యీ శ్లోక భావము. ఈ క్రమమును క్రూడాయిలు నుండి పెట్రోలు సిద్ధమగునపుడు వివిధ రకముల పదార్థములు ఉత్పన్నమై వేరు వేరు

ప్రయోజనములు కలుగు విధానముతో పోల్చవచ్చును. అన్నసారము వివిధ ధాతువులుగా పరిణతి జెందుచు శరీరములోని ఆ యా ధాతువులను పోషించుచు శరీరమును ఆరోగ్యముగా నుంచుచున్నది. ఈ పరిణామ క్రమములోని చివరిది శుక్రము. అది మల రహితమైన శుద్ధ పదార్థము. దాని నుండి ఓజస్సు అను గొప్ప శక్తి ఉద్భవించి మానవుని శరీర మందంతట వ్యాపించి స్ఫూర్తిని, ఉత్సాహమును, కాంతిని, ఆనందమును ప్రసాదించును. అని ఆయుర్వేద గ్రంథములలో వర్ణనలు కనబడును.

ఋషులు పరమేశ్వర వాణియైన వేదమంత్రార్థ ద్రష్టలు, సర్వసంగ పరిత్యాగులు. పక్షపాత రహితులు. నిష్కల్మష హృదయులు. వారు తెలిసికొని, తర్కించి అనుభవ పూర్వకముగా గ్రహించిన దానిని మరియొకసారి అంతర్ముఖులై సృష్టి రచయితయైన పరమేశ్వరుని నుండి సమాధానము బడసెడివారు. తదుపరియే పరహితైషులై "సత్యం వదిష్యామి, ఋతం వదిష్యామి" మేము సత్యమునే చెప్పు చున్నాము, అనుభవమునే చెప్పు చున్నామని ప్రమాణముచేసి శాస్త్రములు నిర్మించిరి. మనము అందుకోలేనంత మాత్రమున అది తప్పు, విజ్ఞాన సమ్మతము కాదు, హేతు బద్ధముగాలేదు అని తేలికగా కొట్టివేయ వీలుపడదు. నేటి విజ్ఞానము నిలుకడలేనిది. కాల ప్రవాహ ములో యెన్నెన్నో మార్పులు జెందుచు, చిన్న పిల్లవానివలె పడుచు లేచుచు పయనించుచున్నది. నేటి విజ్ఞానమునకు చలాయమాన ప్రపంచ ములోని వారి దూరదర్శిని, సూక్ష్మదర్శిని యంత్రముల పరిధి లోనికి వచ్చిన స్వల్ప భాగము ఆధారము కాగా- ఋషులకు సర్వ వ్యాపకుడు, సర్వాంతర్యామి, అచలుడు అయిన పరమేశ్వరుడు ఆధారము. వారి నడక ఆచి తూచి స్థిరచిత్తులై నడచిన ధీరుల నడకవంటిది. మనము యెవరి ననుకరించుట శ్రేయస్కరమో మీరే నిర్ణయించుకొనుడు.

ఈ క్రమమును నేటి విజ్ఞానము ఇంకను అందుకో లేకున్నది. అందుచే నేడు మనము దీనిని ఆధునిక విజ్ఞానముతో సమన్వయ పరచ

లేకున్నాము. స్థూలముగా శుక్రము ఒక శ్రేష్ఠమైన శారీరక సారమని చెప్పవచ్చును. దానిని అధికముగా పోగొట్టుకున్న వ్యక్తులు దుర్బలురుగ, ఇంద్రియ పటుత్వ రహితులుగా, ముఖ్యముగా మేధాశక్తి వంచితులుగా మనకు కనబడుచుందురు. హోమియో వైద్యులు సమగ్ర లక్షణములను బట్టి ఏక మూలికా ప్రయోగముతో రోగ నివారణ చేయుదురు. ఆ లక్షణములు యెన్ని యున్నను రోగమునకు గల కారణము దొరికిన దానికి యెక్కువ ప్రాధాన్యత నిత్తురు. కేవలము కారణాధారముతోనే ఔషధము నెన్నుకొని అద్భుత నివారణలు చేయుదురు. ముష్టి మైథునము, అమిత సంభోగము రోగ కారణముగా కనబడిన **Staphisagria, Acid phos, China** మొదలగు మందులలో ఒకదాని నెన్నుకొని ప్రయోగించి మొత్తము బాధల నివారణ చేయుదురు. దీనిని బట్టి ముష్టిమైథునము, అమిత సంభోగము అనేక వ్యాధులకు కారణమని తెలియుచున్నది.

గృహస్థుడై భార్యతో జరుపు కామకేళి కొంత అధికమైనను దాని వల్ల యెక్కువ దుష్ఫలితములు కలుగక పోవచ్చును. ఎందుచేతననగా వారి కేళిలో నిర్భయత, నిస్సంకోచత, అన్యోన్యానురాగము, తన్మయత ఉండును. కాని శ్రుతి మించిన అదియును హానికరమే. ఇక వేశ్యా లంపటులైనవారి గతి దుర్గతియే యనిన అతిశయోక్తి కాదు. వారు శారీరక శక్తిని పోగొట్టుకొనుటయే గాక అనేక సుఖ రోగములను కొనితెచ్చు కొందురు. వాటితో వారు పీడింపబడిటయే గాక భార్యా బిడ్డలను, తర తరములను రోగ గ్రస్తులను చేయుదురు. మానసికము గను, ఆర్థికముగను పతనమై పోవుదురు. ఇక ఆత్మికముగ ఎంత పతనమగుదురో ఆ భగవంతునికే ఎరుక.

ముఖ్యముగా బ్రహ్మచర్య కాలములో అనగా శరీరము ఎదుగు కౌమారావస్థలో వీర్య నష్టము ఎంతగానో హానికరము. శరీరము వికసితము కాకుండుటయే గాక ధాతు శక్తి దుర్బలమగును. ఇంద్రియ

శక్తులు బలహీనములగును. మేధా శక్తి కుంటువడును. అనేక మానసిక వత్తిడులతో, బిడియములతో, భయములతో జీవితము దుర్భరమగును. తదుపరి ఎంత పశ్చాత్తాప పడినను ఫలితము శూన్యము.

నేడు నవనాగరికత పేరుతో గడుపు విలాస, వినోదమయ జీవితము చూచిన ఈ జాతి ఎటు పోవుచున్నదో, ఏ దుర్గతి వైపు పయనించుచున్నదో అంతు పట్టకున్నది. ఈ జాతి పూర్తిగా నపుంసకము కాక ముందే దీనిని మేల్కొలుపవలసిన బాధ్యత వివేకవంతు లందరిపై నున్నది. నేటి విజ్ఞాన యుగములో వైజ్ఞానికముగ, హేతు బద్ధముగ ప్రేమతో యీ విషయములను యువకుల కందించవలసి యున్నది. ఆ ప్రయత్నముగానే మా శక్తి కొలది ఈ చిన్న గ్రంథమును ప్రచురించు చున్నాము. ప్రఖ్యాత ఆర్య విద్వాంసులు, ఆయుర్వేద హోమియో వైద్య శ్రేష్ఠులు,కాంగ్డీ గురుకుల స్నాతకులు పం. సత్యవ్రత సిద్ధాంతాలంకార్ గారి "బ్రహ్మచర్య సందేశము" అను హిందీ మూల గ్రంథమును అనుకరించుచు కొంత సంక్షిప్త పరచి, కొన్నిచోట్ల అవసరమగు కొన్ని మార్పులుచేసి ప్రచురించు చున్నాము. ముందు 'వైదిక క్రాంతి' తదుపరి 'వైదిక ఢంకా' సంపాదకులుగా చిరపరిచితులు, దేశ దుస్థితికి సామాజిక దుస్థితికి ముఖ్యముగా హిందువుల దుస్థితికి నిరంతరము ఆవేదన జెందుచుండు మా ట్రస్టు కార్యదర్శి శ్రీమాన్ టి. సూర్యనారాయణ గారు మిక్కిలి శ్రమించి దీనిని అనువదించిరి. శ్రీమాన్ మూట యోగానందముగారు కీ॥ శే॥ వారి తల్లి దండ్రుల పుణ్యస్మృతిలో ఈ పుస్తకము వేయి ప్రతుల ముద్రణకు ఆర్థిక సహాయము జేసిరి. అమర్‌నాథ్ ప్రింటర్స్ శ్రీ పాండు, శ్రీ దక్షిణ మూర్తిగారలు చక్కగా ముద్రించి యిచ్చిరి. అనువాదకులకు, దాతలకు. ముద్రణాలయము వారికి మా హార్దిక ధన్యవాదములు.

దీని. వలన ఏ కొద్ది మంది యువకుల జీవితములు బాగుపడినను మా కృషి సఫలము కాగలదు.

— కోడూరి సుబ్బారావు

చురుకుగా పనిజేసిరి. 1960 లో జరిగిన రైల్వే సమ్మెలో పాల్గొనిరి. ఫలితముగా ఒక సంవత్సరము సస్పెన్షను తదుపరి ఉద్యోగము గోల్పోవుట జరిగెను. కాని ధైర్యముగా పరిస్థితుల నెదుర్కొని ఉద్యోగమును సాధించి విజయము సాధించెను. డోర్నకల్‌లో ఆర్య సమాజమునకు స్థలము కొనుటలో శ్రీ. శే. వెంపటి రాములు మరియు శ్రీ టి. సూర్యనారాయణ గారలతో కలిసి కృషి జేసిరి. అనేక ఆర్య సమ్మేళనములలో, కార్మిక సమావేశములలో చురుకుగా పాల్గొనిరి.

వీరి సతీమణి సత్యమ్మగారు వీరికి అనుకూలవతియై వీరు చేయు కార్యక్రమములలో అండదండగా నుండెడివారు వీరి యింటిలో సంస్కారములన్నియు వైదిక పద్ధతిని జరిపించబడినవి. వీరు 7 వ జనవరి 1992 నాడు అస్తమించిరి.

వీరి కుమారుడు యోగానంద్ యోగ్యుడు. తల్లి దండ్రులు కేన్సర్‌తో బాధపడుచున్నప్పుడు వారికి అహో రాత్రములు సేవ జేసెను. వేదములో పుత్రుల కర్తవ్యము గురించి చక్కగా వివరించ బడినది. "అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సం మనాః" (అథర్వ 3-30-2) పుత్రుడు తండ్రికి అను వ్రతుడు కావలెను. తల్లితో సమాన మనస్కుడు కావలెను అని దీని అర్థము. వీరి కుమారుడు యీ వేద వాక్యమునకు సరిపోవు గుణములు కలవాడు. వైదిక ధర్మ ప్రచారములో తండ్రితో పాటు చురుకుగా పాల్గొనెడివారు. వైదిక ధర్మ ప్రచారార్థమై తల్లిదండ్రుల పుణ్య స్మృతిలో "బ్రహ్మచర్య విజ్ఞానము" అను పుస్తకము వెయ్యి ప్రతుల ముద్రణకై భూరి విరాళముగా ఆరువేల రూపాయలు దానముగా యిచ్చినారు. భగవంతుడు వీరి కుటుంబమునకు ఆయు రారోగ్యములు ప్రసాదించు గాత!

# విషయసూచిక

# దాతలకు ధన్యవాదములు

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥
(భగవద్గీత 17-20)

'దాన మొనర్చుట మా కర్తవ్య'మను భావముతో ప్రత్యుపకారమ్ము నాశించక దేశ కాల పాత్రతల ననుసరించి జేయు దానము సాత్త్విక దానము.

శ్రీకృష్ణుని పై ఉపదేశము ననుసరించుచు తెలుగుశో వైదిక సాహిత్య ప్రచురణకు— ఈ "బ్రహ్మచర్య విజ్ఞానము" రెండవ వెయ్యి ప్రతులకు, "జననీ జన్మభూమి", "వైదిక అర్థనీతి" మొదలగు లఘు గ్రంథముల ముద్రణ కొరకు ఈ క్రింది దాతలు వారి శక్తి కొలది మా ట్రస్టునకు సాత్విక దాన మొసగి మమ్ము ప్రోత్సహించిరి.

1. శ్రీ కె. నరసింహారెడ్డిగారు, కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ ఆర్య ప్రతినిధి సభ, భాగ్యనగరము రూ. 1000/-

2. శ్రీ పి. రామయ్య ఆర్యగారు, శ్రీ సదానంద స్వీట్‌హౌస్, బన్సీలాల్‌పేట కమాన్ ప్రక్కన, సికింద్రాబాదు. రూ. 1116/-

3. శ్రీ మంద జగన్నాథరెడ్డి, రిటైర్డ్ డిప్యూటీ తహశీల్దారు, పడ్గారు గ్రామము, కామారెడ్డి మండలము రూ. 1000/-

4. శ్రీ ఆరేపల్లి నరసింహగారు, రిటైర్డ్ డ్రైవర్, దక్షిణమధ్య రైల్వే, లాలాగూడా— వారి ప్రథమపుత్రిక స్వర్గీయ సవిత జ్ఞాపకార్థము రూ. 1000

5. శ్రీ బొక్క గుండారెడ్డి గారు, వ్యవసాయ నిపుణులు, ఎల్లపాడు, కామారెడ్డి మండలము. రూ. 1000

పై దాతలందరకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

— గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

# బ్రహ్మచర్య విజ్ఞానము

మనమొక నికృష్టమైన, అనారోగ్యకరమైన మానసిక వాతావరణములో జీవించుచున్నాము. ఎన్నో నికృష్టమైన ఆలోచనలు మన మస్తిష్కములో చోటు చేసుకొనుచున్నవి. చిన్న చిన్న బాలుర లేత మస్తిష్కముల సురభిత కుసుమములను దుర్గంధ మాలిన్యములతో నింపుచున్నవి. ఎనిమిది, పది సంవత్సరముల ప్రాయముగల బాలుర లలో నిక్షిప్తమై యున్న నొక దావాగ్ని ఆతనినే భస్మీభూతము జేయు నట్టిదై యున్నది. అతని ఆలోచనలు ఆతనిని నఖశిఖ పర్యంతము కంపింప జేయునంతటి భయంకరముగా నున్నవి. ఈ ఆలోచనలు ఆతనికే యేవగింపు కలిగించునట్టివిగా నున్నవి.

ఈ గుప్త రహస్యములు బాలుని కలవరపరచును. మిత్రుల ద్వారా యీ రహస్యములను తెలిసికొనుటకు ప్రయత్నించును. వారాతనిని హేళన జేయుదురు. సందేహ నివృత్తి జేయుటకు బదులు వా రాతని ఆలోచనలను కలుషితము జేయుదురు. క్రమముగా నాత డొక విష వలయములో జిక్కుకొనును.

సమాజము వీటిని గోపనీయ విషయములుగా చిత్రించును. తల్లిదండ్రులు బాలుని నోరు మూయించెదరు. అధ్యాపకులు బోధించరు. బాలుడు యీ గుప్త విషయములను తెలిసికొనుటకు కనబరచెడు ఆసక్తి అన్నివైపుల ద్వారములు మూయబడి యుండుట వలన తన మార్గమును తానే అన్వేషించుకొనును. ఆతడు నేర్చుకొనిన విషయ ములు తల్లిదండ్రులకు బాధాకరముగా, అధ్యాపకులకు ఆశ్చర్యకరముగా

నుండి అతని జీవితము భయానక పరిస్థితులలో చిక్కుకొనును. అతని జీవిత మంతయు దుఃఖభాజక మగును.

మానవునకు యితర అవయవముల జ్ఞాన మెట్లవసరమో అట్లే జననేంద్రియ విషయ జ్ఞాన మవసరము. అన్ని అవయవముల వలె జననేంద్రియము కూడా పవిత్రమైనదిగా భావించవలెను. విషయ ప్రస్తావన మాత్రము చేతనే కన్నుల ముందు దృశ్యము గోచరమగు ననియు, కొందరీ విషయ పరిజ్ఞానమును దురుపయోగ మొనర్చుట వల్ల యీ విషయము మలినమైనదిగా మరియు గోపనీయ విషయముగా భావించిరి.

ఎందరో యువకులు జననేంద్రియ విషయములలో సరియైన అవగాహన లేకుండుట వలన వక్ర మార్గములలో నడిచి తమ అమూల్య జీవితములను నాశనము గావించుకొనుచున్నారు. దురభ్యాసములకు వశులై వానినుండి విముక్తి పొందజాలకున్నారు. పశువులు నైసర్గికముగా ప్రవర్తించును. మనుష్యుడు ప్రకృతిని యెదురించుటలో సంతృప్తి జెందును. అనేక కోణముల నుండి వెలువడు అశ్లీల సాహిత్యము, అశ్లీల చిత్రముల నుండి యువకులు యీ విషయమును విపరీత ధోరణిలో గ్రహింతురు. జీవితములో ప్రతి యొక్కరు తప్పు జేయుదురు. కాని తప్పు తెలిసి కూడా సవరించుకొనలేని వారు పతను లగుదురు జీవితమును సరిదిద్దుకొనుటకు "ఆలస్యము" అను మాటను విస్మరించవలెను. తప్పు తెలుసుకొని సరిదిద్దుకొను వారు తప్పు జేయని వారిలో పరిగణించబడెదరు.

## ప్రేమ మొగ్గలు

ప్రేమయే జీవనము. ప్రేమయే మనుష్యునకు సంజీవనీ శక్తి నొసంగును. ప్రపంచ అస్తిత్వమునకు ప్రేమయే కారణము. తల్లి ప్రేమ

అమృతతుల్యము. కాలము, దూరము దీనిని మరపించజాలవు. అన్నదమ్ములు, అక్కాచెల్లెండ్ర ప్రేమ అంతరిక్షము నుండి దిగివచ్చిన గంగగా పేర్కొనవచ్చును. పతీపత్నుల ప్రేమ ఈశ్వరు డిచ్చిన వరదానములలో నొకటి. ఉన్నతస్థాయి జేరినప్పుడు యీ ప్రేమ వారిని ఐక్యభావులనుగా జేయును. భిన్నత్వము తొలగిపోవును. పవిత్రత, సత్యము, విశ్వాసపాత్రతలోనే సౌందర్యము గలదు. సదాచార మనెడు పవిత్ర భావములతో ప్రేరితులై పరస్పరము ఒకరినొకరు గౌరవించుకొనుచు ఒకరి పట్ల నొకరు మొగ్గుచున్న వారిలోనే నిజమైన మైత్రి కలుగునని మనస్తత్వవేత్త డా॥ సిసరో భావన.

మానవుని మస్తిష్కమును రెండు భాగములుగా విభజించవచ్చును. ముందు భాగము మరియు వెనుక భాగము. ముందు భాగమును "పెద్ద మెదడు", వెనుక భాగమును "చిన్న మెదడు" అందురు. పుఱ్ఱెయొక్క అధిక భాగమును పెద్ద మెదడు ఆక్రమించును. ఇది కనుబొమల పైభాగము నుండి వెనుక ఎత్తయిన భాగము వఱకుండును. కుడి ఎడమగా అర్ధ వృత్తములలో విభజింపబడియుండును. రెండు భాగములలో కొన్ని పగుళ్ళు గనిపించును. కంఠమునకు పై భాగమున, వెనుకవైపు చిన్నమెదడు ఉండును. ఇది రెండు చెవుల మధ్య భాగమున నుండును. ఇది కూడా ఎడమ, కుడి అర్ధ వృత్తములలో విభజింపబడి యుండును. మేరుదండము ప్రారంభమైన చోట నుండి దాని చుట్టుప్రక్కల చుట్టుకొనియుండును. వీటిలో పగుళ్ళు గలవు. ఈ పగుళ్ళు మెదడును భిన్న భిన్న భాగములలో విభజించును. దీని లోతు మెదడు యొక్క జ్ఞానశక్తిని సూచించును. ఈ రెండు భాగములు మనుష్యుని పుఱ్ఱెలో సురక్షితముగా నుండును. అది వ్యాపించుటకు తగిన స్థల ముండును. పెద్దమెదడు పంచ జ్ఞానేంద్రియముల అనుభవములను సాక్షాత్కరింప జేయును. కన్నులు చూచును;

చెవులు వినును, ముక్కు వాసన చూచును. నాలుక రుచి చూచును. త్వచ స్పర్శించును. జ్ఞానతంతువుల ద్వారా యింద్రియముల అనుభవము పెద్దమెదడు ద్వారా జరిగినది. చిన్నమెదడు శరీర సంబంధమైన ప్రవృత్తులను మరియు శరీర సంబంధమైన భిన్న భిన్న చలనములను వశములో నుంచి పనిచేయును. అందుచేతనే శరీర నియంత్రణము మాతాపితల యెడ, బంధువుల యెడ ప్రేమానురాగములు ఏర్పడును. ఈ చిన్నమెదడుకు యేవిధమైన హాని కలిగినప్పటికి శరీర సంబంధ చలనములు వశమునం దుండవు. నడుస్తూ, తిరుగుతూ తూలిపోవుట జరుగుచుండును. మాదక పదార్థ సేవనము యీ చిన్నమెదడుపై ప్రభావము జూపుట వలన అట్లే తూలిపోవును. ప్రేమ భావముల సంబంధము కూడా చిన్నమెదడుతోనే యుండును. అందుచేత ప్రేమ యొక్క ఉన్మాదములో మానవుని యొక్క స్థితి తాగుబోతుకు యే మాత్రము తీసిపోదు. ఈ ప్రకరణములో చిన్నమెదడు గురించి విశేషముగా తెలిసికొందము. చిన్నమెదడుకు సంబంధించిన రెండు పనులు గలవు.

1. లౌకిక ప్రవృత్తుల కేంద్రమగుట వలన సమాజ ప్రేమ, దాంపత్య స్నేహము, వాత్సల్య భావము, మైత్రీ భావము, గృహనివాసేచ్ఛ, తత్పరాయణత మొదలగునవన్నియు దీనితోనే సంబంధము కలిగియుండును.

2. శరీరము యొక్క భిన్నగతులను వశములో నుంచుకొనుట, వానిని హద్దులో నుంచుట మరియు నియంత్రణలో నుంచుట, నడచుట, తిరుగుట, కూర్చొనుట, లేచుట, నిలబడుట, చేతులు తిప్పుట, వేళ్ళు కదుపుట, యెగురుట మొదలగు వానినన్నింటి సంచాలన మిది జేయును

చిన్నతనములో యీ చిన్న మెదడు మొత్తము మెదడు యొక్క యిరవయ్యవ భాగముగా నుండును. పెద్దవా రగుచున్న కొలది యిది కూడా పెరిగి పెరిగి యేడవ భాగ మగును.

చిన్న మెదడు పెరిగే అవస్థను కూమారావస్థ యందురు. యీ అవస్థలోనే కామ సంచారము జరుగును. ప్రేమ మొగ్గలు విచ్చుకొనును. ఈ అవస్థ యట్టిదే. కామవాసన జీవితమునకు కీడు చేయును. గోపనీయ విషయములవైపు బాలబాలికల ధ్యాస ఆకర్షించబడును. హృదయములలో తుఫాను రేపును. ఈ కామవాసన యను గుఱ్ఱములకు సంయమ మనెడు కళ్ళెము వేయనిచో యీ తుఫాను ఉధృతమై చెలరేగును. ఎదురుగా వచ్చు వారిని తన ప్రవాహములో ముంచెత్తును. ఇది పేద, ధనిక, బాల బాలికలను వ్యత్యాసము లేకుండా యీ విషయవాసన వారి జీవితములలో నలువైపుల నుండి సర్వనాశన చిహ్నములు గోచరింప జేయును.

ప్రేమ భగవంతు డిచ్చిన వర దానము లో నొకటి యని మరొకసారి నొక్కి చెప్పుచున్నాము. దీనిని భద్రపరచుట అవసరము. పుణ్య బీజములను హృదయ క్షేత్రములో నాటుము. వాటి వేళ్ళను సత్యము, పవిత్రత, సదాచారము, గౌరవము అను నీటితో తడిపి గట్టి పరచుము. ఆ బీజములతో ప్రేమమొక్క చిగురించును. ఆ మొక్కను వసంత ఋతువు యొక్క యౌవనముతో అలరించుకొననిమ్ము. ప్రేమ యొక్క మొగ్గలను కొమ్మ కొమ్మపై గాలితో ఆడుకొననిమ్ము.

## సృష్టిలో ప్రజనన ప్రక్రియ

ఈ అధ్యాయములో శారీరక వికాసముతో బాలబాలికల అయవవములలో కలుగు మార్పును గురించి చర్చింపబడుచున్నది. కిశోరావస్థలో ముఖ్యమైన మార్పు జననేంద్రియములో కలుగును.

జీవిత కాలము యొక్క సమస్త క్రియలను రెండుగా విభజించ వచ్చును. శరీర పోషణ, ప్రజననము. శరీర పోషణ స్వార్థమయ ప్రక్రియ. తిని, తాగుట వలన వ్యక్తిగత జీవనశక్తి కలుగును. ప్రాణ మున్నచోట యీ స్వార్థ ప్రక్రియ కనిపించును. సుదూర అడవి ప్రాంతములలోనున్న మొక్కలు గాలినుండి, నీటిద్వారా, భూమిద్వారా తనకు కావలసిన జీవన శక్తిని పొందును పక్షులు తమ గూటిని వదలిపెట్టి ఆకాశములో యెగురుచు దూర ప్రాంతములకు వెళ్ళి తిరిగి సాయంకాలము తమ గూటికి చేరును. జీవిత మంతయు పక్షులు ఆహార అన్వేషణలో యిట్లే గడుపును. అడవిలో జంతువులు పచ్చని గడ్డి, స్వచ్ఛమైన నీటికై అన్వేషించును. ఇవి దొరికిన చోట అవి తమ నివాస మేర్పరచుకొనును. మనుష్యుడు కూడా బాల్యము నుండి వృద్ధాప్యము వరకు తిండి, బట్ట కొరకు శ్రమించును. పశు పక్ష్యాదులు, మనుష్యులు తమ అస్తిత్వము కాపాడుకొనుటకై సంఘర్షణ గావింతురు.

కాని ఈ సంఘర్షణ యెంత కాలము? ప్రతి ప్రాణి చావవలసి నదే. వ్యక్తిగత జీవితము పరివర్తనశీలమైన భిన్న భిన్న పరిస్థితులపై విజయము సాధించునంత వరకే జరుగును. జీవిత పూర్ణ వికాసము కలుగునంత వరకు జీవించియుండుటకై తమ శారీరక పోషణ కొరకై జీవిత సతత ధారను అడ్డుకొను లేక యెండకట్టు పరిస్థితుల నెదుర్కొన వలయును. కాని ఈ స్థితి తన నలువైపుల పరిస్థితులతో సంబంధ మేర్పరచుకొనుట అసంభవ మగునంత వరకు మాత్రమే. అప్పుడు వృద్ధాప్యము వచ్చును. పరిస్థితులతో సంబంధము కలిగియుండుటయే జీవితము. సంబంధము తెగిపోవుటయే మృత్యువు. అటువంటి పరిస్థితు లలో శరీర పోషణ యను స్వార్థమయ ప్రక్రియ ఆగిపోవును. మనుష్యు నకు యిదియే అంతమైనచో అతడు అత్యంత దుఃఖమయు డగును. కాని పరమాత్ముడు ఆరిపోవు జ్యోతిని సురక్షితముగా నుంచుటకు

ఉపాయము గావించెను దీనివలన ఒకసారి ఉత్పన్నమైన జీవితము అనంత కాలము వరకు సురక్షితముగా నుండును.

శరీర పోషణ తర్వాత ప్రజనన ప్రక్రియ మనుష్యునికి సహాయ పడును. దీనిద్వారా వ్యక్తిగత జీవితము నష్టమైనప్పటికి అది అతని జాతి (భావి తరములు) శరీరములలో జీవించి యుండునట్లు చేయును. మొక్క జీవితము సమాప్తమగునప్పుడు అందు సంచరించు అదే ప్రాణము రమ్య సుగంధ పుష్ప రూపములో వికసించును. ఆ పుష్పము నుండి సజాతీయ వృక్షముల నుత్పన్నము జేయు వేల బీజములు సిద్ధ మగును. గాలి తాకిడికి కూలిపోయెడు మొక్క తనవంటి అనేక మొక్కలకు పునాది వేయును. యువావస్థలో ఋతు కాలములో అన్ని ప్రాణులు తమవంటి పిల్లలను ఉత్పన్నము జేయును. ఆ ప్రాణులు తమ సంతానములోనే అమరులగుదురు. మనుష్యుడు మరణించిన తర్వాత వందల, వేల సంవత్సరాల తర్వాత కూడా తన పిల్లలలో, మనుమలలో, ముని మనుమలలో మాటిమాటికి జన్మించుచున్నాడు. మరియు క్షీణించిన యౌవనమును శాశ్వత మొనరించుకొనును. ఈ విధముగా జీవితానికి ప్రబల విరోధియైన మృత్యువు పరాజయ మొందును మరియు జీవనధార అఖండితముగా ప్రవహించుచుండును.

శరీర పోషణ స్వార్థమయ ప్రక్రియ. ప్రజనన క్రియ స్వార్థ రహిత ప్రక్రియ. శరీర పోషణ ప్రక్రియ ఆగిపోవు సమయమున యువావస్థలో శరీర పోషణ తత్త్వముల ద్వారా సంతానోత్పత్తి జేయుట దీని ఉద్దేశ్యము. మొక్కయొక్క వనస్పతిక శక్తి వృద్ధి పొందినప్పుడు పుష్పములు వికసించునట్లు శరీర పోషణ ప్రక్రియ ముగిసిన తర్వాతనే ప్రజనన ప్రక్రియ ప్రారంభమగును. అంతకుపూర్వము యీ ప్రజనన ప్రక్రియ అస్వాభావికమైనది. అది శరీర పోషణ ప్రక్రియను నిలుపు జేయును. ఈ ప్రజనన ప్రక్రియను కేవలము సంతానోత్పత్తి కొరకే

ఉపయోగించవలెను. అదైనను పురుషునకు 25 సంవత్సరములు, స్త్రీకి 16 సంవత్సరములు నిండవలెను. ఈ ప్రాయమునందే వారి అవయవములలో అందుకు తగిన వికాసము రాగలదు. ఇది ప్రకృతి యొక్క నియమము. పశు పక్ష్యాదులలో, మొక్కలలో ఈ నియమము పాటించబడుచున్నది. కాని సభ్యత, వికాసమని గొప్పలు చెప్పకొనెడి మనుష్యుడు ప్రకృతి నియమములను ఉల్లంఘించుచున్నాడు. ప్రజనన క్రియను దురుపయోగము జేసి మానవత్వమును ఉన్నతాసనము నుండి దిగజార్చి పతనము జెందును. చేయి జారిపోయి తన భయంకర దుష్కృతముల భీకర పరిణామముల పట్ల తల బాదుకొనును.

## జీవనారంభము
## (Protoplasm)

ప్రోటోప్లాజమ్ : ప్రాణి యొక్క జననము రహస్యమయము. విలియమ్ థామ్సన్ పృథివిపై ప్రాణి వేరే నక్షత్రము నుండి జారిపడినట్లు అభిప్రాయపడెను. డార్విన్ ననుసరించి అన్ని ప్రాణులు ఒకే మూలతత్త్వము నుండి ఉద్భవించినవి. హెర్బర్ట్ స్పెన్సర్, హక్సలే మరియు టిణ్ణల్ చైతన్యము గల ప్రాణులన్నియు జడము నుండి ఉత్పన్నమైన వనిరి. కాని యిందుకు వారి వద్ద ప్రత్యక్ష ప్రమాణము లెవ్వియు లేవనిరి. సృష్ట్యారంభమున ప్రాణుల యుత్పత్తిని గూర్చి యిదమిత్థమైన నిర్ణయము జరుగలేదు. ఉత్పత్తి తరువాత ప్రాణుల వృద్ధిని గూర్చి విజ్ఞానము బాగుగా గ్రహించినది. వనస్పతుల, జంతువుల రెండింటి మూలాధారము "ప్రోటోప్లాజమ్" అని వైజ్ఞానికులు నిర్ణయించిరి. దానిని కేవలము సూక్ష్మదర్శిని యంత్రముతో మాత్రమే కనిపెట్టదగును. ఈ ప్రోటోప్లాజమ్ పారదర్శిక పదార్థము. ఇది సగము ద్రవ రూపములో యితర సగము గట్టి పదార్థముగా నుండును. దీని అన్ని భాగములు ఒకే తత్త్వముతో నిర్మింపబడును. ఇది అఖండ

ఏకరసము. ఇందు స్వాభావికముగా చలనము జరుగును. ఇది నియమితము కాకుండా యుండును. నిమిష నిమిషమునకు మారుచుండును. ప్రోటోప్లాజమ్ లోపల రెండు ప్రక్రియలు జరుగును. ప్రాణరహితమైన పదార్థమును లోపలికి తీసుకొని ప్రాణి యొక్క అంగముగా మార్చును. రెండవ ప్రక్రియ ద్వారా ప్రాణి యొక్క అంగీభూత పదార్థమును లోపలినుండి బయటకు తీసి ప్రాణరహిత మొనర్చును.

<u>అమీబా (Ameba)</u> : వనస్పతి జగత్తులో ప్రాణశక్తి యొక్క సర్వతః ప్రథమ వికాసమును బ్యాక్టీరియా అందురు. ప్రాణశక్తి యొక్క అట్టి వికాసమే ప్రాణి జగత్తులో కలిగిన యెడల దానిని అమీబా యందురు. ఈ రెండింటి మూలతత్త్వము ప్రోటోప్లాజమ్ మాత్రమే. ప్రాణుల భౌతిక తత్త్వమైన "ప్రోటోప్లాజమ్" వనస్పతి జగత్తు నారంభించినప్పుడు బ్యాక్టీరియా అనియు, ప్రాణి జగత్తు నారంభించినప్పుడు "అమీబా" అని యనబడును. "బ్యాక్టీరియా", "అమీబా" రెండును ప్రోటోప్లాజమ్ యొక్క వికసిత రూపములే. స్థావరములైన వనస్పతులు జంగమములైన పశు పక్ష్యాదులు మరియు కీటకములు, మనుష్యుల యొక్క ప్రాథమిక రూపములు. ప్రశాంత జలాశయము లోని బురదను సూక్ష్మదర్శిని యంత్ర సహాయముతో పరీక్షించినపుడు బురదలోని పదార్థము చిన్న చిన్న గుండ్రని ప్రోటోప్లాజమ్ యొక్క మూలతత్త్వముతో చేయబడినట్లు తెలియును. సూక్ష్మ నిరీక్షణ వలన యివి ప్రోటోప్లాజమ్ చేత ఏర్పడిన పదార్థము. జీవిత కీటాణువులు. అవి కదులును, పెరుగును మరియు భిన్న భిన్న ఆకారములు ధరించును. ఈ కీటాణువులను "అమీబా" యందురు. అమీబా చేష్టలు విచిత్రముగా నుండును. దీని ఒక భాగము పెరిగి ముఖముగా యేర్పడును. అదే అమాశయము మరియు కాళ్ళుగా పనిచేయును. ఈ కీటాణువుల యే

అంగము కూడా నిశ్చితముగా నుండదు. తన శరీరము యొక్క ఏ భాగము నుండి యే పని తీసుకొనదలచిన ఆ పని తీసుకొనును.

న్యూక్లియస్ (Nucleus) : "అమీబా" శరీరములో ఒక చిన్న ముడి వంటిది యుండును. దానిని న్యూక్లియస్ అందురు. ఈ ముడి "అమీబా" యొక్క "ప్రోటోప్లాజమ్" లోపల నిలువుగా నున్నట్లు గనిపించును. ఇది జనన ప్రక్రియలో చాలా అవశ్యకమైనది. అమీబా యొక్క న్యూక్లియస్ ముడితో గూడిన ప్రోటోప్లాజమ్‌ను ఇంగ్లీషులో "న్యూక్లియేటెడ్ ప్రోటోప్లాజమ్" అందురు. దీనిని సూక్ష్మదర్శిని క్రింద పెట్టి చూచిన అనేక విషయములు తెలియవచ్చును. కొద్ది సమయం తదుపరి అమీబా నిశ్చలమైనపుడు దాని న్యూక్లియస్ రెండు భాగములుగా చీలిపోవును. ప్రతి భాగము వెంట సగము సగము ప్రోటోప్లాజమ్ యుండును. "ప్రోటోప్లాజమ్" "న్యూక్లియస్" యొక్క సగభాగమును ఆక్రమించును. అప్పుడు ఒక అమీబాకు బదులు రెండు స్వతంత్ర అమీబాలు యేర్పడును. వీటిలో ప్రత్యేక అమీబా రెండుగానై నాలుగు అమీబాలు యేర్పడును. ఇట్లు మొదటి అమీబా తన అస్తిత్వము గోల్పోయి తన శరీరము నుండి రెండు, నాలుగు, యెనిమిది భాగములలో విభజించబడి తన జాతి యొక్క భావి సంతతిని ఉత్పన్నము జేయును. తన శరీరమును ముక్కలు ముక్కలుగా జేసి వందల అమీబాలను ఉత్పన్నము జేయును.

కణ విభజన : అమీబా వికాస క్రమములో మధ్యముడి చెదిరి రెండు భాగములలో విభజింపబడునని లోగడ చదివి యుంటిమి. ఈ "న్యూక్లియస్‌యుక్త ప్రోటోప్లాజమ్" యొక్క ఆ రెండు భాగములు విరిగి నాలుగు భాగములలో మరియు యిదే విధముగా అనేక భాగములలో విభజించబడును. అమీబాతో ఉన్నత ప్రాణుల శరీర రచన యొక్క "న్యూక్లియస్ ప్రోటోప్లాజమ్" నుండి కణములు ప్రారంభ

మగును. ఉన్నత ప్రాణుల శరీర రచన యొక్క ఉత్పత్తిలో కూడా యిదే ప్రక్రియ కలుగును. "అమీబా"లోని న్యూక్లియస్ రెండు స్వతంత్ర భాగములలో విభజించబడి తన అస్తిత్వమును నశింప జేసుకొనును. రెండు క్రొత్త అమీబాలు ఉత్పన్నమగును. కాని ఉన్నత ప్రాణులన్నింటిలో మనిషితో సహా ప్రోటోప్లాజమ్ యొక్క కొద్ది భాగమే విడివడి వీర్య కణములుగా మారును. ఆ వీర్య కణములను ఉత్పన్నము జేయు ప్రాణి అట్టి అండములనే అప్పుడప్పుడు ఉత్పన్నము జేయును. కాని అమీబా వలె తన అస్థిత్వము గోల్పోకుండ జీవించియే యుండును. ఏ కార్యము కొరకు అమీబా వంటి నిమ్నశ్రేణి ప్రాణి తన శరీరమును రెండు భాగములుగా విభజించవలసి వచ్చుచున్నదో అదే పనికై ఉన్నతశ్రేణి ప్రాణుల శరీరము యొక్క కొద్ది భాగమే సరి పోవును. కాని గుర్తుంచుకొనవలసిన విషయ మేమన తనవంటి ప్రాణి నుత్పన్నము జేయుటకై తన శరీరము యొక్క ముఖ్య భాగమును వేరుజేయవలసి యుండును.

ఈ చిన్న భాగమే పురుషులలో "వీర్య కణము" లనియు, స్త్రీలలో "రజః కణము" లనియు అనబడును. వీర్యకణములను ఆంగ్లములో "స్పెర్మటోజువా" అందురు. "రజః కణము"లను "ఓవా యందురు. "స్పెర్మటోజువా" మరియు "ఓవా" రెండును "న్యూక్లియస్ యుక్త ప్రోటోప్లాజమ్" యొక్క పిండము తప్ప వేరుకాదు. ఉత్తమ జాతి ప్రాణులలో వీర్యకణములు లేక స్పెర్మటోజువా రజఃకణములు లేక ఓవాతో కలిసినపుడు ఓవా రెండు, నాలుగు, యెనిమిది, పదహారు ముప్పదిరెండు, అరవై నాలుగు యిట్లే చిన్న చిన్న కణములలో విభజించబడును. ఈ వృద్ధి అమీబాతో సమానముగా నుండదు. అమీబాలో దాని రెండు, నాలుగు, ఎనిమిది మొదలగు భాగములే వేరగును. ఉత్తమ ప్రాణులలో కణములు విడిపడవు. కణములు కలిసి

యుండియే వృద్ధిచెందును. ఈ కణములు కలిసి యొక చిన్న పిండముగా తయారగును. దానిలో మాంసము, నరములు, యెముకలు తయారగును. అప్పుడు తల్లి నుండి విడివడి స్వతంత్రముగా జీవించును. అంతకు పూర్వము పిండము తల్లి శరీరము యొక్క భాగముగా నుండును. ప్రాణుల శరీర మిట్లే వృద్ధి జెందును. దీనికి కణముల కల్పన (సెగ్మెంటేషన్, మల్టిప్లికేషన్, బై డివిజన్, సెల్ థియొరీ) అందురు.

శరీరము యొక్క అనేక అవయవములు కేవలము ఈ కణముల తోనే యేర్పడును. వానిలో గుండె యొకటి. మాంసపు ముద్దలు, పేగులు మరియు జ్ఞానవాహిని నాడులు యీ కణములతోనే తయారగును. ఎముకలు, దంతముల వంటి గట్టి పదార్థములు కూడా యిట్లే యేర్పడును. కణముల కలయిక లేక పరివర్తన చేతనే శరీర నిర్మాణమగును.

<u>లింగభేదము</u> : ప్రోటోప్లాజమ్ మరియు న్యూక్లియస్ ముక్కలగుటకు పూర్వము వేరొక అవసర ప్రక్రియ జరుగును. చెరువు నీటిలోని నాచును సూక్ష్మదర్శిని యంత్రముతో పరీక్షించినపుడు అది రెండు రకములైన కణములతో యేర్పడినట్లు తెలియుచున్నది. దీనిని "ఎలిజీ" అందురు. ఈ నాచులో "న్యూక్లియస్‌యుక్త ప్రోటోప్లాజమ్" యొక్క రెండు వరుసలు యెదురెదురుగా యేర్పడును. ప్రత్యేక పఙ్క్తి యొక్క కణములు తన యెదురుగా నున్న కణములతో కలిసిపోవును. ఈ కలయిక వలన నొక నూతన కణ మేర్పడును. ఈ ప్రక్రియలో ఒక కణము, రెండవ కణము వైపు పయనించుట సూక్ష్మదర్శిని యంత్రము ద్వారా చూడనగును. ఎదురెదురు పఙ్క్తులలో నున్న యీ కణములను "పుంలింగము", "స్త్రీలింగము" అని యందురు. ఈ కణముల సంయోగము కానిచో "ఎలిజీ" అనగా యెదురెదురుగా నున

కణములలో ఒకటి నుండి అనేకమగు ప్రక్రియ కాజాలదు. కణముల యొక్క యీ పారస్పరిక సంయోగము సృష్ట్యుత్పత్తి యొక్క ముఖ్యమైన సిద్ధాంతము.

ప్రజనన క్రియ రెండు భిన్న తత్త్వముల సంయోగ ఫలమని పై విషయముల వలన గ్రహించితిమి. ఈ భిన్న తత్త్వములను వ్యవహారిక భాషలో "పురుషుడు", "స్త్రీ" యని యందురు. అప్పుడప్పుడీ తత్త్వముల భిన్నత్వము అనగా విజాతీయ జ్ఞానము సూక్ష్మదర్శిని యంత్రముల ద్వారా స్పష్టముగా గోచరించదు. అయినప్పటికీ వాటి వివిధ కార్యములను జూచి అవి భిన్న భిన్న లింగములు లేక తత్త్వములు అని గ్రహింపవచ్చును. పురుష తత్త్వము, స్త్రీ తత్త్వము అను భిన్న తత్త్వములు ఒక నూతన ప్రాణి యుత్పత్తికై ఉత్పన్నమగును. ప్రజనన క్రియకు అవసరమైన యీ తత్త్వముల నుత్పన్నము జేయు యింద్రియములను జననేంద్రియము లందురు. జనసక్రియకాధారభూతమైన సిద్ధాంతము సంపూర్ణ ప్రపంచములో నొకటిగానే యుండును. ప్రజనన ప్రక్రియను అర్థము జేసికొనుటకై నియమములను జూచి విస్తారముగా నర్థము జేసికొనదగును.

మొక్కలలో ప్రజనన క్రియ: మొక్కల జనన సంబంధ యింద్రియము పుష్పము. కొన్ని పుష్పములు పురుష తత్త్వము నుత్పన్నము జేయును. మరికొన్ని స్త్రీ తత్త్వమును అనేక పర్యాయములు ఒకే పుష్పములో రెండు తత్త్వములు మిళితమై యుండును. పుష్పము యొక్క పుంభాగమును అంగ్లములో స్టైమన్, స్త్రీ భాగమున్కు పిస్టల్ యందురు. స్టైమన్‌లో ఒక ప్రకారమైన సూక్ష్మ, శుద్ధ, దూళి యుండును దానిని పుష్ప కేసరము (పౌలన్) అందురు. స్త్రీ తత్త్వమైన పిస్టిల్ పుష్పము యొక్క మధ్యభాగములో యుండును. అచ్చటనే పుష్పము యొక్క ప్రజనన సంబంధ స్త్రీ తత్త్వము "ఓవ్యూల్"

యుండును. స్టైమన్‌లో పొలన్ యున్నటుల పిస్టిల్‌లో ఓవ్యూల్ యుండును. పొలన్ మరియు ఓవ్యూల్ కలయిక వలన బీజములు లేక ఫల మేర్పడును. పుం, స్త్రీ తత్త్వములు ఒకే పుష్పము నందున్న యెడల అచ్చటనే బీజము తయారగును. ఈ రెండు తత్త్వములు భిన్న భిన్న మొక్కలపై నుండినచో మగపుష్పము యొక్క పుష్ప కేసరము పొలన్ వాయువుచేత నెగురవేసుకొని సమీపములో గల స్త్రీ పుష్ప ఓవ్యూల్‌లో జేరవేయును. ఈ పరిస్థితులలో మగ, ఆడ తత్త్వముల పుష్పములు గల మొక్కలు దూరముగా నున్నప్పటికి సంయోగము జరుగును. తేనెటీగలు, సీతాకోకచిలుకలు మొదలైనవి తమ రెక్కలు మరియు కాళ్ళతో ఉత్పాదక ధూళిని ఒకచోట నుండి వేరొక చోటికి చేరవేసి ఉత్పాదక క్రియలో తోడ్పడును. చిన్నపక్షులు, స్నేల్ మొదలగునవి ఈ ప్రక్రియలో తోడ్పడుచున్నవి. వీటిని మొక్కల వివాహము యొక్క పురోహితుడందురు.

## మనుష్యులలో ప్రజనన ప్రక్రియ

పెద్ద ప్రాణులలో మగ మరియు ఆడ ఉత్పాదక తత్త్వముల కలయిక వలన ప్రాణి ఉత్పన్న మగును. ఈ క్రియకై కొన్ని సహాయక మరియు ఆవశ్యక యింద్రియములు పరమాత్మునిచే సృష్టింపబడినవి. మగవారిలో "శిశ్నము" ఆడవారిలో "యోని". ఈ ప్రాణులలో బహిఃసంయోగము కాక అంతర్ సంయోగము జరుగును. ఈ విధముగా క్రొత్త ప్రాణి జీవిత మారంభమగను.

ప్రత్యేక జాతిలో మనుష్యుడు గుఱ్ఱము, మేక మొదలగు వాని యన్నింటిలో గుహ్యాంగములు మగ, ఆడను దృష్టిలో పెట్టుకొని నిర్మించబడినవి. వేర్వేరు జాతులలో మగ, ఆడ గుహ్యాంగములలో ఆశ్చర్యకరమైన ప్రారంభికానుకూలత కనబడును. ఇది ప్రకృతి

యొక్క పెద్ద వింత. ఈ పారస్పరిక, ఆశ్చర్యకర అనుకూలత తమ జాతిని కొనసాగించుటకు శక్తివంతమైన ఉపాయము విభిన్న జాతుల కలయిక సాధనలో ఆటంకము కూడా యేర్పడును.

స్త్రీ, పురుష జననేంద్రియ కలయికను సంయోగ మందురు. సంయోగమే జనన ప్రక్రియ. జనన ప్రక్రియలో మగవారి వీర్యకణము స్త్రీయొక్క రజఃకణముతో కలియుటయే గాక రజఃకణము యొక్క వలుచని పొరను చీల్చుకొని లోపలికి చొచ్చుకొనిపోవును. లోపలి పదార్థముతో కలిసిపోవును. రజఃకణము వృద్ధి యగును. తిరిగి కణముల విభజన ప్రక్రియలో చెప్పబడిన రీతిగా జరిగిపోవును. అనేక జంతువుల రజఃకణములలో చిన్న చిన్న రంధ్రములు గన్పించును. వీర్య కణములు ప్రవేశించుటకీ రంధ్రములు తోడ్పడును. వీర్యకణములకు పొడుగైన తోక యుండును. అది దాని సహాయముతో రజః కణముల వెదకుచు యోనిలో తిరుగాడును. రజఃకణ పృష్ఠ భాగమును తాకిన వెంటనే దానిని చీల్చుకొని లోపలికి ప్రవేశించును, అటుపై రజఃకణ పృష్ఠ భాగము బయటినుండి గట్టిపడుట వలన వేరొక వీర్య కణము ప్రవేశించుటకు వీలుగాదు. ఈ గట్టిపడుట రజఃకణమునకు కవచముగా పనిజేయును. ఎప్పుడైన ఒక్క రజఃకణములో అనేక వీర్య కణములు ప్రవేశించిన ఒక అద్భుత ప్రాణి (మాంస్టర్) ఉత్పత్తి జరుగును. ఒకవేళ రజఃకణములో రెండు వీర్యకణములు ప్రవేశించినచో కలిసియున్న జంట పుట్టును. కాని యిది అస్వాభావికమైన పరిస్థితి.

రజఃకణము వీర్యకణముతో కలిసినప్పుడు గర్భధారణ జరుగును. రజఃకణము తొందరగానే గర్భాశయ అభ్యంతర పొరపై అతుకుకొనిపోయిన గర్భావస్థ ప్రారంభమగును. మనుష్య జాతిలో సాధారణముగా కేలెండరు ననుసరించి తొమ్మిది మాసములు,

చాంద్రాయణము ననుసరించి పది నెలలుగా యీ సమయ ముండును. గర్భధారణ జరిగిన తర్వాతకూడా కొంతమంది స్త్రీలలో ఋతుస్రావము వికృత రూపములో జరుగును. కాని యిది అసాధారణ పరిస్థితి.

గర్భ సమయమున రజఃకణ వికాసము అనేక దశలుగా పరివర్తన జెందును. చిన్న ప్రాణులలో జరిగే పరివర్తన వంటివే యిచ్చటను జరుగును. ఒక దశలో మానవ గర్భస్థ శిశువు గ్రుడ్డులో నుండి వెడలిన చిన్న పక్షిగా నుండును. తిరిగి కుక్క యొక్క ఆకారము దాల్చును. ఇది పెద్ద పెద్ద వైజ్ఞానికులకే ఆశ్చర్యము గొలుపును. వారే భ్రమలో పడెదరు. భ్రూణము యొక్క కాళ్ళు, చేతులు చిన్న చేపల ఆకారముతో సరిపోవును. కోతివలె వెంట్రుకలతో కప్పబడి నట్లుండును. భ్రూణము యొక్క క్రమవికాసము యీ దృష్టాంతముల వలన ప్రాణ్యుత్పత్తి వికాసవాదులు తమ సిద్ధాంతముల నెలకొల్పిరి. మనుష్యుడు మరియు అల్పప్రాణుల ఉత్పత్తి స్థానము ఒకటే. మనుష్య స్థితి జేరువరకు యేయే దశల నుండి వచ్చుట జరిగి నదో అట్టి దశలన్నియు గర్భములో ధరించుట యైనదని వారి వాదన. కాని యిట్లెందు కగును. ప్రకృతికి యిట్లు జేయు అవసర మేమి కలిగినది? దీనికి పరిణామ వాదులెట్టి సమాధానము చెప్పరు. దీనివలన కోతి నుండి మనిషి పుట్టినాడను నిర్ధారణ జరుగుటలేదు. కాని యీ యోనులన్నిటిని జేసిన వాడొక్కడేయని మాత్రము తెలియుచున్నది. అట్టి అద్భుతశక్తి అంతట వ్యాపించినట్లు కనిపించుచున్నది.

## ఉత్పాదక అంగము

గత అధ్యాయములో జనన ప్రక్రియ వర్ణన జరిగినది. ఈ అధ్యాయములో ప్రజనన అంగములు శరీరశాస్త్ర దృష్టితో వర్ణన జేయ బడినది. శరీరములో ఉత్పాదక అంగము జగత్స్రష్ట ప్రభుయొక్క

రచనా శక్తికి ప్రాతినిధ్యము వహించుచున్నవి. పాపులు మరియు భ్రష్టులు యీ అంగములను దురుపయోగ మొనరించెదరు. శరీరము యొక్క యితర అవయవముల వలె యివి కూడా పవిత్రమైనవి. బాలు రీ అంగముల గురించి యేదో విధముగా తెలుసుకొనగలిగినన్ని విషయములు సక్రమమో, అక్రమమో తెలిసికొనెదరు. పరిణామ స్వరూపముగా వారి ఆలోచనలు కుసంస్కారములను దుర్వాసనతో దుర్గంధపూరితము లగును. వారికి సరియైన అవగాహన కూడా కలుగదు. ఈ జననేంద్రియముల గూర్చి వారి మెదడులో రహస్యమను నల్లటి మేఘములచే ఆవరింపబడి అవి ఘనీభూతములై ఆ యువకుని జీవిత నౌక తుఫాను చేత తల్లక్రిందులు కాకుండా యుండుటకై యీ అంగముల జ్ఞానము వైజ్ఞానిక దృష్టితో కలుగుట ప్రతి వ్యక్తికి అవసరము. జీవితమునకు సంబంధించిన యితర ఆవశ్యక విషయముల మననము వలెనే ఈ అంగముల అధ్యయనము ప్రతి విద్యార్థి ఆత్మ సంయమముతో యేకాగ్రచిత్తుడై చేయవలెను.

స్త్రీ యొక్క ఉత్పాదక అంగము శరీరము లోపః పురుషుని అంగము శరీరమునకు బయట యుండును. ఇచట కేవలము పురుషుని ఉత్పాదక అంగము యొక్క వర్ణన గావించబడును.

శిశ్నము (Penis): పురుషుని జననేంద్రియమును శిశ్న మందురు. ఇది స్పాంజ్ వంటి మెత్తని అవయవము. దీని ప్రధాన కార్యము మూత్ర విసర్జన. పరిపక్వ దశలో యీ అంగము ప్రజనన కార్యమునకు కూడా ఉపయోగపడును. పరిపక్వావస్థకు పూర్వము యీ అంగము యొక్క దురుపయోగము ఆత్మవినాశము వైపు పయనించుటయే యగును. దుశ్చేష్టల వలన యీ అంగము శిథిల మగును. సంయమము కలిగిన పురుషుని అంగము చిన్నదైనప్పటికి

జననకార్యములో ఆటంకముండదు. ఈ అంగములో అనేక రక్తవాహిక ప్రణాళికలుండును. విషయ వాసనలతో శరీరము యొక్క రక్తము యీ నాళముల వైపు ప్రవహించును. జననేంద్రియము ఉత్తేజితమగును. ఇట్టి ఉత్తేజన యే కారణముల వలన కలిగినప్పటికి వాటినుండి తమను కాపాడుకొనవలయును. ఈ రక్తము కొంతకాలము జననేంద్రియములో నుండుట వలన ప్రాణరహితమగును. సంచిత రక్తము ప్రాణరహితమై ఉత్తేజన ఆగిపోయిన తర్వాత శరీరములో ప్రవహించి మొత్తము రక్తమునే కలుషిత మొనర్చును. డా॥ కోథ్ తన గ్రంథము "సెవెన్ స్టడీస్ ఫర్ యంగ్ మెన్"లో యీ అభిప్రాయమును సప్రమాణముగా బలపరచెను. జననేంద్రియ ఉత్తేజము నాటినుండియే జననేంద్రియ చెడుకు ప్రారంభమైనట్లుగా తల్లిదండ్రులు భావించవలెను. ఇది ఆట వస్తువుగా భావించి దానితో ఆడుకొని నష్టపోయెదరు. యువకున కీ విషయము తెలియజెప్పుట యుచితము. అనేకమంది యువకులు పశ్చాత్తాపముతో క్రుంగిపోవుట గమనించుచున్నాము. గతించిన కాలము తిరిగి రాదుగాని రాబోవు సంతతి వీరి కన్నీటితో జాగ్రత్త పడవలెను.

శిశ్నాగ్ర చర్మము (Prepuce) శిశ్నము యొక్క మొదలు పలుచని చర్మముతో ముఖము వరకు కప్పబడియుండును. దీనికి ముందుగానున్న చర్మమును శిశ్నాగ్ర చర్మమందురు. ఇది శిశ్నము యొక్క అగ్ర భాగమును కప్పివేయును. మహమ్మదీయులు, యూదులు యీ ముందోలును కోసివేయించుట ధార్మిక కర్తవ్యముగా భావించెదరు దీనిని వారు సున్తీ అందురు. ఉత్తర భారతదేశములో నిష్టగల పణ్డితులు లఘుశంకకై నీళ్ళు తీసుకొని పోయెదరు. వారు యింద్రియమును స్నానము చేయింతురు అనేకులు ఈ పనికై మట్టిని ఉపయోగించెదరు. లఘుశంక తర్వాత మూత్రేంద్రియమును కడుగనిచో మురికి జేరి పుండ్లు, కురుపులు కలుగును. ముందోలు యొక్క అంతఃపృష్ఠముపై

అనేక చిన్న చిన్న గ్రంథులుండును. వాని నుండి ప్రత్యేకమైన స్రావము వెడలును. ఈ చర్మమును నెమ్మదిగా శిశ్నాగ్రము పైనుండి జరిపి స్రావమును కడిగివేయవలెను. లేనిచో యిది కూడా ఉత్తేజన కలిగించును. కొందరిలో ముందోలు యిరుకుగా నుండుట వలన వెనుకకు జరుగదు. ఈ ప్రకారము శిశ్నముండము యొక్క ముఖము తెరువబడకపోవుట వలన సరిగా కడుగబడదు. కొందరికి ఈ చర్మము పొడుగుగా మరియు అతుకుకొనిపోయి నట్లుండును. ఇట్టి పరిస్థితులలో ముందుకు వచ్చిన ముందోలును కుశలుడైన శల్యచికిత్సకునితో కోయించవలెను. దాని వలన రోగములు రాకుండా నుండును. ముందోలును శిశ్నాగ్రము నుండి జరిపి చల్లని నీటితో కడిగిన యెడల యువకులకు కలిగెడు 75 శాతము రోగములు దూరమగును. ముందోలులో శరీరము యొక్క జ్ఞానవాహిని నాడులు అంతమగును. ఈ స్నానము వలన సంపూర్ణ మస్తిష్కము చల్లబడును. మరియు బాలకుడు అనుచిత ఉత్తేజము నుండి కాపాడబడును. ప్రకృతి వైద్య పితామహుడు లూయీకూనే "లింగ స్నానములో ముందోలు శీతల జలముతో కడుగుట వలన స్నాయువులకు చల్లదనము కలుగుననియు తద్వారా అవి బలపడి రోగ నిర్మూలన చేయు"ననియు నిరూపించెను.

శిశ్నాగ్రము (Glans Penis) : ప్రణాళి ముఖము కోణాకారముగా నుండును. దీనిని అగ్రము (glans) అందురు. దీనిలో అనేక వసామయ గ్రంథులుండును. వానినుండి యొక విధమైన స్రావము వెడలును. ఈ స్రావమును యెప్పుడు కడిగి శుభ్రము చేయవలెను. ఇంతకు పూర్వము చెప్పినట్లు యిది శుభ్రము చేయనిచో యువకులకు అనేక కష్టములు కలుగును. మురికిగా నుండుట వలన ఉత్తేజన కలుగును. అగ్రముయొక్క చర్మము కోమలముగా నుండును. మేరుదండము యొక్క అనేక జ్ఞానవాహిని నాడులు దీనిలో

అంతమగును. ఈ భాగమును యెప్పుడు తెరచి యుంచకూడదు, కడుగునప్పుడు తప్ప యెప్పుడు దీనిని తాకరాదు.

మూత్ర ప్రణాళి (Urethra) : శిశ్నము పొడుగున యుండు ప్రణాళిని మూత్రప్రణాళి లేక ఆంగ్లములో యురెత్రా అందురు. శిశ్నము మాదిరిగా దీనికి రెండు పనులు గలవు. మూత్రాశయములోని మూత్రమును బయటకు తీసికొనివచ్చుట, శుక్రాశయములోని శుక్రమును బయటకు తీసుకొని వచ్చుట. మూత్రప్రణాళి యొక్క దారి మూత్రాశయము (Bladder) వరకు పోవును. దీని లోపల నోరు, కంఠములలో నుండు విధముగా శ్లేష్మ పొరతో కప్పబడి యుండును. మూత్ర ప్రణాళిని మూడు విభాగములుగా విభజించవచ్చును.

స్పంజీ మూత్రప్రణాళి (Spongy Portion) : ఇది శిశ్న ముఖము నుండి ఆరంగుళముల లోపలి వరకు వ్యాపించియుండును. దీని నలువైపుల మాంస కండరము లుండును. వీటి సహాయము వలన మూత్రము, వీర్యము లేక యితర శ్లేష్మమయ పదార్థములు తేలికగా శరీరము నుండి బయటకు వచ్చును.

2. ఆమత్వచ మూత్రప్రణాళి (Membranious Portion) : ఇది మూత్రప్రణాళి యొక్క మధ్యభాగము. ఇది స్పంజీ మూత్రప్రణాళి చివరి నుండి అష్ఠీలా గ్రంథి (Protsate gland ) వరకు వ్యాపించి యుండును. ఈ భాగము యొక్క పొడవు ఒక - అంగుళ ముండును. ఈ భాగము యొక్క మాంస కండరములు యే రోగ సూక్ష్మజీవుల (Bacteria etc.) నైన బయటినుండి లోపలికి రాకుండా ఆపివేయును. మరియు మూత్రాశయము నందున్న మూత్ర ద్వారమును వశము నందుంచుకొనును.

3. అష్ఠీలా గత మూత్రప్రణాళి (Prostatic Portion) : ఇది మూత్రప్రణాళి యొక్క చివరి భాగము. ప్రొస్టేటు గ్లాండు మధ్యనుండి మూ త్రాశయ ముఖము మరియు శుక్ర వాహినీ ప్రణాళికలతో కలియును. ఇది నలువైపుల అష్ఠీలా గ్రంథితో ఆవరించబడి యుండును. సాధారణముగా యిదియొక అంగుళము పొడవు యుండును అష్ఠీలా గ్రంథి యొక్క రోగముల ప్రభావము అష్ఠీలా గత మూత్రప్రణాళిపై పడును. ఇందు లఘుశంక మరియు జనన సంబంధేచ్ఛా జ్ఞాననాడుల కేంద్రములుండును.

కౌపర్ గ్రంథులు (Cowper Glands) : అమత్వచ మూత్ర ప్రణాళి చివర బటానీ గింజలంత రెండు పండము లుండును. వానిని కౌపర్ గ్రంథు లందురు. ఇది ప్రణాళికి రెండువైపుల శిశ్నముయొక్క మూలమునకు సమీపము నందుండును. ఉత్తేజము కలిగినప్పుడు దీని నుండి స్రావము మూత్రప్రణాళిలోనికి జేరును. అది శుద్ధముగా మరియు క్షారీయ శ్లేష్మముగా నుండును. మూత్రము యొక్క ప్రతిక్రియ ఆమ్లముగా నుండును మూత్రప్రణాళిలో ప్రకృతి ద్వారా ఈ చక్కని క్షారీయ ద్రవము స్రవించక పోయినచో వీర్యకణముల జీవనశక్తి ఆమ్లము ద్వారా నష్టపోయెడిది. కౌపర్ గ్రంథుల నుండి స్రవించిన శ్లేష్మము మూత్రప్రణాళి యొక్క అమ్ల ప్రతిక్రియను ఉదాసీనపరచును. ఈ ప్రకారముగా వీర్య కణములకు క్షారీయత మార్గ మేర్పడును.

ఉత్తేజన సమయములో కౌపర్ గ్రంథుల స్రావము అనేకమార్లు వీర్యము లేకుండనే స్రవించుచుండును. యువకుల కీ విషయము తెలియదు. వారు తమ వీర్యము నష్టమగుచున్నదని భీతిల్లి తెలిసీ తెలియని వైద్యుల కడకు పరుగెత్తుదురు. ప్రకటనలు జూచి యువకులు మోసపోయి వైద్యులను జేరుదురు. మందులతో యేమి జరుగదని

తెలిసికూడా వైద్యులు యేవో మందులు వాడెదరు. వాని వలన నష్టమే కలుగును. ఉన్నట్టుండి యెవరికి వీర్యనష్టము కాజాలదు. గ్రంథుల స్రావమును జూచి వీర్యమని యువకులు భీతిల్లెదరు. కడు యింద్రియ లోలతతో చెడిపోయిన వారికి తప్ప యితరుల కెవరికి ఉత్తేజము లేకుండా వీర్యనష్టము జరుగదు.

అష్ఠీలా గ్రంథి (**Prostate Gland**): ప్రొస్టేట్ గ్లాండు యొక్క కొంతభాగము గ్రంథి ధాతువులతో, మరికొంత మాంస ఖండములతో తయారగును. ఇది మూత్రాశయ కంఠమునకు క్రింది భాగమున యుండును. ఆ స్థలములో మూత్రప్రణాళిని నాలుగువైపుల ఆక్రమించి యుండును. మూత్రప్రణాళి ప్రొస్టేట్ గ్రంథిలో నుండి మూత్రాశయముతో కలియును. అందుచేతనే మూత్రప్రణాళి మూడవ భాగమును అష్ఠీలా గత మూత్రప్రణాళి యందురు. ఇది జల్లెడవలె మూత్రాశయ ముఖము మరియు మూత్రప్రణాళి కలియుచోట యుండును సాధారణముగా యిది యొక అంగుళము పొడవు, తులంబావు కంటె కొంచెము అధికము బరువు కలిగియుండును.

దీనికి జనన ప్రక్రియతో విశేష సంబంధము గలదు. అందుచేత అండకోశములను తీసివేసిన యిది నష్టపోవును. వృద్ధావస్థలో కూడా యిది క్షీణించును. జననేంద్రియ మిథ్యాయోగము లేక అతియోగము వలన వృద్ధావస్థలో ఈ గ్రంథి పెద్దదై బాధించును. దీనివలన మూత్రము అడ్డుపడును. అందుచేత దీనిని ఆపరేషను జేయుదురు. కామోత్తేజన సమయమున ఈ గ్రంథి ప్రణాళికలు విశేష స్రావముతో నిండిపోవును. ఈ స్రావము మూత్రప్రణాళి లోనికి పోయి వీర్యముతో కలిసి అందులో భాగమగును. కౌపర్ గ్రంథుల వలె ఈ గ్రంథి కూడా కామవాంఛ సమయమందే స్రవించును. కాని ఈ స్రావము కూడా

వీర్యము కాదని గ్రహించనగును. ఈ స్రావము క్షార గుణము గలది అగుట వలన వీర్యజీవి యెక్కువ కాలము జీవించడానికి పిత్రె గర్భధారణ జరిగే అవకాశాన్ని యెక్కువ చేస్తుంది.

శుక్రాశయము (Seminal Vescicle) : శుక్రము రెండు జల్లెడల వంటి సంచులలో నుండును. అండకోశముల నుండి స్రవించు వీర్యము దీనిలో కూడుచుండును. కామవాంఛ కలిగినప్పుడు దీనినుండి కూడా ఒక ద్రవము వెడలును. అది ఉత్పాదక అంగముల యితర స్రావములతో కలిసిపోవును. ఈ స్రావముల ఉద్దేశ్యము వీర్యకణములు ఈదుచు ఈదుచు బయటకు వచ్చు అవకాశము కలిగించుటయై యున్నది. శుక్రాశయము అనేక కుండలుల లేక గదులతో నిర్మాణ మగును. దీని యిరుకు తల అష్టీలా గ్రంథి వైపు ఉండును. దీని పొడవు రమారమి 2 1/2 అంగుళము లుండును. దీనిలో వీర్య ముండును. ఈ వీర్యము శరీరములో జీర్ణించియైన పోవును లేదా శుక్రసారిణి ప్రణాళి ద్వారా అష్టీలా గ్రంథుల నుండి అష్టీలా మూత్ర ప్రణాళి ద్వారా బయటకు వెడలిపోవును. శుక్రాశయ స్థితి తెలిసికొనిన తర్వాత నాభి మరియు జనన శక్తికి గల ఘనిష్ఠ సంబంధము తెలుసు కొన దగును. నాభి మరియు శుక్రాశయ వరసలో వెన్నెముకలో జనన సంబంధ అంగమును నియమములో నుంచు పెద్ద కేంద్రము గలదు. దానినే ఆంగ్లములో "Lumbar Plexus" అందురు. ఈ కేంద్రము జనన సంబంధ జ్ఞాన తంతువులను నియంతణలో పెట్టును. అందు చేతనే సంధ్య జేయుచు "ఓం జనః పునాతు నాభ్యామ్" అనగా అందరి ఉత్పాదకుడు పరమాత్మ నాభిలో యున్న జనన శక్తిని పవిత్రము జేయుగాక అని ఉచ్చరించెదము.

స్వప్నములో శుక్రాశయము నుండి జరుగు వీర్య స్ఖలనమును స్వప్నదోష మందురు. దీని ముఖ్య కారణము దుస్వప్నముల నుండి

శరీరము మరియు మనస్సు ఉత్తేజితమగును. ఇట్టి స్వప్నముల ప్రభావము శుక్రాశయముపై బడి వీర్య స్ఖలనమగును. దీనినుండి కాపాడుకొనుటకు మానసిక పవిత్రత చాలా అవసరము. ధార్మిక పుస్తకములు మరియు మహాపురుషుల జీవిత చరిత్రలను మననము జేయుట వలన మనసు ఉత్తమ భావములతో నిండిపోవును. ఉత్తమ పుస్తకములలో ప్రత్యేక ఉత్తమ ఘట్టములను మాటిమాటికి అధ్యయనము జేయుట వలన మనసును పవిత్రముగా నుంచుకొనుటకు వీలుపడును.

స్వప్న దోషమునకు అనేకసార్లు శరీరకమే కారణమగును. శుక్రాశయము గుదము, పురీషనాళము, మలాశయముల మధ్యలో నున్నటుల తెలిసికొనినాము. మూత్రాశయము, గుదము నిండి యున్నప్పుడు శుక్రాశయముపై దాని వత్తిడి పడి ఉత్తేజము కలిగి వీర్య స్ఖలనమగు నవకాశము గలదు. కనుక స్వప్నదోషము గలవారు రాత్రి పరుండుటకు పూర్వము మూత్రాశయమును, మలాశయమును ఖాళీ చేసుకొనవలయును.

అండకోశము (Scrotum): ఇప్పటి వరకు ఒక క్రమములో ఉత్పాదక అంగము వర్ణన చేయబడినది. ఇందు ఒక దానికొకటి సంబంధము గల విషయములు పేర్కొనబడినవి. ఇకముందు చర్చించ బోవు అవయవముల గూర్చి తెలుసుకొనుటకు అండకోశ సంబంధ జ్ఞానము చాలా అవసరము. అందుచేత క్రమమును మార్చి విషయము తేలికగా అర్థమగునట్లు చర్చించెదము.

అండముల చర్మ సంచిని అండకోశ 'Scrotum' మందురు. దీనిలో రెండు అండములు ఒకటి కుడివైపు, రెండవది యెదమ వైపున నుండును. కిశోరావస్థలో వీనిపై కొన్ని వెంట్రుకలు పుట్టును. ఈ చర్మమును శుభ్రముగా నుంచుకొనవలెను. లేనిచో దురద వచ్చును

ఈ సంచి లోపలినుండి ఒక పలుచని పొరద్వారా రెండు భాగములలో రెండు అండములు విడివిడిగా నుండునట్లు విభజింపబడి యుండును. మనుష్యుని ఆరోగ్యమును యీ అండకోశములు స్పష్టముగా తెలుపును. ఆరోగ్యవంతులు, బలవంతుల యొక్క కోశము గట్టిగా ముడుచుకొని యుండును. చలి కాలములో యిట్లే యుండును. వృద్ధులలో, బలహీనులలో మరియు వేసవిలో కోశము పొడుగుగా, పేలవముగా నుండును. ఈ కోశములలో అండము వీర్యవాహిని రజ్జు ద్వారా వ్రేలాడబడి యుండును. ఈ రెంటిలో కుడివైపు కంటె యెడమ అండము యెక్కువ క్రిందకు వ్రేలాడుచుండును. పిల్లవాడు పుట్టిన కొంత సేపటికి కడుపులో నుండి ఒక ఛిద్రము ద్వారా అండములు దిగి అండకోశముల లోనికి వచ్చును. కొన్ని పరిస్థితులలో ఆ ఛిద్రము పెద్దదిగా నున్నచో కడుపులోని ప్రేగులు కూడా అప్పుడప్పుడు అండకోశములోనికి దిగివచ్చును. దీనినే 'హెర్నియా' (Hernia) అందురు. ఈ ప్రేగులు అండకోశము లోనికి రాకుండా ఆపుటకు ఒక బెల్టు యుండును. హెర్నియా రోగులు సామాన్యముగా దీనినే ధరించెదరు. వేల్ చేప మరియు యేనుగులో అండములు జీవిత పర్యంతము దాని కోష్ఠగుహ (Abdominal Cavity లోనే యుండును. మనుష్యులు మరియు యితర ప్రాణులలో ఆ విధముగా నుండుట చాలా అరుదైన పరిస్థితి.

<u>అండములు (Testicles)</u>: పిల్లలు పుట్టకముందు తల్లి గర్భములో నున్నప్పుడు అండములు కోష్ఠగుహలో నుండును. పుట్టిన తర్వాత కోశములోనికి దిగివచ్చును. చాలా కొందరిలో అండములు దిగి కోశము లోనికి రావు. ఫలితముగా అండముల యొక్క వృద్ధి మరియు కార్యము శిథిలమగును. అప్పుడప్పుడు ఒకే అండము ప్రకటితమగును. దీని వలన యేవిధమైన హాని కలుగదు. అది వెడల్పుగా అండాకారములో

3/4 ఔన్సు నుండి ఒక ఔన్సు వరకు బరువుగా నుండును. కు
భాగమున గల అండము యెడమ వైపు దానికంటె పెద్దదిగా మరియు
బరువుగా నుండును. దీనికి ఒక నిర్దిష్ట ఆకారము లేదని గుర్తుంచుకో
వలెను. దాని ఆరోగ్యమే దాని పనిలో సహాయముగా నుండును
పురుషుని అండము వలె స్త్రీలో 'ఓవరీ' యుండును. దానినుండి రజ
కణము ప్రతి మాసము ఋతుధర్మము తర్వాత 13 రోజుల తదుప
వెడలును. స్త్రీ యొక్క ఓవరీ శరీరము లోపల నుండును. వాడుక
భాషలో అండకోశ శబ్దమును అండము అను అర్థములో
ప్రయోగించెదరు.

ఖండిక (Lobule) : ప్రతి యొక అండము అనేక ఖండికలతో (Lobules) కలిసి యేర్పడును. ఇది ప్రత్యేక తరహా ముడిగా నుండును అవి సన్నని వలలో యేర్పడును. ఆ వల కూడా బయట, లోపల సూక్ష్మరక్త వాహినులతో కప్పబడును. ఈ ఖండికలలోనే వీర్య కణములు ఉత్పత్తి యగును. అందుచేతనే దీనిని సంస్కృతములో అండము అందురు.

ఉపాణ్డము (Epididymis) : ఖండికల సన్నని ప్రణాళికలు కలిసి ఒక పెద్ద ప్రణాళికలో కలిసిపోవును. దానిని ఉపాణ్డము (Epididymis) అందురు. ఇది అండమును కొంత పైనుండి, మరి కొంత క్రిందినుండి ఆవరించి యుండును. మరియు నిరంతరము యిమ్మడిగా నగుచు మూటలవలె యేర్పడును. అండము యొక్క బయటి నిస్సార ప్రణాళిక యొక్క యిది మొదటి భాగము. అండము నుండి వెడలు వీర్య కణములు మొదట దీనిలోనే కూడుచుండును.

శుక్రవాహిని (Vasdefrance) : కామోత్తేజము కలిగినప్పుడు అండము నుండి శుక్ర కణములు ఉపాణ్డములో జేరును. ఇచ్చటనుండి నెట్టబడి యే బహిః నిస్సార ప్రణాళిలో జేరునో దానిని శుక్రవాహిని

(Vasdefrence) అందురు. దీని నుండి శుక్రము శుక్రాశయము లోనికి జేరును. శుక్రవాహిని యొక్క వ్యాసము పెన్సిలు అడుగు భాగమంత పొడుగు రెండు అడుగు లుండును. ఇది మూత్రాశయము యొక్క అడుగు భాగము నుండి కోష్ఠము యొక్క అంచుల సహాయముతో పైకి వెడలి శుక్రాశయముతో కలియును.

శుక్రసారిణీ ప్రణాళి : శుక్రాశయము నుండి వీర్యము రెండు 3/4 అంగుళము పొడుగు గల శుక్రసారిణీ ప్రణాళికల ద్వారా మూత్ర ప్రణాళి నుండి వెడలును. ఒకవేళ గనేరియా మొదలగు రోగములు అష్ఠిలాగత మూత్రప్రణాళి వరకు వ్యాపించుచో అది శుక్రసారిణీ ప్రణాళి ద్వారా శుక్రాశయము, శుక్రవాహిని, ఉపాణ్డము మరియు అణ్డకోశము వరకు వ్యాపించి ఉత్పాదక అంగములను సంపూర్ణముగా అక్రమించి రోగగ్రస్తము చేయును.

శుక్రకీటము (Speramatozoa) : విషయ వాసనలతో ఉద్రేకము జెందినపుడు అండకోశము నుండి వేల వీర్య కణములు వెడలి శుక్రవాహిని నుండి శుక్రసారిణీ వరకు నుండు సంపూర్ణ అంగములను నింపివేయును. శుక్ర కణములకు ఒక తోక వంటిది యుండును. అది కంఠము కంటె పొడవుగా నుండును. వానిని సూక్ష్మవీక్షణ యంత్రముల (Micro Scope) ద్వారా మాత్రమే చూడ గలుగుదుము. శుక్ర కణములను ఆంగ్లములో (Spermotozoa) అని యందురు. ఇవి ఒక ద్రవములో యీదుచుండును. శుక్రకణము మరియు యీ ద్రవము కలిసి వీర్య మనబడును. వీర్య కణము లత్యంత సూక్ష్మముగా నుండును. ఒకసారి వీర్య స్ఖలనములో 2 కోట్ల నుండి 5 కోట్ల వరకు శుక్ర కణము లుండును. వీనిలో ప్రతియొక్క దానికి రజః కణములతో కలిసి నవజీవన ముత్పన్నము జేయు శక్తి యుండును. శుక్రకణము స్త్రీ శరీరములో ప్రవేశించి రజః కణముల

అన్వేషణలో యిటునటు తిరుగాడుచుండును. అది కనిపించగానే దానితో కలిసిపోవును. రజఃకణము సిద్ధముగా లేనిచో కొన్ని గంటల వరకు అచ్చట నిరీక్షించును. లేక దానిని అన్వేషిస్తూ స్త్రీ యొక్క ఓవరీవైపు పయనించును. ఒకవేళ రజఃకణముతో కలవకపోయినచో అది బయటకు స్రవించును. ప్రతి శుక్రకణము, రజఃకణము తల్లి దండ్రుల భిన్న భిన్న గుణముల ప్రాతినిధ్యము వహించు గుణములు కలిగియుండును. ఈ తత్త్వములను యింగ్లీషులో జీన్స (Genes) అందురు. అందుచేతనే అన్నదమ్ములందరూ ఒకే గుణములు కలిగి యుండక భిన్న భిన్న గుణములు కలిగియుందురు ఒకరిలో నొక గుణము గల జీన్ వికాసము జెందిన యింకొకరిలో వేరొక గుణము గలిగిన జీన్ వికాసము జెందును. అందుచేతనే తాత మనుమల గుణము లలో పోలిక లుండును. తండ్రిలో యే జీన్‌లు వికాసము జెందవో అవి కుమారునిలో వికసించవచ్చును.

శుక్ర కణములపై మత్తు పదార్థముల ప్రభావము తొందరగా కనుపించును. అందుచేత తనకొరకు కాకపోయినను పిల్లల కొరకైనా మాదక ద్రవ్యములకు దూరముగా నుండవలెను. శుక్రకణము లనేకము లున్నప్పటికి ఒక్క దానికి మాత్రమే రజః కణముతో సంపర్క మేర్పడును. మిగిలినవన్నియు చనిపోయి కడిగివేయబడును. గర్భధారణ తర్వాత స్త్రీ సంయోగము వలన శిశువు పెరుగుదలలో ఆటంక మేర్పడును. ఒక వీర్యకణము రజః కణముతో సంపర్కము కలిగిన తర్వాత వేరొక వీర్యకణము రజఃకణముతో సంప్కారము గావించదు. సంయోగము తర్వాత లక్షల కణములు కూడా శిశువు పెరుగుదలకు సహాయపడవు. కాని కీడు కలిగించును. అనేకమంది యువకులు యీ చిన్న సిద్ధాంతముతో అపరిచితులగుట వలన వీర్యము నష్టము చేసుకొని నష్టపోయెదరు.

ప్రఖ్యాత వైజ్ఞానికులందరు "పురుషులు 25 సంవత్సరములకు స్త్రీలు 16 సంవత్సరములకు పూర్వము సంతానోత్పత్తికి యోగ్యులు కార"ని అంగీకరించిరి. ఇంతకు పూర్వము బాల్య వివాహము లేక ఇతర దుశ్చేష్టల వలన మనుష్యుని జ్ఞానవాహిని నరములపై వత్తిడి పడుటచే శరీరము క్షీణించును. ఈ శుక్రకణములను బ్రహ్మచర్య దీక్షతో బయటకు రాకుండా యుంచగలిగినచో నూతనజీవనము కలిగించు శక్తి గల యీ కణములు మనిషిలో శారీరక, మానసిక మరియు ఆత్మిక నవజీవనమును కలిగించును.

శుక్రము మరియు వీర్యము (Spermotoza and sperm) : చాలాకొద్దిమంది మాత్రమే శుక్రకణముల మరియు వీర్యములో గల భేదము గ్రహించెదరు. శుక్ర కణములు అండకోశము నుండి ఉత్పన్నమగును. వీర్యము అనేక స్రావములు కలిసినదాని నందురు. ఇందు శుక్రకీటములు, శుక్రాశయ స్రావము, అష్టిలా గ్రంథుల స్రావము, కూపర్ గ్రంథుల స్రావము కలిసియుండును. వీర్యము యొక్క రంగు పాలవలె నుండి క్షార ప్రతిక్రియ కలిగియుండును. వీర్యము యొక్క రసాయనిక పరీక్షల వలన యిందు కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్ అధిక భాగములో నుండునని తెలియును. ప్రాణమునకు యివి రెండును అవసరము. అందుచేతనే వీర్యనాశము వలన శరీరముపై తీవ్రమైన నష్టప్రభావము కలుగును

రజః కణములు (Ovam) : పురుషుని అండకోశము (Testis) శుక్రకణముల నుత్పన్నము చేసినటుల స్త్రీ యొక్క బీజకోశము (ఓవరీ) రజఃకణముల నిర్మాణము గావించును. పురుషుని మాదిరిగా స్త్రీకి కూడా రెండు బీజకోశము లుండును. అవి ఆకృతిలో, పరిమాణములో అండకోశముల వలె నుండును. గర్భాశయముయొక్క

ఒక్కొక్క వైపు ఒక్కొక్క బీజకోశము మాంస పేశములతో వ్రేలాడబడి యుండును. పురుషుని అండకోశముల వలె యివి శరీరము బయటకు క్రిందికి రావు. ఒక్కొక్క బీజకోశములో ఒక్కొక్క ప్రణాళిక యుండును. దీనిని ఫెలోఫియన్ ట్యూబ్ (Falopian Tube) అందురు బీజకోశముల నుండి రజఃకణము యిదే ట్యూబ్ ద్వారా గర్భాశయములో జేరును. అచ్చటనే శుక్రకణ సంయోగము వలన క్రొత్త జీవన మేర్పడును. ఒక్క ఘనపు టంగుళములో 240 రజఃకణము లుంచ గలిగినంత చిన్నవిగా యివి యుండును. శుక్రకణము చైతన్యవంతము గాను, రజఃకణము స్తబ్దముగాను యుండును. సంఖ్యలో కూడా యివి చాలా తక్కువగా నుండును. సామాన్యముగా ఒక నెలలో ఒకే రజః కణము పరిపక్వమగును. స్వాభావికముగా స్త్రీయొక్క రజఃకణము ఆమె గర్భాశయములో జేరిపోవలెను. అచట శుక్రకణముతో సంపర్క మేర్పడినచో గర్భధారణ జరుగును. కొన్నిసార్లు ఆకస్మిక కారణముల వలన రజఃకణము యొక్క స్వాభావిక మార్గము ఆగిపోవును. అట్టి సమయమున రజఃకణము ఉత్పత్తి స్థానమైన ఓవరీ వెనుక భాగములో అంటుకొనిపోవును. గర్భాశయము వరకు చేరదు. ఇట్టి దశలో వీర్య కణము ఓవరీ వరకు చేరినచో అచ్చటనే గర్భము (గర్భాశయములో శిశువు పెరుగుటకు బదులు అండకోశము- ఓవరీలో) పెరుగదొడగును. ఇది అస్వాభావికమైన విషయము. కొన్ని పరిస్థితులలో యితర స్థలము లలో అండవాహిక యుండుచోట రజఃకణము చేరి శుక్రకణముతో సంపర్క మేర్పడినచో అచ్చటనే గర్భము నిలుచును. అది వికృతావస్థను కలిగించును. దానిని దూరము చేయుటకు డాక్టరుయొక్క కత్తి అపరేషను రూపములో పనిజేయును. కొన్ని సందర్భములలో డాక్టరు ఆయుధము కూడా పనిజేయక తల్లి మరణించును.

ఇటీవల స్త్రీ పురుష సంయోగము లేకుండగనే పిల్లలు జన్మించు పరీక్షలు జేయబడుచున్నవి. పురుషుని వీర్యకణములు సేకరించి భద్రపెట్టుదురు. వాటిని యింజెక్షను ద్వారా గర్భాశయములోనికి పంపించెదరు. మనుష్యులలో కంటె పశువులపై యిట్టి పరీక్షలు అధికముగా చేయబడుచున్నవి.

డాసన్ మహాశయుడు తన గ్రంథము 'కాంజెషన్ ఆఫ్ సెక్స్'లో బాలుడు లేక బాలిక కలుగుటలో తండ్రి కంటె తల్లి ప్రభావ మెక్కువగా నుండునని వ్రాసిరి. తల్లి కుడి అండకోశము నుండి రజఃకణము వచ్చినచో బాలుడు కలుగును. ఎడమ అండకోశము నుండైనచో బాలిక కలుగును. ప్రతి మాసములో తల్లి అండకోశముల నుండి రజఃకణము వెడలును. ఈ విధముగా ఒకవేళ 15 నవంబరు 1895న బాలిక కలిగినచో 280 రోజులు లేక యేడు రోజులు కలిగిన 40 సప్తాహములు తీసివేసినచో ఫిబ్రవరి మొదటి వారములో గర్భము దాల్చి యుండవచ్చును. అది యెడమవైపు నుండి వెడలిన రజఃకణమై యుండవచ్చును. ఇప్పటి నుండి లెక్క ప్రారంభమగును. ఒకవేళ స్త్రీకి యీ గర్భము ఫిబ్రవరికి బదులు మార్చిలో నిలిచియుండినచో కుడివైపు నుండి వెడలిన రజఃకణము వలన బాలికకు బదులు బాలుడు ఉదయించియుండును. ఈ విధముగా మొదటి సంతానము తర్వాత పై సంతానములకు బాలికయో బాలుడో చెప్పవచ్చును. ఈ నియమము ననుసరించి యిచ్ఛానుసారము సంతానము పొందవచ్చునని డాసన్ నమ్మకము.

# కిశోరావస్థ, యవ్వనము మరియు పురుషత్వము అంతఃస్రావమును శరీరములో యిముడ్చజేయుటయే బ్రహ్మచర్యము

పదునాలుగు సంవత్సరముల ప్రాయమునకు పూర్వము శారీరకోన్నతిలో విశేష పరివర్తన కలుగదు. దీని తర్వాత రహస్యమయ సమయము ప్రారంభమగును. 15 సంవత్సరముల బాలుని కన్నుల నుండి అతని హృదయరూప పుటలలో వ్రాయబడిన విషయము గ్రహించవచ్చును. బాల్యము యొక్క సరళత అందు గనిపించదు. అవి భావపూర్ణముగా నుండును. చూచే వారితో మాట్లాడుచున్నట్లుండును యువకుల హృదయముల తెరను తొలగించి ప్రత్యక్ష పరచును. ఏ యువకుడు తన హృదయములో ఉప్పొంగెడు భావములను దాచుటకు ప్రయత్నించడు.

ఈ ప్రాయములో మానసిక పరివర్తనతో బాటు శారీరక పరివర్తన కూడా కలుగును. ఈ పరివర్తనలు 15 సంవత్సరముల ప్రాయము నుండి 25 సంవత్సరముల ప్రాయము వరకు సమయానుసారముగా కలుగుచుండును. జీవితము యొక్క యీ సమయము రహస్యములతో కూడియుండును. పది సంవత్సరముల కాలము ప్రతి యువకుని మస్తిష్కము అనేక గుప్త విషయములను వెదకుటలో ఒంటరిగా నిమగ్నమై యుండును. ఈ కాలమును రెండు భాగములుగ విభజించవచ్చును. కిశోరావస్థ మరియు యవ్వనము. కిశోరావస్థలో శారీరక పరివర్తన ప్రారంభమగును. బాలుర పెదవుల పైభాగము గడ్డము మరియు జననేంద్రియ ప్రదేశము కేశములతో ఆచ్ఛాదితమగును స్వరయంత్రము లోతు పెరుగుట వలన కంఠధ్వనిలో మార్పు కలుగును ఉత్పాదకాంగము వృద్ధి పొంది జీవిత సారభూత వీర్యము యొక్క

సంపాదన ప్రారంభమగును. బాలికలకు యీ దశయందు ఋతు ధర్మము ప్రారంభమగును. ఇది యువావస్థ ప్రారంభదశ. పరిపక్వత వచ్చుటకు యింకను కొంతకాలము పట్టును. యువావస్థ ప్రారంభము యువకుని వివాహార్హత సూచించదు. "The Science of Life" అను గ్రంథములో డాక్టర్ కోవన్ కిశోరావస్థ ప్రారంభ దశ వివాహార్హత సూచించునను విషయము భ్రమయని పేర్కొనెను. స్త్రీ యీ దశలో సంతానోత్పత్తికి యోగ్యురాలని భావించుట కూడా అంతే భ్రమ. శరీరక్రియా విజ్ఞానము ననుసరించి సమున్నత స్త్రీ పురుషులు మాత్రమె సంతానమునకు యోగ్యులని పేర్కొనెను. కిశోరావస్థలో శరీరములు యెముకలు సంపూర్ణ రూపముగా ఉన్నత స్థితిని జేరుకొనవు. ఉత్పాదక తత్త్వము సంపూర్ణ రూపములో పరిపుష్టత చెందలేదని దీని భావన.

కిశోరావస్థ తర్వాత యువావస్థకు జేరును. 15 సంవత్సరముల ప్రాయము నుండి 25 సంవత్సరముల ప్రాయపు ప్రారంభదశ కిశోరావస్థగా, అంతిమ దశ యౌవనావస్థగా పేర్కొనవచ్చును. 15 సంవత్సరాల తర్వాత రెండు మూడు సంవత్సరముల వరకు కిశోరావస్థయే యగును. దాని తర్వాత యెనిమిది సంవత్సరముల వరకు యువావస్థలో శారీరక మరియు మానసిక శక్తిని సంపాదించుట ప్రతి యువకుని కర్తవ్యమై యున్నది. తన ఖాతాలో కొంత సొమ్ము నిలువ చేసుకొనకుండా వ్యాపారము ప్రారంభించుట వలన జీవితమను వ్యాపారములో దివాలా యగును.

కిశోరావస్థలో యెల్లప్పుడు 15 సంవత్సరములకు మరియు నవ యౌవనము యొక్క అంతము 25 సంవత్సరముల కగు నియమము లేదు. మానవ జీవితము చాలా విచిత్రమైనది. ఈ దశలు త్వరగా రావచ్చును లేదా ఆలస్యముగా రావచ్చును. వీటిపై భోజనము, వస్త్రము

మరియు మనుష్యుల అవాస నివాసముల ప్రభావము ఉండును. శీతోష్ణ స్థితి, నీటియొక్క ప్రభావముండును. గ్రామములలో సాధారణముగా తపోమయ జీవితము గడుపు వారికి కిశోరావస్థ ఆలస్యముగా వచ్చును. భోగ విలాస జీవితము గడుపు వారికి త్వరగా మీసము, గడ్డము వచ్చి పెద్దవాడుగా గనుపించును. సమయము కంటె ముందు కిశోరావస్థ వచ్చుట ప్రమాదకరము. ఆశించిన దానికంటె యెక్కువ తెలివి లేక చతురత గలిగియుండుట సందేహాస్పదమైన విషయము. కామవాంఛ త్వరగా కలుగుట జీవితమును నష్టపరచును. ఋతువులో పండిన పంటే సహజత్వము కలిగియుండును. మాగపెట్టిన పండులో దానికి గల తాజాదనమును పోగొట్టును. తల్లిదండ్రులు మరియు గురువులు దీనిపై యెంత శ్రద్ధ చూపినను అంత తక్కువేయగును.

అయినచో మానవుని శరీరము మరియు మనసు యొక్క యీ ఆకస్మిక పరివర్తనకు కారణమేమి? ఏ రహస్యమయ కారణము వలన మనుష్యుడు మొదట కిశోరుడు లేక కిశోరీ తిరిగి యువకుడు లేక యువతి మరియు అంత్యమున పురుషుడు లేక స్త్రీగా మారుచున్నారు?

ఈ ప్రశ్నలకు సమాధానము కనుగొనుటకు పూర్వము గ్రంథుల (glands) పరిజ్ఞాన మవసరము, శరీర క్రియా విజ్ఞానవేత్తల పరిశోధన వలన శరీర రచనలో గ్రంథుల స్రావము యొక్క పాత్ర ప్రముఖముగా కలదని తేలినది. నోటిలో లాలాజల గ్రంథులు (Salivary Glands) ఉండును. దీనినుండి లాలాజలము ఊరును. అందుచేతనే నోరు ద్రవితముగా నుండును. ఒకవేళ యిది స్రవితము గానిచో జీవించుట కష్టమగును. ఆమాశయమునకు దాని గ్రంథు లుండును. వీటినుండి జీర్ణరసము (Gastric Juice) వెడలును. యకృత్ (Liver), అగ్న్యాశయము (Pancreas) మరియు అండములు (Testicles) కూడా స్రావక గ్రంథులు. ఈ స్రావములు కొన్ని జీర్ణము గావించునవి,

మరికొన్ని ఉత్పాదక క్రియకు మరియు కొన్ని శరీర రచనలో పాలు పంచుకొను స్రావములు గలవు.

మొదట శరీరక్రియా విజ్ఞానవేత్తలు తమ స్రావములను ప్రణాళికల ద్వారా శరీర భాగములలో కలుపు గ్రంథులతోనే పరిచయము కలిగి యుండిరి. ఇవి చూచుటకు శ్లేష్మ పొరల (Mucus Membaranes) వలె లోపల యుండవచ్చును. లేదా చర్మమువలె బయట నుండవచ్చును. ఈ స్రావములు శరీరము లోపల బయట ఒక స్థలము నుండి వేరొక స్థలమునకు తీసికొని వెళ్ళుటకు స్రావక నాళముల వంటివి యున్నవను విషయము కూడా వీరికి తెలిసియుండెను. యకృత్ స్రావమును తమ స్థానమున జేర్చుటకై లోపల నాళముల వంటివి యుండును. చెమట మరియు కన్నీరుకై బయటకుండును. మూత్రము, స్వేదము (చెమట) కన్నీరు వంటి స్రావములను బయటకు పంపించవలసియే యుండును. ఇవి బహిఃస్రావక ప్రణాళి ద్వారా బయటకు పంపబడును. వీటిని శరీరములోనే ఆపివేసినచో అపకారము కలుగను. లాలాజలము, పిత్తరసము మొదలగు స్రావములు శరీరము లోపలి క్రియలకు అవసర మగును ఇవి బయటకు పంపదగినవి కావు. ఇవి అంతఃస్రావ ప్రణాళికల ద్వారా వీటి అవసర మెచ్చట నుండునో అచ్చటికి చేర వేయబడుచుండును.

Physiology) విజ్ఞానము పెరుగుచున్న కొలది శరీరమందు గల యితర రచనల విషయమై క్రొత్త క్రొత్త విషయములు తెలియుచున్నవి. మొదట కేవలము "ప్రణాళియుక్త గ్రంథుల" విషయమే తెలిసియుండెను. కాని తర్వాత గ్రంథులను పోలి ప్రణాళి యుక్తము కానట్టి కొన్ని గ్రంథులు కనుగొనబడెను. మస్తిష్కములో పీనియల్, కంఠములో థైరాయిడ్ మరియు కోష్ఠములో ఎడ్రినల్ గ్రంథుల విషయమై అవి జేయు పనుల విషయమై యిప్పటి వరకు

తెలియకుండెను. వీటిలో ప్రణాళిక (Ducts) లుండవు. పరిశోధన తర్వాత వీటి రచన యితర గ్రంథుల వలె నుండును. ఇవి ప్రణాళి రహితమై యుండునని తేలినవి. డాక్టర్ దేసిస్ బర్మన్ తన గ్రంథము "ది గ్లాండ్స్ రెగ్యులేటింగ్ పర్సనాలిటీ"లో థైరాయిడ్ మరియు ఎడ్రినల్ స్రావములను వదలుటకు దృశ్యమార్గము కలిగియుండక పోవుటచే వీనిని గ్రంథులుగా పరిగణించలేదని పేర్కొనెను. వీటిని యిప్పుడు ప్రణాళిరహిత గ్రంథుల (డక్టులెస్) శ్రేణిలో చేర్చనైనది.

ప్రణాళిరహిత గ్రంథులను తెలిసికొనుట యొక్క నూతన అన్వేషణ మన శరీరములో "ప్రణాళిసహిత గ్రంథులకో స్రావము ప్రణాళి ద్వారా ఒక స్థలమునకు జేరును. వాటిని బహిఃస్రావము (External secretion) అని యందురు. ప్రణాళిరహిత గ్రంథుల స్రావము ప్రణాళి లేకపోవుటచే శరీరములోనే యిమిడిపోవును. దానిని అంతఃస్రావము (Internal secretion) అని యందురు. అంతః స్రావములనే వైజ్ఞానిక భాషలో హార్మోన్లందురు. శరీర రచన శాస్త్ర పండితులు హార్మోన్ల లోపమున్నదని చెప్పినపుడు ఆ వ్యక్తిలో అంతఃస్రావము నుత్పన్నము జేయు గ్రంథులు సరిగా పని జేయుట లేదని గ్రహించవలెను. ప్రాచీన ఋషుల పరిభాషలో దీనినే "బ్రహ్మచర్య" అభావముగా పేర్కొనిరి. "బ్రహ్మచర్య లోపము వలన అన్ని వ్యాధులు కలుగును" అని చెప్పిన దానినే నేటి వైజ్ఞానికులు "హార్మోన్ల లోపము వలన అన్ని వ్యాధులు కలుగు"నని చెప్పుచున్నారు. ఇరువురి అభిప్రాయము లొక్కటే. శరీరక్రియ విజ్ఞానవేత్తల అభిప్రాయము ప్రకారము కొన్ని గ్రంథులు థాయిరాయిడ్ (Thyroid) మరియు ఎడ్రినల్ (Adrinal) వంటివి అంతఃస్రావములను ఉత్పన్నము జేయును. ఆమాశయ లాలాజల గ్రంథుల వంటివి బహిఃస్రావములనే ఉత్పన్నము జేయును.

అగ్న్యాశయ, అండకోశము, యకృత్ వంటి గ్రంథులు అంతర్బహిః స్రావముల నుత్పన్నము జేయును.

కిశోరావస్థలో శారీరక మరియు మానసిక పరివర్తనము వలన అండకోశముల అంతర్బహిః స్రావము కలుగును. అండకోశము తీసివేసిన వ్యక్తిలో పురుషత్వ ముండదు. ఒకే వయస్సు గల లేగలను తీసుకొని ఒకదాని అండకోశములు తీసివేసి, మరొకదాని అండకోశము పెరుగనిచ్చినచో వాటి శరీర నిర్మాణములో స్పష్టమైన భేదము కనుపించును. అండకోశము తీసివేయని లేగ శరీరము సంపూర్ణ వికాసము జెంది, శక్తిశాలియై అత్యంత ఉత్సాహము కలిగియుండును కాని రెండవ లేగ మెడ మరియు కొమ్ములు చిన్నవై నొసటిపై సన్నని వెంట్రుకలు కలిగి అమాయకముగా, బలహీనముగా గన్పించును. ఇదే స్థితి గుఱ్ఱములో కూడా గాననగును. అండచ్ఛేదము కాని గుఱ్ఱము ప్రకృతి సహజముగా బాగుగా యెదుగును. దాని లావుపాటి మెడ దానిపై మెరయుచున్న వెంట్రుకలు పొడుగాటి పరిపుష్ట శరీర నిర్మాణము, యెగురుచు వేస్తున్న నడక అందరి మనసులను ఆహ్లాదపరచును, దాని చురుకైన నడక, నృత్యము, పుష్టికరమైన ఆకారము అందరిని ఆకట్టుకొనును, రెండవవైపు చాకలివాని బలహీనమెన గుఱ్ఱము సందుగొందులలో తిరుగాడుచుండును. ఈ రెండింటి భిన్నత్వమునకు కారణము స్పష్టము. మొదటి దానిలో అండకోశము లట్లే యుండి ఉత్పాదన శక్తి కలిగియుండును. రెండవ దానిలో ఉత్పాదన శక్తి యుండదు.

మహమ్మదీయ రాజులు స్త్రీలు నివసించు యిండ్లలో నపుంసకులను నియమించుచుండిరి. వారి అవసరము యెక్కువైనపుడు చిన్న పిల్లల అండకోశములు తీసివేసి వారిని అంతఃపురమునకు యోగ్యులుగా

జేయుచుండిరి. డాక్టర్ పుట్ కథనము ననుసరించి ఇటలీలో 18వ శతాబ్దములో ప్రతి సంవత్సరము నాలుగువేల మంది బాలుర అండకోశములు తీసివేయుచుండిరి. వారు ప్రజలను గాన విద్యలతో సంతోషపరచవలసి యుండెడిది. ఈ బాలుర పురుషత్వము అణచి వేయబడుట వలన వారి కంఠము పురుషుల కంఠధ్వని వలె గాక స్త్రీల కంఠధ్వని వలె సన్నగా నుండుచుండెను.

అండకోశముల అంతఃస్రావము వలన పురుషుల పురుషత్వము బీజకోశముల అంతఃస్రావము వలన స్త్రీలలో స్త్రీత్వము వచ్చును. పురుషుల అండకోశములు తీసివేసినచో వారిలో స్త్రీల వంటి లక్షణములు గాననగును. స్త్రీ పురుషుల సమవికాసము యీ గ్రంథుల వలననే నగును. ఈ గ్రంథులు యెంత పుష్టి లేక క్షీణించియుండునో వ్యక్తులు కూడా అంతే పుష్టి లేక నీరసముగా నుందురు.

అండకోశముల స్రావము బయటకు మరియు లోపలకు ఉండును. అంతఃస్రావము బాల్యము నుండియే ప్రారంభమగును. ఈ అంతఃస్రావము శరీరములో యిమిడిపోయి మనుష్యుని బలవంతునిగా జేయును. బహిఃస్రావము శరీరము పరిపక్వ దశయందు యౌవనములో నగును. ఇదే జనన క్రియకు సహాయపడును.

అంతఃస్రావము లింఫ్ (Lymph) మరియు రక్తము ద్వారా శరీరములో యిమిడిపోవును. వీటి ద్వారా యిది మస్తిష్కము మరియు మేరుదండములో ప్రవేశించి యొక అపూర్వ శక్తిని ప్రదానము జేయును. ఈ అంతఃస్రావము వలననే గుఱ్ఱము, యెద్దు, పహల్వాను తమ శక్తిని ప్రదర్శింతురు. అంతఃస్రావము నిరంతరము జరిగి శరీరములో యిమిడిపోయినచో శరీరములో అవయవముల సమవికాసము జరుగును. మోటు ముఖము కూడా అందముగా గనుపించును. ఈ

గ్రంథులు యెవరిలో నుండవో లేక క్షీణించియుండునో వారి శారీరక వృద్ధి ఆగిపోవును. ఉత్పాదక అంగముల దురుపయోగము గావించినచో అంతఃస్రావములో ఆటంక మేర్పడును. పరిణామ స్వరూపముగా శారీరక, మానసిక, ఆత్మికశక్తి ఆగిపోవును. విషయ వాసన వలన ఉత్పాదక గ్రంథులు బహిఃస్రావము నుత్పన్నము గావించును. ఈ బహిఃస్రావము అంతఃస్రావము యొక్క ఉత్పత్తిని ఆపివేయును. అంతఃస్రావమే శరీరము యొక్క భోజనము. స్వయముగా శరీరములో యిమిడిపోవును. అది ఆగిపోయినచో శారీరక ఉన్నతి కూడా ఆగిపోవును. అంతఃస్రావ కాంతియే సన్యాసుల, మహాత్ముల ముఖముపై కనుపించు దివ్యతేజము. ఇది శరీరమంతట నవజీవనము కలిగించుచు పురుషత్వమును వృద్ధి జేయును. ఆయుర్వేద పరిభాషలో యీ అంతఃస్రావమునే "ఓజము" అందురు. బహిఃస్రావము కొరకు అదే తత్త్వము అంతఃస్రావ రూపములో శరీరమును తేజస్వితము మరియు ఓజోయుక్త మొనరించును. బహిఃస్రావమైనపుడు మనుష్యుడు తేజోహీను డగును.

పైన వివరించినటుల అంతఃస్రావము జన్మతో ప్రారంభమగును కాని బహిఃస్రావము శుక్రకణములు (Spermatozoa) యేర్పడి నప్పటి నుండి జరుగును. యువావస్థకు జేరినపుడు అనగా 25 సంవత్సరముల ప్రాయము నుండి బహిఃస్రావము కూడా నిరంతర మగుచుండును. అత్యల్పముగా మాత్రమే వీర్యము కోశములో కూడుచుండును. బహిః స్రావము వీర్యకోశములోనికి పోయి శరీరములో యిమిడిపోవును లేదా వీర్యకోశము నిండిపోయిన స్ఖలనమగుట మొదలుపెట్టును. ఇది మూడు విధముల స్ఖలనమగును.

1. తన యిచ్ఛతో బయటకు తీయుట : వీర్యకోశము నిండిన తర్వాత పురుషుడు తన యిచ్ఛతో వీర్యనాశము గావించుకొనును.

ఇచ్ఛాపూర్వకముగా వీర్య స్ఖలనము చేయుట కేవలము గృహస్థులు సంతానోత్పత్తికి మాత్రమే ఉచిత సమయమునందు గావించుట దోషము గాదు అట్లుగాక యితర యే ఉపాయము వలననైనను వీర్యము వంటి అమూల్య పదార్థమును వ్యర్థము చేయరాదు.

2. ఇది స్వయముగా స్ఖలించును. వీర్యకోశము మలాశయ, మూత్రాశయముల మధ్య నుండును. రెండును నిండిపోయి శుక్రాశయముపై వత్తిడి పడుటచే ఉత్తేజము కలిగి వీర్యము స్ఖలన మగును. ఇట్టి దోషము కలవారు కడుపు శుభ్రముగా నుంచుకొనవలెను. మల విసర్జనలో ముక్కుట తగదు. నిపుణుడైన వైద్యుని సంప్రదించుట కూడా అవసరమగును. ఈ దోషము రోగ సూచకము.

3. శుక్రాశయము నిండినపుడు పరుండు సమయమున యెట్టి దురాలోచనలు కలిగినను వీర్య స్ఖలనమగును: దీనినే స్వప్నదోష మందురు. శుక్రాశయము నిండకున్నను పగటిపూట చదివిన చెడు గ్రంథముల ప్రభావము వలన లేక యితర ఆలోచనల వలన కూడా స్వప్న స్ఖలనమగును. స్వప్న దోషమునకు రెండు కారణములు గనపించుచున్నవి. శుక్రాశయము నిండుట లేక దుస్వప్నములు. దుస్వప్నముల వలన కలుగు వీర్య స్ఖలనమును రోగముగా భావించి వైద్యోపచారము జేయవచ్చును. కాని శుక్రాశయము నిండినప్పుడు స్వప్నములో కాని మెలకువలో గాని స్ఖలనము యెంతవరకు అనుచితము ? అనునది ప్రశ్నగానే మిగిలిపోవును.

ఈ విషయమును గురించి ఆలోచించునపుడు యిరవయ్యవ శతాబ్దపు పండితుడైనను లేక మొదటి శతాబ్దపు మిడిమిడి పణ్డితుడైనను వీర్య నాశనమును అనుచితముగానే భావించును. ఉత్పాదక గ్రంధుల అంతఃస్రావము (ఓజము) శరీరములో యిమిడినప్పుడు బహిః స్రావము

శరీరములో యెందుకు యిమడదు? బహిఃస్రావము శరీరములో యిముడుట యొక్క పరిణామము ఆశ్చర్యకరముగా నుండును. బహిఃస్రావము స్వయముగా శరీరములో యిమడదనుటలో సందేహము లేదు. శుక్రాశయము నిండినపుడు యిది బయటకు వెళ్ళుటకు ప్రయత్నించును. అందుచేతనే అటువంటి వ్యక్తుల కొరకు ఋషులు వివాహ వయస్సు 25 సంవత్సరములని నియమించిరి. స్వాభావిక జీవితము గడుపుచున్న వారికి 25 సంవత్సరములలో వీర్యకోశము నిండును. 25 సంవత్సరముల ప్రాయము వరకు గడిపిన బ్రహ్మచర్యము నికృష్ట బ్రహ్మచర్యమనబడును ఇదొక ఆదర్శము కాదు. ప్రాచీన కాలపు యోగులు బహిఃస్రానము రక్తములో పునః కలిసిపోవు అభ్యాసము చేయుచుండిరి. అది నూతనశక్తి యొసంగును. అట్టి మహాత్ములను "ఊర్థ్వరేతస్కులు" లేక "ఆదిత్య బ్రహ్మచారు" లందురు. వీరు 48 సంవత్సరముల వరకు బ్రహ్మచర్యము పాటించుచుండిరి. ప్రాచీన భారతదేశములో అస్కలిత బ్రహ్మచర్యము పాటించుచు అధ్యాత్మిక గురువుల వద్ద శిక్షణ పొందుచుండుట అవసరమనుకొనిరి. ఆ కాలములో మానవ సమాజములో గురువులు తమ శిష్యుల నడతను చక్కజేయుటకు ప్రయత్నించుట తమ ముఖ్యోద్దేశ్యముగా భావించిరి. వారి లక్ష్యము ఉన్నతమైనదిగా నుండెను. అఖండశక్తి భండారమైన పరమేశ్వరుని అన్వేషణలో జీవితము గడుపుచుండిరి. ఆతని ధ్యానములో "మరణం బిందుపాతేన జీవనం బిందు ధారణాత్" అను తత్త్వమును అవగాహన జేసుకొని వీర్యము వంటి ప్రాణశక్తిని సంగ్రహించుచుండిరి. నిదురలో గాని, జాగరణలో గాని, స్వాభావికముగా గాని లేక తాను స్ఖలనము గావించుకొని గాని వీర్యనాశము చేయుట ప్రాణాఘాతమని గుర్తించుట యువకుల కెంతో అవసరము.

యువకులు ఉత్పాదక అంగముల అంతఃస్రావము శరీరములో యిముడుట వలన కలుగు మహత్త్వమును గుర్తించినచో దానవీయ

ప్రలోభములలో చిక్కుకొనుటకు పూర్వము అనేకసార్లు ఆలోచించి పతనము నుండి కాపాడుకొనెదరు. కిశోరావస్థ శరీరము వికాసము నెందు సమయము. ఇదే కాలములో శరీరము యొక్క సంపత్తి వృద్ధి నెందును. స్వల్ప సుఖము కొరకై వీర్యము వంటి అమూల్య సంపదను వ్యర్థపరచుకొను వారి దౌర్భాగ్యమును చూసిన విచారము కలుగును కాముకతను కలిగించు అన్ని చెడు విషయములు అంతఃస్రావమును ఆటంకపరచి బహిఃస్రావమును కలిగించి యువ సమాజమునకు నష్టము కలిగించును. యువకమండలిలో భోగ విలాసములకు లోటు లేదు. ఈ దశలో అంతఃస్రావము దాదాపు అంతరించుచున్నది. ఉత్పాదకాంగములను అలయ జేయక బహిఃస్రావము కాదు. ప్రాచీన ఋషులు, ఆధునిక శారీరక విజ్ఞానవేత్తల ననుసరించి ఉత్పాదకాంగము అలిసిపోవుటవలన అంతఃస్రావము శరీరమంతా యిముడుట ఆగిపోవును.

శరీర సమవికాసము కొరకు అంతఃస్రావము, బహిఃస్రావము రెండును అవసరమే. బహిఃస్రావము అధికమైనపుడు అంతఃస్రావమునకు ఆటంక మేర్పడును. బహిఃస్రావమును కూడా అంతఃస్రావముగా మార్చుట వలన శరీరములో అద్భుతమైన శక్తి కలుగును. అంతః స్రావమును బహిఃస్రావమును శరీరములో ధరించి కిశోరావస్థ, యవ్వనము మరియు పురుషత్వములను సక్రమముగా వికాసము జెందునట్లు జూచు కొనుట యువకుల కర్తవ్యము. వీర్యనాశము ద్వారా అంతఃస్రావములో ఆటంకము కలిగించుట వలన కిశోరుని కిశోరుడుగా నుండనీయదు. యువకుని యౌవనమును, పురుషుని పురుషత్వమును అంత మొందించును.

## ఇంద్రియ నిగ్రహము

స్వాభావిక జీవనము : మనము జీవితము గడిపే అస్వాభావిక పరిస్థితులలో నేడు బ్రహ్మచర్యము ఖండితము గాకుండ యుండుట

అసంభవ మనుపించుచున్నది. శరీరశాస్త్ర దృష్టితో "బ్రహ్మచర్యము" యొక్క అర్థము గ్రహించుటకు స్వాభావిక పరిస్థితులలో బ్రహ్మచర్యమును గ్రహించవలెను. ఆ సమయముతో శారీరక అంతరంగిక పరిస్థితి యెట్లుండును? ఆలోచింతము.

ఇంతకు పూర్వము చెప్పినట్లు అండకోశముల అంతఃస్రావము జీవితారంభము నుండి అంతము వరకు నిరంతరము సాగుచునే యుండును. ఈ స్రావము స్వయముగా శరీరములో యిమిడి శారీరక, మానసిక ఉన్నతికి సహాయపడును లోలోపల ఉత్పన్నమై యిమిడి పోవుట వలన యీ రసమును "ఓజము" అందురు. ఇది స్నాయువులను శక్తివంత మొనర్చును. శరీరమును తేజోవంతము జేయును. కండరములకు పుష్టి నిచ్చును. 15-20 సంవత్సరముల ప్రాయము కలిగిన యువతీ యువకుల ముఖముపై వర్చస్సు కలుగును. వారెంత నల్లగా నున్నప్పటికి వారి ముఖములపై కొంత కాంతి గనుపించును. అంతఃస్రావము శరీరములో యిముడుట వల్లనే యిది కలుగును.

బహిఃస్రావములో అండకోశముల నుండి విడివడిన జీవ కణములే (Living cells) బయటకు వచ్చును. వీటిని ఆంగ్లములో "Spermotozoa" అందురు. ఇవే శుక్ర కణములు. మనుష్య శరీరము పరిపక్వమైనపుడు బహిఃస్రావము కలుగును. ఇది జీవితములో నిరంతరము జరుగదు. స్వాభావిక జీవితము గడుపు పురుషులలో ఈ ప్రక్రియ 18-20 సంవత్సరముల ప్రాయములో ప్రారంభమగును. 45-50 సంవత్సరముల ప్రాయము వరకు మాత్రమే జరుగుచుండును. అంతఃస్రావము వలె బహిఃస్రావము శరీరములో స్వయముగా యిముడదు. యోగాభ్యాసము వలన మరియు బ్రహ్మచర్య నియమముల వలన దీనిని శరీరములో యిముడ జేయవచ్చును. ప్రాచీన గురుకులములలో యోగవిద్య నేర్పబడు చుండెడిది. బ్రహ్మచర్య దీక్ష తీసుకొనిన

సంయమ పురుషులను ఊర్ధ్వ రేతస్కులు లేక అదిత్య బ్రహ్మచారు లనుచుండిరి. వారి వీర్యము జీవిత పర్యంతము స్ఖలనము గాకుండా యుండెడిది. కాని యీ ఆదిత్య బ్రహ్మచర్యము సామాన్యులకు అనుసరణీయము గాదు. ఆదిత్య బ్రహ్మచర్య దీక్ష తీసుకొనలేని వారికి బహిఃస్రావ కాలమునే వివాహ సమయముగా అనగా యువకులకు 25 సంవత్సరములు, యువతులకు 16 సంవత్సరములుగా నిర్ణయించ నైనది. పురుషునకు అండకోశముల నుండి శుక్ర కణములు విడివడి శుక్రవాహిని నాళముల ద్వారా శుక్రాశయములో ప్రవేశించి స్వాభావిక ముగా పురుషునిలో ఉత్తేజమును కలిగించును. ఈ దశలో వివాహము జరిగినచో అంతఃస్రావములో ఆటంక మేర్పడదు. స్త్రీ పురుషులకు హానికి బదులు లాభమే కలుగును.

కాని నేటి అస్వాభావిక యుగమునందు స్వాభావికతను గురించి ఆలోచించు అవకాశమే లేదు. దూషిత పద్ధతులచే కృత్రిమ ఉపాయముల ద్వారా వయసు రాకపూర్వమే బహిఃస్రావము కలిగించుకొనుచున్నారు. స్వాభావిక జీవితము నేడు కాల్పనిక విషయముగా మారినది. వర్తమాన జీవన విధానము తెలుసుకొనుటకై అస్వాభావిక, అప్రాకృతిక జీవనము నధ్యయనము చేయుట అవసరమై యున్నది. ప్రకృతి నియమముల నెట్లుల్లంఘించుచున్నామో తెలిసికొనవలసి యున్నది.

## అస్వాభావిక జీవనము

నేటి రోజులలో నామమాత్రమునకైనను సంయమము గన్పించదు. రెండు విధముల యింద్రియ సంయమమునకు నేడు విఘాతము కలుగుచున్నది. ఒకటి తెలిసి జేయుట, రెండు తెలియక జరిగిపోవుట.

తెలిసి సంయమహీన జీవితము గడుపుట శరీరమును, మనస్సును కలుషిత వేదికపై నెక్కించి బలి యివ్వబడుట యగును. ఈ గుండములో పడిపోకుండా ప్రయత్నము జేసి విఫలురమై యుండ వచ్చును. ప్రలోభము కలిగినప్పుడు మనసు మనము అదుపులో పెట్టుకొనజాలక పోయితిమి. ఒక్కొక్కప్పుడు మన శరీరములో పాపము యెడ ద్వేషము నిండి యుండవచ్చును. మన పతనమునకు మనము కారకులము కామని భావించవచ్చును. కాని ఆలోచించినప్పుడు మన చేతనాశక్తిలో మన కోరిక యను సున్నిత తంతువు, అప్పు డప్పుడు విశాల రూపము ధరించుచు నిక్షిప్తమై యుండును. అదే మనను మంచి సమయములో వంచించును. మొదట ఒక సామాన్యమైన ప్రవృత్తి ఉత్పన్నమై చిన్న కోరికగా పరివర్తన జెందును. అదే పరిపక్వమై 'అలవాటు' లేక 'స్వభావము'గా మారును. ఇదే నిరంతరము నడచుచుండును. అందు జాగరూక కోరిక యొక్క అవిరళ శృంఖలత కనుపించును. అయిష్టములో యిష్టమను బీజము నిక్షిప్తమై యున్నది. ఈ దశలో మానవుడు తన ఆత్మ పతనము జెందినట్లు గ్రహించినప్పుడు తన నోటి నుండి అప్రయత్నముగా ఈ మాటలు వెడలును. "జానామి ధర్మం నచమే ప్రవృత్తిః జానామ్యధర్మం నచమే నివృత్తిః". ధర్మమును గ్రహించి కూడా అటువైపు వెళ్ళను. అధర్మమును తెలిసి కొని కూడా వివశుడనై అటువైపే సాగిపోవుదును. అత్యంత భయానక మైన స్థితి సర్వత్రా వ్యాపించుచున్నది. మన చేతిలో మనమే శరీరమను భవనము యొక్క ఆధార శిలను పెకిలించుచున్నాము. పరమాత్మని రాజ్యములో యింతకన్న ఘోర పాపమేమి ? ఈ వ్యభిచారము, యీ సంయమహీనత అనేక ప్రకారములు. ముఖ్యముగా మూడు విధములు. 1. ఆత్మ వ్యభిచారము, 2. పత్ని వ్యభిచారము. 3. వేశ్యా వ్యభిచారము

జీవితములో విషయ వాసనను గూర్చి రెండు విభాగములు గావించనైనది. 1. స్వాభావిక జీవనము, 2. అస్వాభావిక జీవనము.

అస్వాభావిక జీవనము రెండుగా విభజించవచ్చును. 1. తెలిసి, 2. తెలియక. తెలిసి సంయమహీనత ముష్టి మైధునము, పత్నీ వ్యభిచారము, వేశ్యా వ్యభిచారము. తెలియకుండా జరుగు సంయమ హీనత స్వప్నదోషము.

## ఆత్మ వ్యభిచారము లేక ముష్టి మైథునము

నేటి అస్వాభావిక పరిస్థితుల ప్రభావము నేటి యువతీ యువకులపై తప్పక యుండును. చిన్న వయస్సులోనే వారి జీవితము అశాంతికి గురియగును. వారు హృదయములలో చెలరేగు మానసిక వికారముల భావనలను అర్థము చేసికొనలేరు. ఈ వికారముల నిరోధించు శక్తి వారికి లేదు. విషయ వాసనలచే కన్నులు మూసికొనిపోయి బుద్ధి చలించునట్టి పరిస్థితులు సామాన్యముగా అనేకము కలుగుచుండును. క్షణిక ఆనందమునకై తాను ఆ జీవన పాప భారమును నెత్తిపై మోయును. జననేంద్రియము అతి పవిత్రమైనది. సృష్టికర్త యొక్క ఉత్పాదక శక్తికి ప్రతినిధి. మనుష్యుడు యీ ఉత్తమ శక్తిని అవమానపరచును. కృత్రిమ సాధనములతో- హస్తస్పర్శతో మరియు బోర్లా పడుకొని లేక యితర ఉపాయములతో జననేంద్రియమును ఉత్తేజపరచును. మరియు శక్తియొక్క అపార నిధియైన వీర్యమును గోల్పోవును. ఇది మహా పాతకము. తన ఆత్మను పరోక్షముగా హత్య గావించుట యగును. దానినే ముష్టిమైథున మందురు. దానికే ఆత్మ వ్యభిచారమను పేరు పెట్టబడినది.

ఈ పాపమును మనుష్యుడు ఒంటరిగా, రహస్యముగా జేయును. అందుచేత యితర పాపముల కంటె యిది యెక్కువగా వ్యాపించి యున్నది. ఒకసారి దీని వేగమునకు లొంగిన వాడు జీవితాంతము వ్యసనములకు బానిసగా మారిపోవును. సంకల్ప శక్తి గోల్పోవును.

నవయువకులలో యీ పాపము మహామారి వలె వ్యాపించిపోయినది. ఈ విషయ పరిచయము గలవారు దీని సంబంధముగా భయోత్పాదక అభిప్రాయములను వెలిబుచ్చినారు. అనేకుల దృష్టిలో యీ విషయము విశ్వవ్యాప్తము. మరికొందరి వైద్యుల ననుసరించి ప్రతి వ్యక్తి తన జీవిత కాలములో యీ రక్తశోషణ వ్యాధితో యేదో యొక సమయములో చిక్కుకొని యుండును. పురుషులు, స్త్రీలు, బాలురు, బాలికలు, యువకులు, వృద్ధులు అందరు తమ డైరీలలో యిట్టి కృత్యములను పదేపదే చూచుకొని పశ్చాత్తాపముతో కుమిలిపోవుదురు. అనేకులను ముష్టి మైధున వ్యాధి యితర వ్యాధుల వలెనే పీడించును. ఈ వ్యాధి నుండి విముక్తి పొందుట దుష్కరముగా నుండును. దీని వేగము ముందు గడ్డిపరకల వలె లొంగిపోవుదురు.

డా॥ కేలింగ్ మహోదయులు ఒక డాక్టర్ యొక్క అభిప్రాయమును యిట్లు తెలుపుచున్నారు. "నా అభిప్రాయములో ప్లేగు, యుద్ధము, మశూచి వంటి వ్యాధులు కూడా జేయలేని నష్టమును ముష్టి మైధునము మరియు యిట్టి యితర దురభ్యాసములు గావించుచున్నవి." సభ్య సమాజమును నష్టపరచునట్టి యిదొక తీవ్రవ్యాధి. ఇది నిరంతరము తన ఘాతుక కృత్యములను జరుపుచు జాతియొక్క ఆరోగ్యకర స్థితికి నష్టము చేకూర్చుచున్నది. వేరొక రచయిత అభిప్రాయములో "మా బాల బాలికలలో ఆత్మ వినాశమైన యీ భయంకర రోగ మెంతవరకు చోటు జేసుకొన్నదో తెలియదు. మేము వారి దురభ్యాసమునకు దూరముగా నున్నారని అనుకొనుచుంటిమి. కాని కన్నులు తెరచి చూచినప్పుడు యీ రక్తశోషణ రోగమునుండి వారు కూడా దూరముగా లేరని తెలుసుకొననైనది. కిశోరావస్థ నుండి యువావస్థలో అడుగిడు యువకులలో యిట్టి అనేక బలహీనతలు గోచరించును. తల్లిదండ్రులు దీనిని యువావస్థ యొక్క అవశ్య

పరిణామముగా భావింతురు. కాని వాస్తవముగా యీ బలహీనతలక్ష దురలవాట్లలో బాల బాలికలు చిక్కుకొనుటయే యగును.

యువకులు ముష్టిమైథునము వంటి అలవాట్లకు గురియగు పరిస్థితుల చర్చించుట యిచ్చట అప్రాసంగికము కాదు. ఈ కోర్కె యుత్పన్నమగుటకు భౌతిక మరియు మానసిక స్థితిగతులు కారణభూత మగుచున్నవి. కాని యిది భౌతిక కారణము వలన కలిగినదో లేక మానసిక కారణము వలన కలిగినదో విశ్లేషణ గావించజాలము. ప్రతి కామోత్తేజములో యివి రెండును మిళితములై యుండును. భౌతికము మానసికము కొరకు మరియు మానసికము భౌతికము కొరకు కారణభూతమగును. కాని యే విషయమై చర్చించుచున్నామో తత్సంబంధముగా మానసిక, భౌతిక విషయ భేదమును గ్రహించుట అవసరము. కొన్ని పరిస్థితులలో శారీరకము మరికొన్ని పరిస్థితులలో మానసికము యీ ఉత్తేజమునకు కారణమగును. ఈ రెండు దశలలో పరిణామము యొకే రీతిగా నుండును.

## భౌతిక కారణము

మానవ శరీరము పరిపక్వమై స్వాభావికముగా బహిఃస్రావము ఉత్పన్నమైనపుడు విషయ వాసనను జాగృతపరచును. అప్పుడు ఉత్తేజము కలుగును. అప్పుడు వివాహము జరిపించవలసి యుండును. వివాహము జరిపించకపోయినచో వారి మానసికస్థితి బలహీనముగానున్న ఎడల ఉత్తేజమునుశాంతపరచుటకై వారు అస్వాభావిక కృత్రిమ పద్ధతులు అవలంబింతురు. వారు ముష్టి మైథునము వంటి ఆత్మ వ్యభిచారమునకు అలవాటు పడెదరు. వివాహము జేసుకొని నియమబద్ధముగా జీవితము గడుపు వారికి హస్త మైథునము వలన కలుగునట్టి నష్టములు వాటిల్లవు. పతి, పత్నియొక్క ప్రేమమయ, భయరహిత ఆలింగనము వలన ఒక

ప్రకారమైన విద్యుచ్ఛక్తి ఉత్పన్నమగును. అది వారి స్నాయుతంతువుల శక్తిని పూర్తిజేయును. హస్త మైథునము వంటి పైశాచిక కృత్యము వలన శరీరములోని సర్వోత్తమ రసము వినాశమగును. ఇంద్రియ నిగ్రహము యొక్క యీ శత్రువు ద్వారా మనుష్యునకు కలుగు బాధలు భయంకరమైనవి. అందుచేత పరిపక్వ వ్యక్తికి వివాహము గావించుట ధర్మసమ్మతము.

1. స్వాభావిక పద్ధతులు గాక యిచట అస్వాభావికముగా యుక్తవయసు రాకపూర్వమే విషయ వాసనను జాగృతపరచు వారికి కొదువ లేదు. అనేక భౌతిక కారణముల వలన యీ ఉత్తేజము కలుగుచున్నది. మర్మాంగమును శుభ్రపరచని యెడల దురద పెట్టును. చిన్న చిన్న కురుపులు పొడసూపును. చెయ్యి మర్మాంగము పైకి పోయి ముష్టి మైథునము అలవాటగుచున్నది. ఏమి తెలియని బాలునకు కూడా ఉత్తేజనా సాధనము లభించును. ఒక్కొక్కప్పుడు లింగాగ్ర చర్మము వెనుకకు పోకుండుట వలన కడుగుటకు వీలుగాక మైల కూడును. దానివలన కూడా దురద కలుగును. అందుచేత కూడా చెయ్యి మర్మాంగము పైకి పోవును. దురద నివారణకై వెళ్ళిన చెయ్యి దుష్పరిణామములకు దారి తీయును. పరమేశ్వరుడు మానవులకు చేతులను ఉన్నతి పొందుటకై నొసంగెను. పశువులకు చేతు లివ్వలేదు కాని మనుష్యుడు యీ చేతుల ద్వారా పశువు కంటె హీనస్థితికి దిగజారిపోయినాడు. పరమేశ్వరుని దయను ఉల్లంఘించి కృతఘ్నుడుగా మారినాడు. ప్రాచీన గురుకులములలో ఆచార్యుడు, శిష్యునకు గుహ్యేంద్రియ స్పర్శ చేయరాదని ఆదేశించును. ఈ మాటలు విని నేటి యువకులు నాటి గురువులను అవహేళన గావింతురు. కాని యీ అవహేళనకు సమాధానము, హృదయమును కల్లోలపరచునట్టి సమాధానము- దురలవాట్లకు లోనై ఆవేదన పొందు యువకుల నుండి

రాబట్టవలెను. చేతిని పవిత్రముగా నుంచుట వలన కలుగు లాభమును, పవిత్రముగా నుంచుకొనకుండుట వలన కలుగు నష్టమును వారిచేత అంచనా వేయించవలెను.

జననేంద్రియముపై అకస్మికముగా వత్తిడి పడుట వలన కూడా బాలబాలికలు ముష్టి మైథునమునకు గురియగుదురు. డా॥ ఎల్బర్ట్ మౌల్ ననుసరించి గుఱ్ఱపు సవారి, కుట్టు మిషను తొక్కుట, సైకిలు సవారి మరియు రైలు ప్రయాణము వలన కూడా ఉత్తేజము కలుగను. ఈ ఉత్తేజనయే ముందు ముందు ముష్టి మైథునమునకు దారితీయును. అందుచేతనే ప్రాచీన కాలములో ఆచార్యులు బ్రహ్మచారుల నుద్దేశించి "గవాశ్వ హస్త్యుష్ట్రాది యానం వర్జయ" యని యుపదేశించినారు. సాధ్యమైనంత వరకు యెద్దు, గుఱ్ఱము, యేనుగు, ఒంటె మొదలగువాని సవారి మానుకొనవలెను. ఒకసారి యీ దురలవాట్లకు లోనైనవారు సిగ్గు విడిచి అనేక ఉపాయములు అన్వేషించెదరు. ఒక రచయిత ననుసరించి "వారు కుర్చీ, బల్ల మొదలగు వాటిని అనుకొని వంగి నిలబడెదరు. చూచు వారికి సామాన్యముగా నిలబడినట్లు తోచును. కాని మర్మాంగముపై వత్తిడి పడునట్లు చూచుకొనును. ఈ విధముగా పిల్లలు ఆత్మ వ్యభిచారము వంటి దుష్కార్యములకు లోనగుటయే గాక తల్లిదండ్రుల యెదుట యితర దుష్కృత్యములు కొనసాగించెదరు. వారికి హితము చెప్పువారు కలుగబోవు దుష్పరిణామముల గురించి హితోపదేశము చేసినచో అనేకులు యీ దురలవాట్ల నుండి కాపాడబడి యుందురు.

అనేకమంది బాలురు బోర్లా పడుకొని చదువుట, వ్రాయుట జేయుదురు. దీనివలన కూడా అంగముపై వత్తిడి పడును. ఈ ప్రయోగములు ప్రపంచ జనుల కన్నులలో దుమ్ము కొట్టుటకు జేయ బడినవి. పగలు పన్నెండు గంటలకు కూడా యీ దుష్కృత్యములకు

సాహసించువారు తమను తాము యెంత పతనము గావించుకొనుచున్నారో గ్రహించవచ్చును. ఫ్యాంటు, పైజామా కూడా ఉత్తేజానికి కారణమగును. డా॥ బోర్న్‌హార్డ్ యీ విధముగా తన భావము తెలుపుచున్నాడు. బాలుడు లఘుశంకకు పోదలచినప్పుడు తన యింద్రియము పంట్లోను నుండి బయటకు తీయుటకు యితరుల సహాయము కావలసియుండును. నౌకరులు ఒక్కొక్కసారి యీ పని జేయుదురు. వారు బాలురకు యింద్రియములతో ఆడుకొనుట నేర్పుదురు. పెద్దగా పెరిగినప్పుడు అట్టి అలవాటే ఏర్పడును. ఆ అలవాటు వికృత రూపము దాల్చును. దీని నాపుటకై తొమ్మిది నుండి పదునాలుగు సంవత్సరముల బాలురకు పదులు బట్టలు వేయవలెనని డాక్టరుగారి సలహా. ఆడపిల్లల దుస్తులు బాలురకు ధరింపజేయవలెనని వారి అభిప్రాయము.

3. ఉత్తేజన ముఖ్య కారణములలో భోజనము కూడా ఒకటి. డా॥ కైలాంగ్ తన గ్రంథము "Plain Facts"లో యీ విధముగా పేర్కొనినారు. చాలామంది భోజన మొక సాధారణ వస్తువని భావించెదరు. కాని యిది అత్యంత భ్రమపూర్వకమైనది. శరీరక్రియా వైజ్ఞానికులు మనము తినే ఆహారము ననుసరించి మన ఆలోచనలు యేర్పడునని చెప్పుదురు. ఊరగాయలు, మైదా రొట్టె, మిఠాయి, టీ కాఫీలు మరియు పొగాకు నుపయోగించు వారు తమ ఆలోచనలను పవిత్రముగా నుంచుకొనజాలరు. ఇట్టి వారు తమ భావనలను పవిత్రముగా నుంచబూనుట ఆకాశములో యెగురు ప్రయత్నము వంటిది. అటువంటి వారు పవిత్ర జీవనము గడుపుట ఆశ్చర్యకరమైన విషయము. మానసిక పవిత్రత కాపాడుకొనుట వారికి అన్ని పరిస్థితులలో అసంభవమే యగును.

డా॥ కోవన్ తన గ్రంథము "Science of a New Life"లో విషయ వాసన ఉత్పన్న మగుటకు దూషిత భోజనము కారణమగు

చున్నది అని తెలిపెను. బాలురకు భోజనములో గ్రుడ్డు, మాంసము, కారము, మసాలా మిఠాయి, చాయ్, కాఫీ మరియు అప్పుడప్పుడు సారా యివ్వవలెనని కోరుకొనుట మరియు పవిత్ర జీవనము గడుపవలెనని కోరుకొనుట పరస్పర విరుద్ధ విషయములు. ఒకవేళ 5, 10 సంవత్సరముల ప్రాయము గల దేవదూతకు గూడా యిట్టి భోజనము పెట్టినచో వారు కూడా ముష్టి మైథునమునకు అలవాటు పడెదరు. అటువంటప్పుడు మానవమాత్రుడైన బాలున కిట్టి ఆహార మిచ్చుట వలన పైతృక, కుసంస్కారములకు యివి తోడై పవిత్రత కాపాడు కొనుట యెట్లు అసంభవమో ఊహించవచ్చునని పేర్కొనిరి.

4. అనేకుల కోమల వయస్కుల వసంతమయ నవయౌవనమును సేవకులు హరించెదరు. బాలుడు యేడ్చినప్పుడు దాయిలు వారి మర్మాంగములపై చేతితో జో కొట్టుదురు. దానివలన వారి ధ్యానము దీని వలన కలుగు ఆనందములో విభజించబడును ఆ సమయములో రాబోవు భయంకర పరిణామముల గూర్చి వారు ఆలోచించి యుండరు. అనేక సేవకులకు, సేవకురాండ్రకు పిల్లల గుహ్యేంద్రియములతో ఆడు కొనుట సరదాగా యుండును. వారి విషయ వాసనను కూడా యిట్లు శాంతపరచుకొందురు. దీని వలన పసివారి మనస్సులు దూషితమగును. ఈ పరిణామము యొక్క బాధ్యత నౌకర్లతో బాటు తల్లిదండ్రులపై నుండగలదు. నౌకర్ల కప్పగించి వారి జీవితములను అంధకారమయ మొనర్చుచున్నారు. కొందరు పెద్దలు. తల్లిదండ్రులు కూడా బాలుర జననేంద్రియముతో ఆడుకొందురు. వారు బాలుర భవిష్యత్తును నాశనము జేయవలెనను కోరికతో యిట్టి పనికి పూనుకొనకపోయి నప్పటికి వారి అజ్ఞానము మరియు మూర్ఖత్వము యిట్టి చేష్టకు పురి గొలుపును. వారికి తమ కుకృత్య పరిణామము తెలిసినచో ప్రాయశ్చి త్తము చేసుకొని యుండెడివారు. బాలురు ఒకవేళ యీ కామపిశాచ

విషవలయము నుండి బయట పడినచో అదృష్టముగా భావించవలెను. బాలుడు యింకను చిన్నవా డగుటచే యీ విషవలయములో పడనిచో నాతనిని ప్రకృతియే రక్షించినదగును కాని తల్లిదండ్రులు, సేవకులు తను దుష్ట ప్రయత్నములలో లోపమేమియు చేసిన వారగుట లేదు.

5. నేటి పాఠశాలలు బాలుర నడకను చెడగొట్టు కేంద్రములుగా మారినవని తెలుసుకొని చాలామంది ఆశ్చర్యపోయెదరు. "దీపము క్రిందనే చీకటి"యను మాట సార్థకమగుచున్నది. పాఠశాల నాలుగు గోడల మధ్య పాఠములు బోధించబడును. పరీక్షలకు తయారు జేయుదురు. కాని యీ అంధకార గుహలలోనే యీ పిశాచము తన శిష్యులను తయారుజేయు చున్నది. ఇంతకు పూర్వము బాలురు నిష్కల్మష, పవిత్ర హృదయములు గలిగి యుందురు. కాని పాఠశాల గదులలో నుండి బయటకు వచ్చు సమయమునకు ముష్టి మైథునము అను అలవాటుకు బానిస యగుదురు. యిట్టి పాఠశాల దుర్ఘటనలు వింటూ బోయినచో శరీరము రోమాంచితమగును. హైథలాక్ యిలిస్ మహోదయులు తన గ్రంథము "Sexual Selection in mine" అను పుస్తకములో ఒక వ్యక్తి యొక్క ఆత్మకథ నిట్లు వివరించిరి.

నేను పది సంవత్సరముల ప్రాయములో పాఠశాలలో జేరితిని. అచట దూషిత వాతావరణము ప్రచులితమై యుండుట మరియు కుచేష్టల విషయము నా చెవులలో బడినది. నన్ను యీ దూషిత వాతావరణము నుండి కాపాడు వారు గాని లేక హెచ్చరించు వారు గాని యెవ్వరు లేకుండిరి. నేను యీ అలవాటుకు బానిసనైతిని. ఇది దురభ్యాసమని తెలిసినప్పటికి నా బలహీనత వలన ఈ దురభ్యాసము నకు గురియైతిని. ఇది చెడు అలవాటని తెలిసినప్పటికి పాఠశాల బాలురలో వ్యాప్తమై యుండెను. ఈ పాఠశాల వదలి మరో రెండు పాఠశాలల్లో జేరినప్పటికి అచట కూడా యిదే పరిస్థితి యెదురయ్యేను.

విద్యార్థులలో అధిక సంఖ్యాకులు యిది తప్పని భావించు చుండిరి కాని ఈ విషవలయము నుండి తప్పుకొనజాలక పోయిరి. ఒకరోజు నా చెవిలో హస్తమైథునము మనుష్యుని బలహీనుని జేయుననెడు విషయము పడెను. అది యథార్థమని నాకు గోచరించెను. బాల్యావస్థలో జేసిన హస్త మైథునము యొక్క దుష్పరిణామము వయసు ఉడుగుచున్న కొలది కనిపించుచుండును. ఈ దురభ్యాసము నుండి విముక్తి జెంద వలెనని కోరిక నాకు కలిగినది. రాబోవు పరిణామముల గురించి నా హృదయము ప్రకంపనము జెందుచుండెను.

ఈ అలవాటు నుండి విముక్తి కలిగినది కాని బాల్యముననే పతనమగుట వలన వ్యాధిగ్రస్థుడ నైతిని. పాఠశాలలో ఈ విషయము నెదురించుట అసాధ్యమైనప్పటికి దానివలన నా హృదయము నిర్వీర్యమై నరములు కంపము జెందుచుండెను. పరిణామ మింకను భయంకరముగా కలిగెను. పుస్తకములలో ఈ దురభ్యాస పరిణామము దానికి ప్రకృతి యిచ్చు శిక్షను గూర్చి చదివి కంపించిపోయితిని. మతిభ్రమణ కలుగు నేమోయను సందేహము కలుగుచుండెను. ఈ దురభ్యాసము నుండి యింకను దూరము కాలేనేమో యనిపించుచున్నది. జాగ్రదావస్థలో నేను యెట్టి విషయ వాసనన్నైనను యెదురించగలిగి యుంటిని కాని ఒక రాత్రి నేను నిదురకు, జాగదావస్థకు మధ్య దశలో నుంటిని. ఆ స్థితిలో మనిషి చైతన్యవంతుడై యుండడు. అట్టి స్థితిలో నేను ఈ దురభ్యాసము వైపు లాగబడుచుంటిని. దేవాసుర సంగ్రామము జరుగుచుండెను. అసుర శక్తులు దైవ శక్తుల నణచు ప్రయత్నములో నుండెను. ఇట్టి దశ నాకు చాలా బాధ కలిగించెను. ఈ అభ్యాసము నుండి దూరమగుటకు అనేక ప్రయత్నములు చేసితిని. బోర్ల పడకుండ నుండునట్లు నన్ను నేను బంధించుకొని పడుకొనుచుంటిని. దీనివలన ఈ దురభ్యాసము నుండి దూరమగుటకు సహాయము కలిగెను.

## మానసిక కారణములు:

బాల్యావస్థలో కలుగు కామోత్తేజమునకు శరీర సంబంధ కారణములే ప్రముఖముగా పేర్కొనవచ్చును. బాలురు మానసికముగా వికాసము జెందరు. కాని క్రమక్రమముగా శారీరక అవస్థలు మనసుపై, మానసిక అవస్థలు శరీరముపై ప్రభావిత మగును. పెద్దవారిలో శారీరక ఉత్తేజన వలన మానసిక వికారము మరియు మానసిక వికారము వలన శారీరక ఉత్తేజన కలుగును. మానసిక వికారము లేనప్పుడు హస్త మైథునము శారీరక క్రియగా మిగులును. దానికి మనసుతో సంబంధ ముండదు. మనసులో యే లింగ సంబంధమైన ఆలోచన యుండదు. అది కేవలము శారీరకముగా మాత్రమే నుండును. ఈ పరిస్థితి కేవలము మానసిక వికాసము కలుగునంత మేరకే యుండును. మానసిక వికాసము జెందిన వారిలో శారీరక ఉత్తేజము కలిగినప్పుడు మనసులో కండ్ల ముందా బాలికతో సహా ఆ దృశ్యము నిలుచును. మానసిక వికాసము లేని వారిలో హస్త మైథునము శారీరకముగా జరుగును. మానసిక వికాసము కలిగిన వారిలో హస్త మైథునము శారీరకముగా మరియు మానసికముగా కూడా జరుగును. బాలబాలికలు తాము ప్రేమించిన వారిని మనసునందు ధారణ జేసుకొని కల్పనలు గావించుకొని తమ మనసులను పాడుజేసు కొందురు. అశ్లీల, అసభ్య బొమ్మలను జూచి బాలబాలికల మనసు అందు వివిధ భంగిమల దురాలోచనలు కలుగును.

సభ్యతా, సంస్కృతి, నాగరికత యను గొప్పలు చెప్పుకొను నేటి యుగములో మనుష్యుని మనసెంత దిగజారిపోయినది. ఈనాటి అభిరుచులను నగ్న స్వరూపముగా తెలిసికొనుటకు పుస్తకములు, వాటిపై గల దృశ్యములు మాత్రమే చాలును. నేటి నవలలలో గల వికార కామప్రేరిత ఘట్టములను చదువుచు యువకుడు ఆనందము జెందును. గోడలపై వ్రాయబడిన విషయములు, చిత్రములు,

పరిహాసోక్తులు నేటి యువకుల అభిరుచులకు దర్పణము. సినిమాలు, నృత్య గీతములు, యువకుల శారీరక, మానసిక స్థితిని దూషిత మొనర్చును. వీరినుండి యింద్రియ నిగ్రహము, బ్రహ్మచర్యము నాశించుట కేవలము భ్రమ మాత్రమే యగును. ప్రాచీన కాలములో బ్రహ్మచారులకు "నర్తనం గీతవాదిత్రం వర్జయ" నృత్య గానములను విసర్జించవలసినదిగా ఆదేశించబడినది.

2. "కుత్సిత కల్పనలు" ఒకవైపు బాలబాలికల జీవితములను నాశనము జేయును. రెండవవైపు ఆలోచనలు దాని వ్రేళ్ళను సడలించును. ప్రకృతి విరుద్ధ మార్గముల ననుసరించుటయే ఈ చింతకు కారణము. మనసుపై విచార భారము వేయును. విచారములో మునిగిన వాడు హస్త మైథునమునకు అలవాటు పడెదరు దీనివలన వారి స్నాయుతంతువు బిగింపుల కొంత సడలును. క్షణిక ఉత్తేజములో మునుగుచున్న మనసునకు కొంత వికాసము కలుగజేయును. విచారము వలన కలుగు మానసిక వ్యథను మానవు డధిక సమయము వరకు సహించలేడు. తన మనసుయొక్క బరువును తేలిక పరచుకొనుటకై ఈ చౌకబారు ఉపాయము నెన్నుకొనెను. ఈ ఉపాయము యింకను పెద్ద బరువు కాగలదని ఆలోచించికపోవుట శోచనీయము. వీర్య నాశము కొద్ది కాలములోనే మనిషిని నిర్వీర్యుని చేయగలదు. పూర్వపు కామోత్తేజన చింతనతో పాటు నిర్వీర్య చింత తోడగును. డా॥ ఎల్బర్ట్ ఒక యిరవై సంవత్సరాల యువకుని అనుభవముల నిట్లు వర్ణించు చున్నాడు.

ఆ యువకునకు 16 సంవత్సరముల ప్రాయములో కామోత్తేజన భావము కలిగెను. అంతకుపూర్వమే అతని మిత్రులు ఆతనితో హస్త మైథున విషయ చర్చ గావించిరి. కాని ఆతడు తనను చెడి పోకుండా కాపాడుకొనెను. ఉన్నత శ్రేణిలో చదువుచున్న రోజులలో

నాతనికి గణితమునకు సంబంధించిన ఒక ప్రశ్నకు సమాధానము రాబట్టుటకై యివ్వబడెను. ఆతడు సమాధానము రాబట్టలేక విచారములో మునిగెను. ఆతని భవిష్యత్తు సఫలత దీనిపై ఆధారపడి యుండుట వలన అధిక చింతితు డయ్యెను. సగము వఱకు లెక్కచేయుచుండగా అధ్యాపకుడు పది నిముషములు మాత్రమే మిగిలి యున్నవని హెచ్చరించెను. తదుపరి సమాధాన పత్రము లాగుకొనబడును అనెను. దీనితో ఆతని మనోవికారము చరమ స్థాయికి జేరెను. కొంత సేపటికి ఆతనికి వీర్యపతన మయినట్లు అనుభవమయ్యెను.

సోమరితనను కూడా మనుష్యుని నైతిక పతనమునకు దారి తీయును. మనసు యెట్టి సంకల్ప వికల్పములు లేకుండయుండునని తలంచుట మానసిక విజ్ఞాన అనభిజ్ఞతను సూచించును. మనసు పని లేకుండా యున్నప్పుడు చెడు ఆలోచనలు చోటు చేసుకొనును. మనుష్యులు పని లేకుండా యున్నప్పుడు తమ మనసులు ఖాళీగా యున్నటుల భావించెదరు. ఆ ఖాళీలో చింత లేక కుత్సిత వికల్పములు చోటుచేసుకొనును. అవి రెండును మనుష్యుని పతనమునకు దారితీయును. ఒకమారు దయానందుని కామదేవు డాతనిని క్షోభ పెట్టుచున్నాడా? లేడా? యని ప్రశ్నించగా నాతడు సమాధాన మిచ్చుచు ఆతడు వచ్చును. కాని నా యింటి ముందరే నిలబడ వలసి వచ్చును. నా మన సెప్పుడు ఖాళీగా నుండదని సమాధాన మొసంగెను. ఆత డెప్పుడు యేదో పనిలో మునిగియుండుట వలన యితర ఆలోచనలు చోటు చేసుకొను అవకాశము లేదు. ఇదియే ఆతని బ్రహ్మచర్య రహస్యము. సోమరిగా తిరుగు బాలకులు అప్రాకృతిక అలవాట్లకు గురియగు ప్రమాదము గలదు. అవమాన పరచు ఉద్దేశ్యముతో యీ సందేహము చేయబడుట లేదు. కాని ప్రపంచ అనుభవ మిట్లు గలదు. సమయము లేదనుట వంచనయే యగును. భారతీయులకు సమయము

యొక్క విలువ తెలియదు. మనము కాలమును వ్యర్థముగా వినియోగ పరచెదము. నరనరాలలో సోమరితనము, బద్ధకము నిండియున్నది. నవలలు చదువుట, సినిమాలు చూచుట వంటి సభ్య సమాజ సోమరితనము మన పాపములను రెట్టింపు జేసినది.

ఇంతవరకు మానవ సమాజ అస్వాభావిక పతనము యొక్క భౌతిక మఱియు మానసిక కారణములను విచారించితిమి. ఇప్పుడు వాటి పరిణామములను గుఱించి ఆలోచించవలసి యున్నది. హస్త మైథునము లేక అప్రాకృతిక మైథునము యొక్క పరిణామములను మూడు భాగములుగా విభజించవచ్చును. 1. శారీరక పరిణామము, 2. మానసిక పరిణామము, 3. ఆత్మిక పరిణామము.

<u>శారీరక పరిణామము</u> : హస్తమైథునము యొక్క దుష్టపరిణామము శరీరముపై ఆవశ్యముండును. జననేంద్రియముపై కూడా దీని దుష్ట ప్రభావముండును. దీనితో కలుగు వీర్యనాశనము వలన వీర్యవాహిని నాళిక పూర్తిగా ఖాళీకాదు. మిగిలిన వీర్యము మూత్రవాహినీ నాళము లోనికి ప్రవేశించి మంట కలిగించును. ఆ మంట అప్పుడప్పుడు యీ అలవాటు కల వ్యక్తికి మూత్రములో కూడా దురద, మంట కలుగును. మూత్రాశయము పని మందగించును. మాటిమాటికి మూత్రమునకు పోవలసిన అవసర మేర్పడును రాత్రి నిదురలో స్వప్న దోషమగును. ఈ అలవాటుకు గురియైన వారికి మొదటమొదట స్వయముగా ఉత్తేజన కలుగును. క్రమశః జననేంద్రియము శిథిలావస్థను జేరి ఉత్తేజము కలుగుట ఆగిపోవును. నాడులు బలహీనమైన ఉత్తేజమునకై తీవ్ర ఉపాయములు చేయవలసివచ్చును. అలసిపోయిన గుఱ్ఱమును దూరప్రయాణము చేయించవలసి వచ్చినప్పుడు దానిని కొరడాతో యెక్కువగా కొట్టవలసి వచ్చును. ఇది ప్రకృతి నియమము

ఆ దౌర్భాగ్యునకు హస్తమైథునము వలన కూడా ఉత్తేజము కలుగదు. క్రమముగా పురుషత్వము గోల్పోవును. ఇతర అసహజ కృత్రిమ ఉపాయముల నాలోచించును. జననేంద్రియములో చేతనాశక్తి లోపించును. దురలవాట్లకు లోనైన వ్యక్తి యథార్థముగా రోగియగును. ఇతర వ్యాధులు ఓషధులచే నయమగును. కాని యిది మనసుకు సంబంధించిన రోగమగుటచే మందుల ప్రభావము దీనిపై యుండదు. తన ఘోర పతనమునకు మిక్కిలి దుఃఖించును. అతనిలో వీర్యధారణ శక్తియే పోవును వీర్య ముత్పన్నమగు అండకోశములపై చాలా బరువు పడును. అవి నొప్పి పెట్టును. వీర్య వాహిని నాళములు బలహీనమగును. అండకోశములు చాల క్రిందకు వ్రేలాడును. గుహ్యాంగములు నీరసించిపోవును. ఒక్క మాటలో చెప్పాలంటే హస్తమైథునము వలన ఉత్పాదకాంగములు నిరర్థకములై తిరిగి హస్తమైథునమునకు కూడా పనికిరాకుండ పోవును. తాను యే ఆనందమును గోరి యీ దురభ్యాసమునకు లోనైనాడో అట్టి ఆనందముతో వంచితుడగును.

రక్తము నుండి వీర్య మేర్పడును. అందుచేత వీర్యనాశన మొనరించు వారు రక్తహీనము వలన కలుగు రోగములకు వశులగుదురు. తల వెంట్రుకలు రాలిపోవును. వెంట్రుకలు తెల్లగా మారును. కన్నులలో కాంతి లోపించును. ముఖము కళాహీన మగును. మలబద్ధకమో లేక అతిసారమో యేర్పడును. వీర్యరక్షణ వలన మాత్రమే తిరిగి అట్టిశక్తి పొందగలడు. ఓషధుల వలన అంత ప్రభావ ముండదు. రక్తహీనము వలన హృదయము కొట్టుకొనును. పేగులలో రక్తలోపము యేర్పడును మూత్రాశయ, పిత్తాశయ వ్యాధులు యేర్పడును. కీళ్లనొప్పులు, మెడ, భుజములు, నరములు, మడమలలో, నొప్పులు యేర్పడును. హస్తమైథునమునకు అలవాటుపడిన వారిని ప్రకృతి క్షమించదు. అతనిని నపుంసకునిగా జేయును. ఒక డాక్టరు అభిప్రాయ ప్రకారము

హస్తమైథునము వంటి దురలవాట్లకు లోనైన వారికి కలుగు వ్యాధులను లెక్క పెట్టలేము. కాముకత యొక్క తీవ్ర ప్రభావముల వలన మానవుని స్నాయు శక్తికి తీవ్ర ఆఘాతము కలుగును. వీర్యములో ఈ స్నాయు శక్తి గలదు. ఒక ఔన్సు వీర్యము 40 ఔన్సుల రక్తముతో సమానము. స్నాయు శక్తి లోపము వలన శరీరము అన్ని రకముల రోగములను ఆహ్వానించును.

పైన పేర్కొనిన వ్యాధులు వీర్యనాశము వలన యేర్పడి మొదట తీవ్ర రూపముగా నుండకపోయినను వీర్యరక్షణ పట్ల శ్రద్ధ వహించని యెడల తీవ్రరూపము ధరించును. కాని యీ జబ్బులు మంచివారిలో కూడా కొందరిలో కలుగ వచ్చును. అటువంటుప్పుడు యిది సరికాదని ఆరోపణ చేయుదురు. ఇట్టివారే బ్రహ్మచర్యమునకు అపవాదు కలిగించుచున్నారు. ఒక వ్యభిచారి సుదృఢమైన శరీరము కలిగియుండి, ఒక సచ్ఛీలుడు రోగగ్రస్తమైన శరీరము కలిగియున్నచో ఆ వ్యభిచారిని బ్రహ్మచర్యము కాపాడిన వానిగా ఆ ఉత్తముని వీర్య నాశనము గావించిన వానిగా పేర్కొనలేము. అందుచేత బ్రహ్మచర్యపు సరియైన యెల్లలు తెలిసికొనుట యెంతయో అవసరము.

<u>మానసిక పరిణామము</u>: మనసుయొక్క భౌతిక ఆధారము మస్తిష్కము. మనసుద్వారా ఆలోచించు ప్రత్యేక క్రియలు మస్తిష్కము ద్వారా జరుగును. దేనివలననైన మస్తిష్కముపై ప్రభావము పడినచో దాని ప్రభావము మనసుపై కూడా నుండును. దురలవాటును గురించిన ఆలోచనా ప్రభావము శరీరముపై, మనసుపైకూడ నుండును. మస్తిష్కము మానవుని జీవనకేంద్రము. అతిసున్నితమైనది. అది లేకుండా మానవుడు ఆలోచించలేడు. మఱియు కదల లేడు. హస్తమైథునము యొక్క తీవ్ర ప్రభావము మస్తిష్కముపై నుండును. ఏ విధమైన మైథునమైనను

నీరసింప జేసి స్నాయుశక్తిని గోల్పోవజేయుననుటలో అతిశయోక్తి లేదు ఇందు శరీరముయొక్క ప్రతి భాగము మానసిక భావములపై కలిగిన వత్తిడి తీవ్రత యెవరో శరీరమును వ్రేళ్లతో కుదిపి నట్లగును. స్త్రీ పురుష నియమిత ప్రసంగముల వలన వారిద్దరు పూర్ణవయస్సుకు చెందిన వారైనప్పుడు వీర్యనాశము వలన కలిగిన హాని వారిలో పరస్పరము కలుగు ప్రేమ భావముల వలన తొలగిపోవును వారి దశ బహిఃప్రానమునకైనను దారితీయును. కాని హస్తమైథునము వలన హానియే తప్ప యింకేమి ఉండదు. ఆత్మగ్లాని భావము ఆత్మను బాధించును. శ్రీ హైవలార్ ఇల్స్ మహోదయుడు "Science of sex" ప్రథమ ఖండము యొక్క 253వ పుటలో యిట్లు పేర్కొనినారు. పతి పత్నుల సంబంధములో నిర్భయత. ప్రేమ, ఆత్మాభిమానము, ఆత్మ గౌరవము మఱియు ఆత్మవికాస భావము ఉత్పన్నమగును. ఆత్మోన్నతికి సాధనమైన యిట్టి భావము హస్తమైథునము వలన కలుగును. ఆత్మ గ్లాని యుత్పన్నమగును. ప్రేమ భావమునకు మారుగా ఆత్మ గ్లాని యున్నతమగును. ప్రేమ ఆత్మను ఉన్నతము వైపునకు తీసుకొనిపోగా ఆత్మ వ్యభిచారము ఆత్మయొక్క పతనమునకు దారి తీయును. ఇల్లిస్ మహోదయుడు గాడ్ప్రే యొక్క "Science of Sex" పుస్తకము నుండి ఈ క్రింది విషయమును పేర్కొనెను. గాడ్ప్రే తన పుస్తకము యొక్క 178 వ పుటలో యిట్లు వ్రాయుచున్నారు. ఆత్మ వ్యభిచారము జననేంద్రియ క్రియలలో నొక్కటి యైనప్పటికి అది "సెక్సువల్ యాక్టు" కాదు. కామములో ద్విత్వాభిప్రాయము కలుగుచుండ హస్త మైథునములో అది లేదు. స్త్రీ పురుషుల సంభాషణలో కలుగు శారీరక, మానసిక మఱియు ఆత్మిక సహయోగము జీవితములో స్థిరత్వము, సౌందర్య సంచారము కలిగించును. కాని హస్తమైథున మందది కానరాదు. అందుచేత హస్తమైథునము కామజీవన అభావముగా పేర్కొనబడుచున్నది. దీనిని కామక్రియ అనుట పొరపాటు.

హస్తమైథునమునకు అలవాటు పడిన వ్యక్తి తన వీర్య నాశనము చేత మస్తిష్క తత్త్వమును ప్రవహింప జేయుచున్నాడని గ్రహించుట మంచిది. ఈతడు నిస్తేజుడై మూర్ఛవంటి అనేక మానసిక రోగములకు గురియగును. నిరంతరము దుఃఖసాగరమున మునిగియుండి తప్పించుకొనుటకు నృత్య గానములకు వెళ్లును. మత్తు పదార్థములకు అలవాటు పడును. ఇట్లాతడు తన సర్వనాశనమునకు మార్గము సుగమము జేసికొనుచున్నాడు ఆత్మికశాంతి గోల్పోయి సదాదుఃఖములో మునిగియుండును. అతి చురుకైన బాలురు కూడా యీ దురభ్యాసము వలన విద్యలో వెనుక బడెదరు. తల్లిదండ్రులు, అధ్యాపకులు, మిత్రులు అతని అవనతికి ఆశ్చర్యము జెందెదరు. కాని శారీరక శాస్త్రము చదివిన వారికి ఆశ్చర్యము కలుగదు. విద్యార్థులు తమధ్యానమును కేంద్రీకృత మొనర్చుటకు జ్ఞాపకశక్తి వృద్ధి జేసుకొనుటకు ఇంద్రియ నిగ్రహ మొక్కటే మార్గము.

చిన్న మస్తిష్కము కాముకతను మఱియు శారీరక గతులను నియంత్రణ యందుంచును. కాముకుడు విషయలోలు డగుటచే అతని మస్తిష్కము త్వరగా అలసి పోవచ్చును. పరిణామముగా అతనికి కీళ్లనొప్పులు మొదలై నడచుటలో తప్పటడుగులు వేయును. జ్ఞానేంద్రియము లన్నియు శక్తిని గోల్పోవును. అతడు తనకు తానే బరువై నిరాశకు లోనై తనను తాను అంతమొందించుకొనును.

ఇంద్రియ నిగ్రహ అభావము చేత నడుములో నొప్పి, వెన్నెముకలో నొప్పి, ఒక్కొక్కప్పుడు పక్షవాతము వచ్చు అవకాశములు గలవు. రాత్రి పూట నిదురపట్టకపోవుట జరుగును. వీర్యనాశనము వలన అన్ని రోగములు అవశ్యముగా కలుగునని భయ పెట్టుటకాదు. కాని అట్టి రోగములు యేర్పడుటకు అవకాశములు కలవని వైద్యుల అభిప్రాయము.

ఆత్మికపరిణామము : అంతరాత్మ మనుష్యుని చెడు మార్గము నుండి కాపాడు దైవదత్తమైన వరము. దురాలోచనచే ఈ అంతరాత్మ వాణి ప్రాధాన్యతను గోల్పోవును. డాక్టర్ స్టాల్ తన "What a Young Boy ought to Know" గ్రంథములో ఈ భావమునే చక్కటి మాటలలో అమర్చినాడు. మనలో అనేకులకు అంతరాత్మ శబ్దము చెవిటివాని విధముగా నుండును. వారు తమ అంతరాత్మ గావించు చేతావని నుండి ముఖము త్రిప్పుకొందురు. చివరకు అంతరాత్మ వాణి వినవచ్చుటయే ఆగిపోవును. దీని నిట్లు పోల్చుట జరిగినది. వేకువజామున అయిదు గంటలకు లేచుటకై గడియారము అలారము పెట్టుదురు. మొదటి రోజు అలారం ఆతనిని మేల్కొలుపును. ఆతడు వెంటనే లేచి దుస్తులు ధరించుటకు పూనుకొనినచో ప్రతి దినము అదే సమయానికి మెలకువ వచ్చును. అట్లుగాక మొదటి రోజే మేల్కొని లేచుటకు బదులు మంచముపై పరుండి మరొక నిముషము ఆలోచించుచు అటులే పరుండినచో ఆలోచించే శ్రమ కూడా లేకుండా నిదురించును. రెండు మూడు రోజులలో గడియారము మ్రోగుచున్నప్పటికి దాని చప్పుడు కూడా వినవచ్చుట ఆగిపోవును. గుఱ్ఱుపెట్టి నిదురపోవును. మనుష్యుని అంతరాత్మ విషయము కూడా యిటులే నుండును. మొదటనే జాగ్రత్త పడినచో అన్ని సక్రమముగా నడుచును. లేనిచో అంతరాత్మ హెచ్చరించుటయే మానుకొనును.

కామోద్రేకపు అసహజతృప్తి తర్వాత కలిగెడు లజ్జ మరియు ఆత్మగ్లాని అంతరాత్మ హెచ్చరికను నిర్లక్ష్యము చేయుట వలన కలిగిన సూచనయే. ఆరంభములో ఈ హెచ్చరిక ప్రబలముగా నుండును. దురాలోచనతో పోరాటము సాగించి నట్లుండును. కాని కేవల మొక్కసారి యని తలంచుట వలన కలుగు పాశవిక భావముల నెవ్వ రెదురించగలరు? మనుష్యుని పతన మారంభమై క్రమముగా

ఆత్మిక బలము లుప్తమగును. అటుపై ఉపేక్షించుట జరుగును. తదుపరి హస్తమైథునము సామాన్య విషయముగా మారును. ఆత్మ నిదురపోవును. జీవితము కామోద్రేకముతో కూడుకొని ఔన్నత్య మార్గము గగన కుసుమ మగును. క్షణికోద్రేకముతో జరుగరాని పాపములు కోట్లుల కెక్కును. జీవిత భారమును భుజస్కంధాలపై మోయుచు దుర్వ్యసముల యొక్క బానిస మానాభిమానమును, ధర్మమును తృణీకరించి భూమిని తన భారము నుండి విముక్తి జేయు ఘడియలకై యెదురు చూచుచుండును.

"ఇంద్రియ నిగ్రహము" "ఆత్మవిశ్వాసము" లేశమాత్రమైనను లేని వ్యక్తి దుర్వ్యసనములలో చిక్కుకొనును. అభ్యాసపు సంకెళ్లలలో బంధించబడును. 'ఒకేసారి' 'ఒక నిముషము' 'ఇదే చివరిసారి' యను ఆలోచనలు కలుగును. మానవ సంతానమును మార్గభ్రష్ట మొనరించుటకై అభ్యాసమను పిశాచి ప్రలోభములకు గురిచేయును. అంతరాత్మ హెచ్చరికను ఉపేక్షజేసి, యిచ్ఛాశక్తి లేక ఆత్మిక పతనము చరమ స్థాయికి జేరును.

చికిత్స : తన దుశ్చేష్టకు కారణములను తెలుసుకొనుటలోనే దాని చికిత్స యిమిడియున్నది. కారణములను తొలగించినచో చికిత్స స్వయముగా కాగలదు. ఈ సంబంధముగా యెట్టి యిదమిత్థ నియమములను యేర్పరచజాలము. ప్రత్యేక వ్యక్తికి ప్రత్యేక సమస్య లుండును. వాటిని నివారించుటకు ప్రయత్నించవలెను. ఇచ్చట కొన్ని సామాన్య నిర్దేశము లందరకు వర్తించునవి యివ్వబడినవి.

దుర్వ్యసనముల వలన కలుగు భౌతిక కారణముల వలన తల్లిదండ్రులు, గురువులు, బంధువులు, మిత్రులు సరియైన సమయములో సరియైన చర్య తీసుకొని యుండినచో యిట్టి స్థితికి జేరక

పోయెడి వానినని ఆలోచించును. బాలకులకు యీ దుష్టపరిణామములు తెలిపియున్నచో వారీ స్థితికి దిగజారక పోయెడివారు. తల్లిదండ్రులే తమ బాలుర సర్వనాశనమునకు కారకులగుట దురదృష్టకరము. అవివాహిత జీవిత కఠిన సమస్యలు వైవాహిక జీవిత సమస్యలకు తీసిపోవు. వారి విద్యార్థి జీవిత వ్యక్తిగత అనుభవములను దృష్టిలో పెట్టుకొని తమ బాలురు కూడా యే విధముగాను ఈ విషయములో అనభిజ్ఞులు కాజాలరని తెలుసుకొని విషయ జ్ఞానము కలిగించిన బాగుండెడిది. కాని బాలుడు ఈ విషయములను తల్లిదండ్రులు, గురువులతో గాక స్నేహితుల ద్వారా, నౌకర్ల ద్వారా వక్రీకరింపబడి తెలుసుకొనును. పరమాత్ముని దర్బారులో తల్లిదండ్రులపై బాలుర వినాశముజేయు అభియోగము మోపబడును. కొంతమంది తల్లిదండ్రులు తమ అశ్రద్ధచేతనే తమ సంతానము చెడిపోయినదని మరణించునంత వరకు కుమిలిపోయెదరు. పరిస్థితి విషమించిన తర్వాత ఆలోచించుట వలన ప్రయోజనము శూన్యము. ఈ చెడు అలవాటుకు బానిసయైన వారు ఈ క్రింది నియమముల నాచరించుట మంచిది.

1. శుద్ధ సాత్విక భోజన మవసరము మెత్తని పిండి బదులు పొట్టుతో కూడిన పిండిమేలు, మసాలాలు, కారము, తీపి, పులుపు వర్జించవలెను. పండ్లు, పాలు యెక్కువగా నుపయోగించుట ఉత్తమము.

2. టీ, కాఫీ, తమలపాకులు, పొగాకు, సిగరేటు, భంగు, సారాయి, యితర మత్తు పదార్థములను సేవించుట మానుకొనవలెను. ఉత్తేజకర పదార్థ సేవనము యువకులకు మంచిది కాదు. అన్నిటికంటె సాత్విక ఉత్తేజకరమైనది బ్రహ్మచర్యము మాత్రమే. దానివలన శరీరములో కలుగు ఉత్తేజము టీ, కాఫీలు సేవించుట వలన కలుగదు. టీ, కాఫీల వలన కలుగు ఉత్తేజము తాత్కాలికమైనది. కాని బ్రహ్మచర్యము వలన కలుగు ఉత్తేజము శాశ్వతమైనది.

3. జననేంద్రియమును పరబ్రహ్మ యొక్క ఉత్పాదక శక్తి చిహ్నముగా మాత్రమే భావించవలెను. అటువైపు ఆలోచన కలిగినపుడు మన ఆలోచనలను ఆధ్యాత్మిక విషయముల వైపు మళ్ళించవలెను. అనవసరముగా యింద్రియ స్పర్శ జరుపరాదు. భయము, లజ్జ కలిగించు రహస్య కృత్యముల వైపు మనసు పోనీయరాదు. ఇది పాపమును గుర్తించు కార్యము. తల్లిదండ్రులతో రహస్యముగా నుంచబడు విషయములు అనుచిత మను భావము బాలకునకు కలిగించవలెను.

4. జననేంద్రియ అగ్ర భాగమును, చర్మపు పొరను తొలగించి శుద్ధ భావముతో ప్రతి నిత్యము కడుగవలెను. ఈ సమయములో మనసునందు పరమాత్మని మాతృశక్తి భావన కలుగవలెను. ముక్కు, చెవి మొదలగు అవయవములను శుభ్రపరచునట్లు యీ అవయవమును శుభ్రపరచవలెను. అగ్రభాగము యొక్క చర్మము పొడుగుగా నున్నప్పటికీ, యిరుకుగా నున్నప్పటికి డాక్టరును సంప్రదించి దానిని కత్తిరించవలెను. శుభ్రము చేయకుండుట వలన శిశ్న మొందెముపై పుండ్లుగాని వాపు, దురదగాని రావచ్చును. దానికై భయపడ నవసరము లేదు. తనను చెడిపోకుండా కాపాడుకొనిన వానిని వ్యాధు లేమియు చేయజాలవు. అంటువ్యాధుల ప్రకటనలను చూచిన వారు సాధారణ దురదకు భయపడెదరు. అశుభ్రత వలన మంట మొదలగునవి కలిగినచో యీ క్రింది ఔషధములను ఉపయోగించుట వలన ఆ బాధలు ఉపశమనము జెందును.

(క) <u>అల్లోపతి మందు</u> : డస్టింగ్ పౌడరు నుపయోగించవలెను. నీటితో శుభ్రపరచి బోరిక్ ఆయింటుమెంటు పెట్టవలెను. ఇది డాక్టర్లందరి వద్ద లభించును.

(ఖ) దేశీయ (ఆయుర్వేద) ఔషధము : త్రిఫల సిటతో అంగమును కడిగి త్రిఫల అయింటుమెంటు పెట్టవలెను. త్రిఫలములను కాల్చి వాటి బూడిదలో వ్యాజ్లేను కలిపిన ఇది తేలికగా తయారగును.

5. పై నాలుగు విషయములతో పాటు దైనిక చర్యను కూడా నియమితముగా నుంచవలెను. పూర్వీకులు దీని మహత్త్వము గుర్తించినట్లు నేడు గుర్తింపజాలకున్నాము. త్వరగా పడుకొనుట, త్వరగా మేల్కొనుట, పడుకొనినప్పుడు ముఖము కప్పుకొనకుండుట, నియమిత సమయమందు శౌచమునకు పోవుట, కడుపు శుభ్రముగా తేలికగా నుంచుకొనుట, దంతములు శుభ్రపరచుట, వ్యాయామము, ప్రాణాయామము, స్నానము, సంధ్య మొదలగు విషయములు సామాన్యముగా కనుపించినప్పటికి బ్రహ్మచర్యము కాపాడుటలో ఉపకరించును.

బ్రహ్మచర్య సాధన కొఱకు బాహ్యసాధనతో పాటు అంతర్ సాధన కూడా అవసరము. దుశ్చేష్ట తన మనసుకు వ్యతిరేకమైనప్పటికి తన యిష్టము లేకుండా జరుగదు. శరీరము మనసునకిష్టమైన పనినే చేయును. దుష్కార్య మొనరించు వ్యక్తి యొక్క యిచ్ఛ రెండుగా విభజించబడి యుండును. చెడు అలవాటును దూరము జేయుటకై తన యిచ్ఛా శక్తిని సుదృఢ మొనరించుకొనవలెను. తన యిచ్ఛను అవిభక్తముగా ఒక్కటిగా నుంచుము. దానిని శక్తివంత మొనరించుము. మంచి పని యెంత కష్టతరమైనప్పటికి దానిని సాధించి తీరుము. సంకల్పశక్తి మఱియు ప్రతిరోధక శక్తిని కూడగట్టనంత వరకు చెడుపై విజయము సాధించుట సంభవము కాదు. మెడ యెత్తి, వెన్ను చక్కగా పెట్టి నడువుము. దయ్యపు ప్రలోభములను కాలితో త్రోసివేయుము. కన్నులు బంధించి ఉంచుము.

నడుమును వంగనీయకుము. అటువంటప్పుడు దుశ్చేష్ట భూతము నీ ముందెట్లుండును ? బలహీనమైన మనోశక్తి దురాలోచనకు, దుశ్చేష్టలకు దారి తీయును. సంకల్ప శక్తిని ధృఢపరచుకొను అభ్యాస మొనరించుము. దీనికై లభ్యమైన సాహిత్యమును అధ్యయనము జేయుము. ప్రొ. జేమ్స్ తన "Principles of Psychology"లో అభ్యాసమును గురించి వ్రాసిన అధ్యాయమును పఠించుడు. అందు చక్కగా వివరణ యీయబడినది. దానిని చదువుట వలన మనుష్యులలో "స్నాయు చక్రము"తో మనోశక్తిని పెంచుట కెట్టి సంబంధము గలదో స్పష్టమగును. అందు యివ్వబడిన నిర్దేశములు క్రియాత్మకములై ఉపయోగకరమైనవి. అవి సంక్షేపముగా యీ క్రింద యివ్వబడు చున్నవి.

1. <u>మొదటి నియమము</u> : క్రొత్తగా చేసుకొనదలచిన లేదా విడిచిపెట్ట దలచిన అభ్యాసమును పూర్తి మనోబలముతో సాధింపుము. ధృఢచిత్తముతో సంకల్ప మొనరించుము. మీనమేషములు లెక్కపెట్ట వద్దు. దాని నాచరణలో పెట్టుటకై సాధ్యమైన పద్ధతులను, ఉపాయము లను అవలంబించుము: అందరి యెదుట ప్రతిజ్ఞ యొనరించుము. ఆత్మను ఉద్దేశించి నెమ్మది నెమ్మదిగా తనను తానే నిర్దేశించుకొన వలెను. "నేను యీ దురలవాటును విడుచుచున్నాను. పూర్తిగా విడుచు చున్నాను. విడిచిపోయినది. తిరిగి యెప్పటికి రాదు" అను శబ్దములు మాటిమాటికి పునరావృత్త మొనరించుకొనవలెను. ఏకాంత ప్రశాంత స్థానమున రాత్రి పడుకొనే ముందు, ఉదయము మేల్కొనగానే యీ వాక్యములనే పునరావృత్త మొనరించుకొనవలెను. దీని ప్రభావ మే మంత్రమునకు తీసిపోదు. మంత్రము యొక్క ఉద్దేశ్యము ఆత్మలో శక్తి నింపుటయేయై యున్నది. మొదట ప్రలోభన మెదుర్కొనుట కష్టముగా తోచెడిది కాని యిప్పుడు ప్రలోభములో పడుట దుష్కరము

పతనము నుండి కాపాడుకొనుటకు వేసిన ఒక్కొక్క అడుగు ఔన్నత్యమునకు మెట్లగును.

రెండవ నియమము: కొత్త అభ్యాసము పుంజుకొనువరకు ఒక్క క్షణము కొరకైనా దానిలో సడలింపు రానీయవద్దు. యుద్ధములో చిన్న విజయమే భవిష్యత్తులో పెద్ద విజయమునకు దారి తీయును. చిన్న పరాజయమే యితర పరాజయములకు దారి తీయును. పరాజయమునకు కలిగిన కొద్దిపాటి సమర్థన వలన విజయానికి గట్టి దెబ్బ తగులును. ఒకసారి గావించుకొనిన సంకల్పము అభ్యాసముగా మారనంతవరకు దృఢముగా నుండవలెను. దానిని యేమాత్రము సడలనీయరాదు.

మూడవ నియమము: సంకల్పమును క్రియలో పరివర్తన జేయుటకు యే అవకాశము దొరికిన దానినే అవలంబించుము. ఒకసారి అవకాశము చేయి జారిపోయినచో యెప్పటికి జారిపోయినట్లే భావించవలెను. సమయము తిరిగిరాదు. చేజారిన అవకాశము తర్వాత పశ్చాత్తాపమునకు కారణభూతమగును. ఇంగ్లీషులో సమయాన్ని బట్టతల వానితో పోల్చెదరు. అతనికి తల ముందరి భాగము వెంట్రుకలుండును. వెనక బట్టతల యుండును. సమయము రాగానే ముందు వెంట్రుకలను గట్టిగా పట్టుకొనును. జారిపోయిన యెడల బట్టతల కావున అది పట్టుపడదు.

నాలుగవ నియమము: అభ్యాసము చేసికొను సంబంధ పనులు అవసరమున్నను లేకున్నను ప్రతి నిత్యము చేయుచుండుట ఆవశ్యకము. అసలు పని జేయకుండా యుండుటకంటె చిన్న చిన్న పనులలో ధైర్యము, శూరత్వ గుణములను అభ్యాసము గావించుకొనుము. పరీక్షా సమయములలో బెదిరిపోవలదు. ఇది ఒక విధముగా భీమా వంటిది. ఇంటిని భీమా చేయు వ్యక్తికి యేమాత్రము లాభము కలుగదు. తన

వైపు నుండియే యివ్వవలసి యుండును. ఒక్కొక్కసారి బీమా చేయించిన వ్యక్తి తన జీవితములో దానివలన కలుగు లాభమును పొందలేక పోవచ్చును. ఒకవేళ యిల్లు తగులబడినచో సర్వనాశము గాకుండా బీమా చేయుట వలన కాపాడబడును. అటులే ప్రతి దినము ధీరత్వము, వీరత్వము, త్యాగము, ధనము మరియు సంకల్పము యొక్క యేదో ఒక కార్యము అవసరము లేకున్నను జేయుచు పోయినచో అతడు తన మానసిక, ఆత్మిక శక్తులను బీమా చేయించిన వాడగును. పరీక్షలలో పర్వతము వలె దృఢముగా నుండును.

రెండు రకాల మనుష్యులకు సమాజములో భయము కలదు. మహాత్ములు మరియు పాపులు. ఇందు నీవు మొదటిశ్రేణికి జెందనిచో రెండవ శ్రేణికి జెందెదవు. కుత్సిత సంకల్పము నీ హృదయ పటలము నందు ప్రపంచము నందు గన్పించని చిత్రము రచించి నీ సర్వ నాశనమునకు దారితీయును. కుత్సిత సంకల్పములు లేని పవిత్ర హృదయములలో దుశ్చేష్టలకు అవకాశము లేదు. మంచి పుస్తకములు చదువుము. ముద్రణాలయములు పెరిగి కోకొల్లలుగా పుస్తకములు ముద్రించబడుచున్నవి. డబ్బు కొరకై యిష్టమొచ్చినట్లు వ్రాయు చున్నారు. సోమరిగ నుండక చెడు సహవాసమును వదలివేయుము. సోమరితనము దుశ్చేష్టలకు దారితీయును. మనసునకు కోతివలె యేదో ఒక పని దొరకవలెను. పనులను మార్చుటయే మనసుకు విశ్రాంతి. మనసులో పవిత్ర ఆలోచనలు, పవిత్ర సంకల్పములు నింపుకొనిన యెడల దుష్కార్యములలో చిక్కుకొను అవకాశము లేదు.

మూడు విషయములు మనసుపై విషము వలె పనిచేయును. సోమరితనము, కుత్సిత సంకల్పము చింత. మనసు రిక్తముగా నుండుట సోమరితనము. దుర్వాసనతో కూడిన మనోభావములు కుత్సిత సంకల్పములు. మనుష్యుని మనస్సులో సంకల్ప వికల్పములు

చోటు చేసుకొనుట వలన మనసు భారముగా నుండును. అది తేలిక యగుటకు మానవుడు ప్రయత్నించి విఫలుడైనపుడు కలుగు వ్యథనే చింత యందురు. చింత వలన అనేక ఉన్నత ఆత్మల పతనము సంభవించినది. చింతతో కూడిన వ్యక్తి దుశ్చేష్టలకు గురియగు అవకాశ మెంతైనా గలదు. దీనివలన తాత్కాలికముగా ఉపశమనము గలిగినప్పటికి అటుతర్వాత మొదటికంటె యెక్కువగా ఆత్మగ్లాని యేర్పడును. సోమరితనము, కుత్సిత సంకల్పము, చింత యను మూడును మానసిక రోగములు. వీనివలన మస్తిష్కము యొక్క స్నాయవిక శక్తికి దెబ్బ తగులును. మనుష్యుని అఖండశక్తి భండారమునకు నష్టము వాటిల్లును. ఈ మూడు ఉపద్రవముల నుండి రక్షించుకొనుటకు 'సంకల్ప శక్తి' సాధనయే సర్వోత్తమమైన ఉపాయము.

## పత్ని వ్యభిచారము

'అమీబా' రచనలో లింగభేద ముండదు. దాని ఉత్పత్తి తత్త్వము మరియు వికాసములో పుంస్త్వము. స్త్రీ తత్త్వము కారణభూతములు గావు. అది ముక్కలై అనేక అమీబాలు ఉత్పన్నమగును. దానిలో నవీన తత్త్వములు సమావేశము కావు. కావున దానిలో యెట్టి పరివర్తన జరుగదు. . అమీబా నశించదు. అదే రెండు, నాలుగు, యెనిమిది పదహారుగా విభజితమగును. ఈ విభజన క్రియ వలన యివి సృష్ట్యంతము వరకు జీవించియే యుండును. అమీబా యొక్క ఉత్పత్తిని 'ఏకలింగ ఉత్పత్తి' (A Sexual Generation) యందురు. సృష్ట్యాది నుండి యిప్పటివరకు ప్రకృతిలో ఏకలింగ ఉత్పత్తి ద్వారా పని జరిగినచో ప్రాణుల రచనలో భిన్నత్వము ఉత్పన్నము జేయుటకై తన పాత విధానమును మార్చి క్రొత్త పద్ధతిలో పని తీసుకొనుట జరిగినది. ఇది లింగ భేదమునకు సంబంధించినది. ఇందు "ద్విలింగ

ఉత్పత్తి" "Sexual or Bi-Parental Generation"అగును. ప్రాణి రచనలో పుంస్తత్వము మరియు స్త్రీతత్వము రెండును పనిజేయును. అమీబా వలె మూలతత్వము యొక్క సగభాగము విడిపోయిన పని జరుగదు. రెండు భిన్న భిన్న తత్వము లగుట చేత వాటి కలయిక వలన కొత్త గుణములు ఉత్పన్నమగు అవకాశము కలుగును. ఏ భిన్న భిన్న శరీరముల ద్వారా యీ రెండు తత్వములు ఉత్పన్నమగునో అవి తమ ఆయుర్దాయమును గడిపి నశించును. కాని వాటి గుణములు యీ రెండు తత్వములు - శుక్ర కణములు మరియు రజః కణముల ద్వారా అమరము అగుచున్నవి.

శుక్ర కణములు మరియు రజః కణముల సంయోగములో ఏ నియమములు పనిజేయుచున్నవో అవియే మనుష్య శరీరములో పని జేయుచున్నవి. రెండు మూః ఉత్పాదక తత్వములు పురుష మరియు స్త్రీకి జెందినవి. ఈ తత్వముల సంయోగమే వివాహ మనబడును. శుక్ర కణము మరియు రజః కణముల పారస్పరిక స్వాభావిక ఆకర్షణయే మానవ జీవితములో ప్రేమ యనబడును. ఈ రెండు ఉత్పాదక తత్వముల సంయోగము వలన నూతన జీవనము ప్రారంభ మగునట్లు దంపతుల పారస్పరిక ప్రేమతోనే గృహస్థ ధర్మము నడచును. ఈ పరస్పర విరోధ తత్వముల కలయికతోనే ప్రాణి జీవనములో నవీనత యేర్పడుచున్నది. అటులే సమాజ సంఘటనలో పురుషుడు మరియు స్త్రీ యిరువురి సహకారము వలన మానవ సమాజము ఉన్నతి జెందును.

పురుషుడు స్త్రీ వైపు, స్త్రీ పురుషుని వైపు ఆకర్షితు లగుదురు. ఇది ప్రకృతి నియమము. ఇందు దోషము కూడా లేదు. అట్లుగానిచో సృష్టియే జరుగదు. అందుచేతనే ధర్మశాస్త్రములు వివాహమునకు ధర్మబద్ధముగా అనుమతి నొసంగినవి.

వివాహ మొక బంధనము. ప్రేమతంతువులు ఓతప్రోతమై యున్నంత కాలము మోక్షమును మించిన బంధమగును. సాధారణ గృహస్థులు యీ ప్రేమాగ్ని జ్వాలల నెట్లు మండించుచుండవలెనో తెలుసుకొనజాలరు. వారు మిడుతల చందమున యీ ప్రేమ జ్వాలలకు ఆహుతి యగుటయే నెరుంగుదురు. వివాహము తర్వాత స్త్రీ పురుషు లిరువురు కామాగ్నిని ప్రజ్వరిల్లజేసి అందు దూకెదరు. ప్రచండ అగ్ని ప్రజ్వలన తర్వాత అగ్నిజ్వాలలు శాంతించి బూడిద మిగులును. స్త్రీ పురుషులు ఒకరిపట్ల నొకరు ఆకలి గొనియుందురు. ఆకలితో యున్నవాడు మితము తప్పి తినుననుట సత్యము. మితి తప్పి తినిన వారి జీర్ణకోశము చెడిపోవును. ఆతడు ఆకలి యగుటకు ఔషధములు సేవించును. ఔషధముల వలన కృత్రిమమైన ఆకలి యేర్పడును. కృత్రిమ ఆకలితో యెవరెంత కాలము జీవించగలరు. మితిమీరి తినుట వలన కొద్ది రోజులకు అసలు తినుటయే ఆగిపోవును. విషయ భోగములలో ప్రవహించు వారు విషయ భోగములకు పనికి రాకుండా పోవుదురు. ఆకలికి ప్రధాన శత్రువు మితితప్పి తినుట యైనట్లే ప్రేమకు ప్రధాన శత్రువు విషయాసక్తులగుట. ఆకలిగా యున్నవానికి మితితప్పి తినుటచే యే ఆనందము చేకూరునో అట్టి ఆనందమే విషయాసక్తునకు విషయ లోలత్వములో కలుగును. అతిగా తిన్న వానికి అజీర్ణము కలిగినట్లు యీ నవదంపతుల కామవాంఛ చల్లారును. అందుచేత ప్రేమకు విషయ భోగము శత్రువని నిర్ధారణ జరుగుచున్నది.

వివాహరూప రథము నడుపుటకై దాని యిరుసులో ప్రేమరూప తైలము పడుచుండవలెను. లేనిచో అరిగిపోవుట జరుగును. అప్పుడు యీ బండి దారిలోనే ఆగిపోవును. మూర్ఖులైన దంపతులు విషయ భోగములోనే గృహస్థులు సుఖముగా నుండగలరని భావించెదరు.

విషయ భోగము ప్రేమయొక్క మొరటు రూపము. నిజమైన ప్రేమకు ఆత్మతో సంబంధము గలదు. శారీరక ప్రేమ ఆధ్యాత్మిక ప్రేమ యొక్క ఛాయ. అది దాని వాస్తవికతను గ్రహించదు. వివాహము తర్వాత నవయువకులు గడుపునట్టి జీవితము సుడిగాలి వంటిది. సుడిగాలి తర్వాత శ్వాసకే గాలి దొరకదు. మొదట మొదట ప్రేమ ముప్పిరిగొనును. కాని తర్వాత ఒక చుక్క కూడా మిగులదు. ప్రేమ అటువంటిదని వారు చెప్పెదరు. కాని యిది వారి భ్రమ. డాక్టర్ లూథర్ హెచ్. గులిక్ మహాశయుడు "Dynamic of Manhood" అను తన పుస్తకములో యిట్లు పేర్కొనెను. "ఒక పురుషుడు ఒక స్త్రీని వివాహమాడి కాలము గడిచిన కొలది ఆతని కా స్త్రీ మిక్కిలి ఆకర్షిత రాలిగా కనుపించును. సుకుమారత్వములో, సౌందర్యములో దిన దినము ప్రవర్ధమానమగుచున్నది. స్త్రీ పురుషుల ఆకర్షణ అవసరమని ఆతడు భావించవచ్చును. కాని వాస్తవిక ప్రేమ ఆధారము అత్యున్నతమైనది. ఆతనికి తన భార్య సంభాషణలో ఆనందము కలుగవచ్చును. ఆమె దృష్టిబిందు ఒక నూతన సౌందర్యమును కలిగించవచ్చును. ఆతడు తన భార్య కొరకై క్రొత్త వస్తువు తెచ్చును. క్రొత్త పుస్తకము తెచ్చును లేక చిత్రము తేవచ్చును. వీటివలన యింతవరకు ఆతని హృదయములో కలుగని భావములు తన భార్య ద్వారా వినెడు భాగ్యము కలుగవలెనని కోరుకొనును. పురుషుడు ప్రతి వస్తువును పురుష దృష్టితో, స్త్రీ స్త్రీ దృష్టితో చూచును. ఈ విధముగా ప్రేమ పెరుగుచుండవలెను. ప్రేమ యొక్క యీ స్వరూపమును తెలుసుకొనువారు కొద్దిమంది మాత్రమే గలరు. విషయాసక్తినే ప్రేమగా భావించెదరు. వాస్తవముగా ప్రేమ సంకుచితమైన వస్తువు గాదు. అది రాత్రిపూట యేకాంతముననే గాక యిరవై నాలుగు గంటలు ప్రకటిత మగును. ఇట్టి ప్రేమయే చాలా కాలము వరకు మనగలిగి యుండును."

పురుషుడు తన మూర్ఖత్వము వలన స్త్రీ సంతోషము కామభావన లోనే యుండవచ్చునని తలంచును. అతనికి స్త్రీతో యెట్లు మాట్లాడవలెనో, కామచర్చ విడిచిపెట్టి యిరవై నాలుగు గంటలు ఆమెతో యెట్లు గడుపవలెనో తెలియదు. మన సమాజము కూడా స్త్రీతో కామభావనే ఆమెకు సంతోషము కలిగించునను భావము యేర్పరచు స్థితికి దిగజారినది. స్త్రీ యొక్క యిష్టాయిష్టములను గ్రహించుటకు కూడా సిద్ధపడడు. కామవాసనా భూతముకంటె యీ భావభూతమే గాఢముగా నున్నది. ప్రతి పురుషుడు స్త్రీ తన శరీరమునకు అధికారిణి యని గ్రహించుట ఉత్తమము. ఆమె యిష్టమునకు వ్యతిరేకముగా చెయ్యి పట్టుకొనుట బలాత్కారమే యగును. అనియమిత భోగము వలన ప్రేమ నష్టపోవును. కామవాసన లేకుండా భార్యతో స్నేహితునితో గడిపినట్లే 24 గంటలు గడుపవలెను. అటువంటప్పుడే ప్రేమ చిరస్థాయిగా నిలిచిపోవును.

విషయములలో లిప్తమైనవాడు చివరకు విషయములకు కూడా కొరగానివాడగును. స్త్రీ పురుష లిరువురకు ముఖముమొత్తి అసహ్యము, ద్వేషము కూడా కలుగును. జీవితము శూన్యముగా కళాహీనమై పోవును. వివాహ బంధములో పడక పూర్వము దంపతులు డాక్టర్ కోవన్ వ్రాసిన యీ పఙ్క్తులను చదువుకొనుట మంచిది. "క్రొత్తగా వివాహము చేసుకొనిన దంపతులు విషయ భోగములనెడు ఊబిలో దిగబడిపోయెదరు. వివాహపు తొలి దినములు నిత్య వ్యభిచార దినములుగా మారును. వివాహ మనెడు ఉన్నత సంస్కారము కూడా మనుష్యుని పశువుగా మార్చుట కొరకే ఏర్పరచబడినదా యను సందేహము కలిగించుచున్నది. విషయ వాసనలో చిక్కుకొనిన వారి శరీరము, ఆత్మ రెండును పతనము జెందగలవు నిగ్రహ శక్తి లేని వారిలో ప్రేమ ఉండదు. సంయమహీన జీవితము నుండి ప్రేమ

ఉత్పన్నము కాదు. స్త్రీ, పురుషులు రతి కొరకు స్త్రీ యిష్టా యిష్టములను తెలిసికొనుట అవసరము. స్త్రీకి ఋతుధర్మమైన వెంటనే కోరిక కలుగుట ప్రకృతి నియమము. పురుషుడు తన అధికారముతో స్త్రీకి యిష్టము లేకున్నను రమించుట వ్యభిచారము వంటిదే యగును. స్త్రీ కేవలము పతికి భయపడి అతని కోరిక తీర్చిన యెడల పురుషుని మస్తిష్కముపై హస్తమైథునము వలన కలుగు పరిణామమే కలుగును.

వ్యభిచారము అది యెట్టిదైనను ఉచ్చరించుటకే అభిమానముగా నున్నది. వివాహము చేసుకొని పురుషుడు తన యిష్టము వచ్చినట్లు రమించుటకు సర్వాధికారములు కలవని రాత్రింబవళ్ళు ఒకటి చేయుట ప్రకృతి నియమానికే విరుద్ధము. నిగ్రహము లేని జీవితము యీశ్వరీయ నియమముల ముందు వ్యభిచారమే యగును. జీవిత సహధర్మచారిణిని కేవలము తన తుచ్ఛ కోరికలను తీర్చుకొనెడు యంత్రముగా నుపయోగించుకొన జూచుట మహాపాపము మరియు స్త్రీ పట్ల గావించెడు ఘోర అన్యాయము.

దేశమును గురించి, సమాజమును గురించి పురుషుడు ఆలోచించి నట్లు స్త్రీ తాను కూడా పురుషునితో సమానమని తానొక సాధనము కాదని తెలిసికొని ప్రవర్తించినపుడు యీ నిగ్రహము సాధ్యమగును. స్త్రీ పురుషుని సమీపించగానే కామవాసన తప్ప యితర మెద్దియు ఆలోచించడు. స్త్రీని పరదాలో నుంచి ఆమెను పక్షిగా, రామచిలుకగా చేసి ఆమెతో ఆడుకొను సమయములో మాత్రమే పంజరము నుండి బయటకు తీసినచో గృహస్థు కూడా కామవాసనా తృప్తియొక్క నరక కుండముగా మారును. భర్త తన భార్యను తన దైనందిన కార్యక్రమము లలో దేశము, సమాజ సంబంధిత కార్యక్రమములలో, ఆలోచనలలో భాగస్వామి యగునట్లు జేయవలెను.

విషయలోలు డగుటకు సమాజములో వ్యాపించియున్న భ్రమ ప్రమాదములు కారణములు. స్నేహితులు గృహస్థునకు స్త్రీలలో కామ మధికమని ప్రబోధించి ఆమెను రాత్రింబవళ్ళు సాధనముగా ఉపయో గించుకొననిచో వ్యర్థునిగా భావించునని చెప్పుదురు. అందుచేత భావోద్రేకముచే కామోద్రేకితుడగుచున్నాడు. వారు తెలిసికొనవలసిన విషయమేమన కామభూతము స్త్రీపై గాని, పురుషునిపై గాని ఆవహించి యుండదు. వ్యాపించియున్న భ్రమ ప్రమాదముల వలన వారు పరస్పరము ఆత్మోన్నతికి సాధనము లగుటకు బదులు పరస్పరము పతనమునకు కారకు లగుదురు.

## వేశ్యా వ్యభిచారము - వేశ్యాగమనము

వివాహ సంబంధము లేకుండా స్త్రీ పురుష యోని సంబంధము వ్యభిచార మనబడును. హస్తమైథునము పత్నీ వ్యభిచారము మాదిరిగానే యిదికూడా ఆత్మ పతనముగా పరిగణించబడును. ప్రస్తుతము మన సమాజము కుత్సితవాసనా దుర్గంధ మనెడు రౌరవ నరక మనుభవించు చున్నది. స్త్రీని కామక్రీడ యొక్క బొమ్మగా పరిగణిస్తున్నారు. భోగ లాలసత్వ వేదికపై స్త్రీ యొక్క సతీత్వము నిత్యము బలి యివ్వబడు చున్నది. పాశ్చాత్య దేశములలో స్త్రీలకు పురుషునితో సమానస్థాన మివ్వబడుచున్నప్పటికి ప్రాచ్య, పాశ్చాత్య దేశాలలో వ్యభిచారభూతము ఆవహించియున్నంత కాలము సమాజము పతనము జెందినట్లుగానే భావించవలెను. సమస్త స్త్రీ సమాజము ఘోర అవమాన మనెడు అపరాధము చెల్లించుచున్నది. ఈ సమయములో భారతదేశములో 5 లక్షల కంటె హెచ్చుగా వేశ్యలు కలరు. వారి వార్షికాదాయము 75 కోట్ల వరకు గలదు. "న స్వైరీ స్వైరిణీ కుతః" అని స్వాభిమానముగా చెప్పుకొనగలిగిన అశ్వపతి పాలించిన కైకేయ రాజ్యము యొక్క నేటి

దుర్దశ యిట్లు మారినది. ఈ దేశ దుర్దశను జూచిన ఆ మహాత్ముని ఆత్మ యెంత క్షోభించునో? స్వతంత్ర దేశములో కూడా యిట్టి నికృష్ట కార్యము కొనసాగుట మనకు తలవంపు గాదా?

స్త్రీలపై సమాజము గావించు అత్యాచారము లనేకముల్లు. పురుషులు స్త్రీపై బలాత్కారము గావించి ఆమె సతీత్వమును భంగపరచినపు డా అమాయకురాలు నిర్దోషియైనను సమాజము నుండి గెంటివేయబడును. కాని ఆ పాపిష్టి పురుషుడు మాత్రము యథా ప్రకారముగా ధనబలము చేత పురుషత్వ అహంకారము సమాజము గుండెపై నడచును. ఆ అబల యొక్క గతి యేమిటి? ఆమెకు యెవరు రక్షణ కల్పిస్తారు? దుఃఖముల బారిన పడిన ఆ యువతి బాధలతో సమాజము గావించిన అన్యాయభరిత అత్యాచారములచే పీడింపబడి ఆమె వణకిపోవును. లజ్జ, అభిమానములను వదలివేయును. భిక్ష మడిగిన ఒక్క పైసాకూడా దానమీయని వారు పాశవిక కామపిపాసపై తమ రాజ్యములను కూడా పణముగా పెట్టెదరు. ఒక యింటికి గృహిణిగా, సుతులకు తల్లిగా నుండవలసిన ఆ బాలిక నడివీధిన తన మాన మమ్ముకొనుటకు వివశురా లగుచున్నది. దీనికి బాధ్యు లెవరు? అత్యాచార పూరితమైన యీ సమాజము కాదా?

రోజురోజుకు పెరుగుచున్న విధవల సంఖ్య వలన కూట వేశ్యా వృత్తి గణనీయముగా అల్లుకొనిపోవుచున్నది. ఈ దుర్భాగ్య దేశములో విధవల సంఖ్య కోట్ల వరకు గలదు. తమ జీవితములో దురాచార ప్రవృత్తులలో ప్రతి క్షణము గడుపువారు యీ విధవలు, అందులో కొందరు పతి ముఖమైనా చూడనివారు జీవితమంతయు తిరిగి వివాహము లేకుండా గడుపవలెనని ఆశించెదరు. సమాజము నేటి పరిస్థితులలో కూడ విధవా వివాహమును చట్టములు అంగీకరించినప్పటికి అశాస్త్రీయ మైనదిగా పరిగణించుచున్నది. పతి ముఖము కూడా చూడని బాల

విధవలు మరియు యితర విధవలు పర పురుషుని ఛాయామాత్రమైనను మనసునందు రానీయనివారు కలిగిన యీ దేశము యొక్క విధవలు ధన్యవాదములకు పాత్రులు. విధవలను నియమములో నుంచి వారిని చెడు దృష్టితో చూడనిచో ఆమె తనను తాను కాపాడుకొనెడిది. వారు వివాహము చేసికొనకూడదు కాని పురుష పుంగవులు వారిపై వల పన్నవచ్చును. అటువంటప్పుడు వ్యభిచారము వ్యాపించక యేమగును?

విధవల పట్ల మన వ్యవహారము కూడ దురుసుగా నున్నది. భర్త యున్నప్పుడు రాణిగా మొత్తము కుటుంబముపై అధికారము నడుపునట్టి స్త్రీ భర్త మరణముతో యింటికి దాసిగా మారిపోవును. అంతకు పూర్వము తిండికి కొదవలేని స్త్రీ సెనగలపై ఆధారపడును. ఈ నికృష్ట పరిస్థితుల నుండి, ఆర్థిక యిబ్బందుల నుండి విముక్తి పొందుటకై ఆమె పతనపు మార్గము వైపు పయనించును. సమాజమే దీనికి బాధ్యత వహించవలెను. కాని సమాజము తన ప్రవర్తనను మార్చుకొనక పోవుటయే గాక ఆ అబలను వేశ్యావృత్తిలోకి నెట్టివేయును.

అన్నివైపుల నుండి పీడించబడిన స్త్రీ తన పొట్ట నింపుకొనుట కొరకై ఈ నరకములోనికి దూకును. సమాజము తన దృక్పథము మార్చుకొనుటకు బదులు ఈ పాపమును పోషించుట కంగీకరించును. ఏ వేశ్యయైనను తన వృత్తిని ద్వేషించకుండా యుండలేదు. "చాంద్" పత్రిక వేశ్యలకు సంబంధించిన ప్రత్యేక సంచిక ప్రకటించినది. ఒక వేశ్యా యువతి భావములను సంపాదకు డిట్లు వివరించెను. "మాకు హృదయము లున్నవి. అనేక పురుషుల ముఖము చూచుటచే మాకు దుఃఖము కలుగును. మా హృదయములలో పిపాస గలదు. ఆ పిపాస యిట్టి పతిత జీవితముతో శాంతించునా? పైసతో కొనబడెడి కామ పిపాససాకారులము మేము. ఒక సుందర యువకుని ప్రేమిస్తాము, కాని

ఒక ముదుసలి పైసల కొరకై మాత్రమే మా శరీరమును అమ్మెదము, మా జీవితములు భయంకర అగ్నికుండములు."

వేశ్యావృత్తి యొక్క ప్రకాశవంతమైన చిత్రము డా॥ ఫూట్ యిట్లు రచించెను. ఊహా చిత్రమొకటి యిట్లుండును. "ఒక వ్యక్తి అందరు వచ్చిపోవు కూడలిలో నిలుచొని పైసల కొరకై యేదిచ్చినను తినెదనని ప్రకటించెను. కొందరు మధుర పదార్థముల నిచ్చిరి. మరి కొందరు చూడగానే వాంతియగు పదార్థములను తెచ్చిరి. పొట్టపై రోజులు, మాసములు, సంవత్సరముల పర్యంతము అత్యాచారము జరిగిన యెడల జీర్ణకోశము చెడిపోయి రోగగ్రస్థ మగును. అటువంటి పరిస్థితులలో సంయమరహితుడై వ్యభిచారమునకు అలవాటు పడిన వ్యక్తికి కలుగు రోగము పేరు భగవంతునకే తెలియవలెను. ఉత్పాదకాంగముల రచన పొట్టకంటె సున్నితమైనది. దాని దురుపయోగము వలన భయంకర వ్యాధికి గురియగుదుము. అధిక విషయాసక్తి వలన గర్భస్రావము, ప్రదర వ్యాధి కలుగును. అటువంటప్పుడు తనకిష్టమైనను కాకున్నను అనేక వ్యక్తులతో రాత్రింబవళ్ళు రతిక్రియ జరిపిన స్త్రీ గుహ్యాంగములు విషపూరితము లగును. ఆమెతో సంపర్కము చేసిన వారికి ఆ వ్యాధి సోకును. ఆ వ్యాధి సోకిన పురుషులు అమాయకులైన తమ భార్యా పిల్లలకు యిట్టి వ్యాధిని సోకజేయుదురు. వేశ్యలు అనేక రోగాక్రాంతు లగుదురు. ప్లేగు, కలరా వ్యాధులను కీటాణువులు వ్యాపింపజేయునట్లు ఈ వేశ్యలు సమాజములో అనేక రోగములను వ్యాపింపజేయుదురు ప్రొ॥ టార్నాస్కీ కథనము ననుసరించి ఒక వేశ్య పది నెలలలో 300 మందిని రోగగ్రస్థులను జేసినది. వారిద్వారా యెంతమందికీ రోగములు సోకునో లెక్కలేదు. వేశ్యావృత్తి యెంత ప్రమాదమైనదో గ్రహించనగును.

వేశ్యావృత్తి ఆర్థిక సమస్య మరియు సామాజిక దుర్వ్యవస్థ యొక్క పరిణామము. ఆర్థిక సమస్యగా యిది బహిరంగ వ్యాపారముగానే జరుగును. అప్పుడప్పుడు ఆర్థిక కారణములు లేకుండా కూడా యీ గర్హనీయ వృత్తి సాగును. అటువంటప్పుడు యిది రహస్యముగా నుండును. పట్టణములలో పెద్ద పెద్ద కుటుంబములలో యిట్టి కథలు వినవచ్చును. ఇవి సత్యమైనను లేక ఆరోపణలే యైనను యథార్థ విషయములు కూడా కొన్నియుండును. సమాన గుణ స్వభావము లేని స్త్రీ పురుషులకు వివాహము జరిపినప్పుడు కొద్ది రోజులలోనే వారి కండ్లు తెరచుకొనును. వారు విడాకులైన తీసుకొందురు లేక కోర్టులకైన యెక్కెదరు. విడాకులు సంభవము కానిచోట రహస్యముగా వ్యభిచారము జరుగుచుండును. భారతదేశములో వివాహములు ధార్మిక కార్యముగా జరుపబడుచున్నవి. కాని యీ రెండు ఆత్మలు జీవిత పర్యంతము కలిసి యుండునని సమాన గుణకర్మలు కలిగియుండెనా లేదా అని ఆలోచించుట లేదు. వారి పూర్తి ఆమోద ప్రమోదములు లేకుండా వివాహములు జరుపబడుచున్నవి. ఇది మాతాపితల వివాహ మనునట్లు గోచరించుచున్నది. ఈ దుర్వ్యవస్థను ఆపుటకై ప్రాచీన భారత దేశములో స్వయంవరము జరుపబడుచుండెను. మాతాపితల ఆధ్వర్యములో వారి సంరక్షణలో వారి ఆలోచనలతో కన్య వరుని వరించుచుండెడిది. అట్లే వరుడు వధువును వరించుచుండెడివాడు. ఇట్టి వ్యవస్థయే తిరిగి ప్రచారములోనికి రావలెను. దేశ ఆర్థిక స్థితిని చక్కబరచుటకు, విధవ స్త్రీలతో దుర్వ్యవహారము నాపుటకై మరియు గుణకర్మానుసారము వివాహము జరుపు వ్యవస్థ యేర్పాటైనపుడే వేశ్యావృత్తి సమస్యను పరిష్కరించగలము.

## స్వప్నదోషము

అస్వాభావిక జీవితమును గూర్చి చర్చించుచు దీనిని రెండు భాగములుగా విభజించనగునని పూర్వము పేర్కొనబడినది. తెలిసి

నిగ్రహము గోల్పోవుట, తెలియక నిగ్రహమును గోల్పోవుట. తెలిసి నిగ్రహమును గోల్పోవు విషయమై గత మూడు అధ్యాయములలో మూడు భాగములుగా వివరించనైనది. తెలియక నిగ్రహమును గోల్పోవుట సామాన్యముగా స్వప్నావస్థలో జరుగును. అందుచేత దీనిని స్వప్నదోష మందురు. గత మూడు అధ్యాయములలో వర్ణించిన సంయమ భంగము జాగ్రదావస్థలో కలుగు దోషము. దీనిని తెలిసి తెలిసి చేయుట వలన వ్యభిచార మందురు. స్వప్నదోషము నిద్రావస్థలో జరుగును. ఇష్టము లేకున్నప్పటికి నిరోధించుటకు ప్రయత్నించినప్పటికి జరుగును. కావున దీనిని వ్యభిచారమని గాక దోషమని యందుము.

నిదురావస్థలో వీర్యపాతమగుట స్వప్నదోష మనబడును. దీని విషయములో అభిప్రాయ భేదములు కలవు. రెండు మూడు వారముల కొకసారి స్వప్నదోషము వలన హాని కలుగదని కొందరి అభిప్రాయము, వీర్యపాతము వలన తలనొప్పి, తల బరువు మొదలగు బాధలు లేనిచో అవి శరీరమునకు స్వాభావికమైనవిగా భావించి వారానికి ఒకటి రెండు పర్యాయములైనను బాధ యుండదని కొందరి అభిప్రాయము. వీర్యపాతము తర్వాత తాను తేలిపోవుచున్నట్లుగా, అలసినట్లుగా తోచినచో కొన్ని నెలల కొకసారి జరిగినను అసహజమైనదిగా, రోగ చిహ్నముగా భావించవచ్చును. జీవితములో ఒకే ఒకసారి స్వప్నదోష మైనను యే విధమైన స్వప్నదోషమైనను అది అస్వాభావికమైనదిగా, రోగ చిహ్నముగా నెంచబడునని కొందరి అభిమతము. ఈ రెండు అభిప్రాయములలో రెండవది మాత్రమే సరియైనది. ప్రకృతిలో యిట్టి వ్యర్థపు ఖర్చునకు అవకాశము లేదు. జీవితసారమును యిట్లు దోపిడీ గావించబడు పద్ధతి లేదు. శరీరములో గల నిస్సార పదార్థములు శరీరము నుండి వెడలిపోవుటకు వాటికి ప్రత్యేక మార్గములు గలవు. మలాశయము మరియు మూత్రాశయములలో మల మూత్రములు

సంచిత మగుచుండును. ప్రాణి తన అవసరమును బట్టి వాటిని బయటకు నెట్టివేయును. పిల్లవాడు తెలియక పక్కలో మూత్రము పోసినప్పటికిని లేక మల విసర్జన చేసినప్పటికిని అది యేదో వ్యాధిగా భావించి వైద్యుని కడకు మందుకై తీసుకొని వెళ్ళుదుము. అటువంటప్పుడు వీర్యము వంటి అమూల్య పదార్థము నిదురలో గాని, జాగ్రదావస్థలో గాని తెలియకుండా వెడలుట యెట్లు స్వాభావిక మగును? శవ పరీక్ష జేసి దోషమును కనిపెట్టు వైద్యులు జీవించియున్న మనుష్యుల గురించి తెలిసికొనలేకపోవుట దురదృష్టకరము. తెలిసియున్నచో స్వప్నదోషము స్వాభావికమని చెప్పుటకు సాహసించరు.

అనేకసార్లు స్వప్నదోషము జరిగిన తర్వాత కూడా తలనొప్పి బరువు, అలసట యెందుకు కలుగవు? కొందరికి స్వప్నదోషము తర్వాత శరీరము తేలికగా నగును. వారి చిరాకు దూరమగును. వీటికి కారణమేమను ప్రశ్న ఉదయించును.

శరీరములో నశించిన శక్తికి మరియు రోగమునకు చికిత్స జేసుకొను ఆశ్చర్యకర శక్తి శరీరమునందు గలదు. సుదృఢులు, బలకాయులునైన వారి శరీరము నుండి రక్తము ప్రవహించుచున్నప్పటికి వారికట్టి భావనయే కలుగకపోవును. తన శరీరముపై గల మచ్చను జూచి తాను ఆ గాయము విషయము తెలిసికొని ఆశ్చర్యపోవును. శరీరములో గల జీవశక్తి రోగవిషయములు తెలియక పూర్వమే స్వస్థత చేకూర్చుకొనును. ఆలస్యముగానగు స్వప్న దోషము వలన కనిపించని నష్టము యిదే విధమైన నష్టము శరీరమునకు కలిగించును. ఆ జీవశక్తి ప్రభావము వలన యీ నష్ట మతనికి గోచరించదు. ఇది మనుష్యుని మూర్ఖత్వమునకు సంకేతము. నష్టము తప్పక కలుగును కాని ప్రపంచ సంహార శక్తులపై రచనాత్మక శక్తులు విజయము సాధించెను. వీర్యము యొక్క ఒక బిందువు నష్టమైనను శరీరమునకు

హాని కారకమే. కాని ఆ నష్టము స్వల్పముగా నున్నప్పుడు శరీర జీవనశక్తి ఆ నష్టమును స్వయముగా పూరించుకొనును. అందుచేత స్వప్నదోషము అస్వాభావికమై రోగ చిహ్నముగానే యుండును.

స్వప్నదోషము వలన అనేకులు మానసిక అశాంతి దూరమై నట్లుగా భావించెదరు. నిరోగియైన మనుష్యుడు శారీరక శక్తి గోల్పోయి నట్లు భావించకపోవచ్చును గాని దీనివలన అశాంతి దూరమైనదనుట అసంభవము. అస్వస్థుడైన మనిషి తన మానసిక, శారీరక అపవిత్రత వలన తనయందు కామభావము ఉత్తేజితపరచుకొనును. తన మనసునందు చెడు భావములను తెచ్చుకొని స్నాయుతంతువులతో ఉద్రేకము పురిగొలిపి తన కామవాసనను పూర్తిజేసుకొనని స్థితిలోయుండి నప్పుడు మాత్రమే స్వప్నదోషము వలన క్షణికముగా తన అశాంతిని పోగొట్టుకొనును. కామోద్రేకము కలిగినపుడు దానివలన అశాంతి యేర్పడినవుడు దాని బహిష్కరణ కూడా యేదో విధముగా నగును. అది తెలిసియైనను, తెలియకనైనను గావచ్చును. లేనిచో మొత్తము స్నాయుచక్రము అస్తవ్యస్తము కాగలదు. ఇది క్షణికమైన ఉపశమనము మాత్రమే కలిగించును కాని తిరిగి రెండింతల మూడింతల వేగముతో ఉద్రేకము కలిగి జీవిత పర్యంతము అశాంతి, వ్యామోహము కలిగించును. శక్తిహీనత యొక్క అశాంతి అన్నింటికంటె పెద్ద అశాంతి. స్వప్నదోషము వలన యెవ్వరికైన మానసిక శాంతి కలుగు ననుట భ్రమ మాత్రమే.

అందుచేత స్వప్నదోషమునకు శారీరక స్వాభావిక వికాసము నందు ఒక్క క్షణము కొరకైనను స్థానము లేదు. స్వప్నదోషము శరీరము యొక్క రోగావస్థ. ఇది విని ప్రపంచములో ఒకసారియైనను స్వప్నదోషము కాని పురుషు డెవరైనా గలరా? యని యువకులు

ప్రశ్నించవచ్చును. ఒకవేళ అట్టి పురుషుడున్నాడా లేదా యనుటకు సమాధానము దొరకకున్నను పరిపూర్ణ ఆరోగ్యవంతుడు యుండి యున్నచో అతడు స్వప్నదోషము లేనివాడని చెప్పదగును ఈ సమాధానము సంక్షిప్తముగా భావించినను దీనిని అర్థము జేసికొనుటకు సంపూర్ణ ఆరోగ్యవంతుని జీవిత వికాసము యొక్క ఒక రూపురేఖను చిత్రించగలిగినచో ఆతని జీవితములో స్వప్నదోషము కాలేదనుట స్పష్టమగును.

ఒక యేడు సంవత్సరముల బాలుడు తన పైతృక కుసంస్కారము నుండి దూరముగా నున్నట్లు కల్పించుకొనుము. ఆతడు శుద్ధ పవిత్ర వాతావరణములో పెరుగుచుండును. రాజసిక భోజనము నుండి దూరముగా నుండును. మనస్సును, శరీరమును పవిత్రముగా నుంచుకొనును. మంచి స్నేహితులు కలిగియుండును. మరియు బ్రహ్మచర్యము యొక్క అన్ని నియమములను పాలించును. ప్రస్తుత కలుషిత వాతావరణము నుండి దూరముగా నున్న ఆ బాలకుడు పది, యిరవై, యాభై, డెబ్భై, వంద సంపత్సరములు లేక జీవించియున్నంత కాలము స్వప్నదోషము కాకుండా యుండును. పశు పక్ష్యాదులు ప్రకృతికి దగ్గరగా నుండు ప్రాణులు. వాటికి స్వప్నావస్థలో వీర్యము స్ఖలనము గాదు. ఇది ప్రకృతి యొక్క రచన. కల్పిత బాలకుడు ప్రపంచములో ఆదర్శ బాలకుడగును. ఆతడు తన మనమునందు చెడు విచారములను రానీయడు. 18 సంవత్సరముల కుమారావస్థలో కామోద్రేకము కలిగినను దానిని నిగ్రహించుకొనగలడు. తనను కామ భావనలో ప్రవృత్తి కలిగించుకొనుటకు బదులు దానిని రూపాంతరము గావించుకొనును. ఈ వయసులో నాతనికి అంతఃస్రావము కావచ్చును ఆతనికి తెలిసియైనను, తెలియకయైనను వీర్యస్ఖలనము గాదు. ఆతని శుక్రాశయము యింతవరకు ఖాళీగానే యుండును. ఆతని కీ విషయ

జ్ఞానము కూడా యుండదు. కుమారావస్థను దాటి 25 సంవత్సరముల వయసులో యువావస్థను జేరినపు డాతని శుక్రాశయము నిండుచుండును. ఆతనికి బహిఃస్రావ మారంభమేగును. ఇది స్వాభావిక విషయము. దాని నుత్పన్నము జేయుటకు యెట్టి మానసిక ఉత్తేజనము అవసరము లేదు. ఈ అవస్థలో శాఖనుండి ఫలము రాలుట వంటి సహజత్వము బహిఃస్రావము కలిగియుండును. ఇంతవరకు జరిగిన శారీరక వృద్ధియొక్క అవశ్య పరిణామమే బహిఃస్రావము. ఇచట బహిఃస్రావము, అంతఃస్రావము శుక్రకణముల యొక్క నామాంతరము ఈ శుక్ర కణముల సంచలనము స్వాభావికము. ఇదే సంచలనము మన కాల్పనిక పూర్ణ ఆరోగ్యప్రదుడైన పురుషునిలో కామోద్రేకము కలుగుటకు భౌతిక కారణమగును. శుక్ర కణముల చలనము భౌతిక చలనము. కామోద్రేకము మానసిక సంచలనము. ఈ రెండింటికి కార్యకారణ సంబంధముండును. ఈ ప్రకారము ఉత్పన్నమైన కామ భావము స్వాభావికమగుటయే గాక పెరుగుచున్న శారీరక చిహ్నము. అందుచేతనే ఆదర్శమైనది. 25 సంవత్సరముల ఆ వయసు తర్వాత ఆ పురుషునకు రెండు మార్గములు గలవు. ఒకవేళ ఆతడు ఆజన్మ బ్రహ్మచర్య జీవితము గడుపదలచిన బహిఃస్రావమును శరీరములో చేర్చుటను ప్రాచీన భాషలో "ఊర్ధ్వరేతా" మార్గమందురు. దీనిని ప్రాచీన కాలములో ఋషుల ఆశ్రమములలో, గురుకులములలో అభ్యసించి అవలంబించుచుండిరి. ఆదిత్య బ్రహ్మచర్య ఆదర్శములను జీవితములో మలచుకొనుచుండిరి. శుక్రాశయములో చేరు శుక్ర భాగమును అనగా బహిఃస్రావమును శరీరమునందు యిముడించుకొనుట యొక విద్యయై యుండెను. దానిని నిపుణుడు మాత్రమే అభ్యసించుచుండెను. బహిఃస్రావములో నూతన ప్రాణిని ఉత్పన్నము జేయు శక్తి గలదు. దీనిని శరీరమునందు యిముడించుకొనిన నొక నూతనోత్తేజము

శక్తియు కలుగును. బ్రహ్మచర్య మనగా వీర్యము యొక్క భౌతిక శక్తిని సాధనచేత ఆధ్యాత్మిక శక్తి రూపములో పరివర్తన గావించుట. ప్రాణి జగత్తులో కామవాసన అత్యంత ఉగ్రఉత్కట శక్తియొక్క ధార. దానిని పశు పక్ష్యాదులు రూపాంతరము గావించలేవు. అందుచేత అవి తనవంటి యితర ప్రాణులను ఉత్పన్నము జేయును. కాని మానవ జగత్తులో యీ ప్రబలవేగవంతమైన శక్తిని, కొత్త ప్రాణిని ఉత్పన్నము జేయుటకు బదులు యీ అనంత శక్తితో ఆధ్యాత్మిక జగత్తులోనికి ప్రవేశించవచ్చును జలపాతమునందు గల జల ప్రవాహ వేగము అంతశ్శక్తి గల విద్యుత్తును ఉత్పన్నము చేయుచున్నది. వీర్యమును ఖర్చు చేయకుండా దానిని లోలోపల యిమడజేసుకొనినచో జల ప్రవాహ వేగముతో విద్యుత్తును ఉత్పన్నము జేసినటులే దీనితో కూడా అట్టి శక్తినే ఉత్పన్నము జేయవచ్చును. ఆ కాల్పనిక వ్యక్తి ఆజన్మ బ్రహ్మచారిగా నుండదలచని యెడల వివాహము జేసుకొని నూతనప్రాణి నుత్పన్నము జేయును. వైవాహిక జీవితములో కూడా ప్రాకృతిక జీవితమే గడుపును. ప్రకృతి సహజముగా ఆతనియందు కామేచ్ఛ కలిగినట్లు స్త్రీ సంభాషణేచ్ఛ కూడా ఆతనికి ప్రకృతి ద్వారా నియమిత మగును. శుక్ర కణముల వలన స్వాభావికముగా నాతనిలో కామభావ ముత్పన్నమగును. శుక్రాశయము నిండుట వలన స్త్రీతో సంభోగేచ్ఛ గలుగును. ఆతని శుక్రాశయము తొందర తొందరగా నిండదు. అతడు కామోద్రేకము కలిగించుకొనుటకై యెప్పుడు ప్రయత్నించడు. ప్రకృతి నియమముల ననుసరించి శారీరక ప్రత్యేక అవస్థలో స్వయముగా ఆతనిలో కామేచ్ఛ ఉత్పన్నమగును. ఆతడు శుక్రోత్పాద అవయవములను వాటి స్వాభావిక గతిలో నడిపించు దానిపై అసహజ మైన వత్తిడి వేయడు. అందుచేత ఆతని శరీరములో అంతఃస్రావము జరుగుచుండును గాని బహిఃస్రావము జరిగి శుక్రాశయము త్వరగా

నిండదు. ప్రాణి యే పరిసరములలో యే వాతావరణములలో నుంచ బడునో ఆ యా పరిసరములకు, వాతావరణమునకు అనుకూలముగా మారును. శుక్రోత్పాదక అవయవము బహిఃస్రావము నుత్పన్నము జేయును. దీని ఆవశ్యకత ననుసరించి తొందరగా గాని, నెమ్మదిగా గాని శుక్రాశయము నిండును. స్వాభావిక జీవితము గడుపు ఆదర్శ వ్యక్తి రెండున్నర మూడు సంవత్సరములకు ఒక సంతానము ఉత్పన్నము జేయును. అందుచేత అతని ఉత్పాదక అంగము పని జేయు తీరును బట్టి అతని శుక్రాశయము రెండున్నర మూడు సంవత్సరములకు నిండును. శుక్రాశయము నిండు సమయమును యిష్టపూర్తిగా తగ్గించవచ్చును, పెంచవచ్చును. త్వరత్వరగా శుక్రాశయమును నిండ జేయుట యనగా బహిఃస్రావము మాటిమాటికి కలుగునట్లు జేయుట. బహిఃస్రావము జరిగినప్పుడు అంతఃస్రావములో ఆటంకము కలిగించుటయే యగును. శారీరక పెంపుదలను ఆపుటయే అంతఃస్రావము ఆపుటయగును. దుశ్చేష్టలను, దురాలోచనలను రూపుమాపి బహిఃస్రావము గాకుండా అంతఃస్రావములో ఆపుదల రాకుండా జూచుటయే ధీరత్వము. ఇది నిస్సందేహముగా బ్రహ్మచారి యొక్క బ్రహ్మచర్యము కంటె కఠినమైనది. గృహస్థులకు యిదియే యోగము. యోగము నిరోధమునకు మారుపేరు మనము యే ఆదర్శ వ్యక్తి యొక్క చిత్రము గీసితిమో అతనితో సమానుడైన వారన్యులెవరుందురు ?

ఈ చిత్ర మొక ఆదర్శ కాల్పనిక వ్యక్తిదని అంగీకరించుచున్నను కాల్పనిక చిత్రము గీయుట యొక్క ఉద్దేశ్యము యథార్థమును మరియు వాస్తవమును సరిగా అర్థము జేసుకొనుట యగును. క్రియాత్మక జగత్తులో అంతరంగ వికాసము పైన జెప్పబడినట్లగు వ్యక్తి దొరకుట అసంభవమగును. ఈ చిత్రము తెలిసి తెలిసి

గీయబడెను. మనుష్యుని స్వాభావిక వికాసములో స్వప్న దోషమునకు స్థానము లేదనుటయే దీని భావము. ఆరోగ్యవంతుని జీవితములో వీర్య స్ఖలనము జాగ్రదావస్థలో యిచ్ఛాపూర్వకముగా జరుపుటయే యగును. తెలియకుండా వీర్య స్ఖలనమగుట అస్వాభావికము మరియు రోగ చిహ్నము. పురుషుడు ఆరోగ్యముగా నుండగోరిన యెడల గృహస్థ ధర్మములో ప్రకృతి సహజమైన వాంఛ కలిగినప్పుడు మాత్రమే వీర్యపాత మొనరించవలెను. అస్వాభావికముగా కృత్రిమ ఉపాయముల చేత భావావేశములో యిట్టి చర్యకు పూనుకొనుట అనుచితము.

మన కాదర్శ వ్యక్తులతో పనిబడదు. మన కెదురగు యువకుల జీవిత సమస్యల పరిష్కారమును గురించి ఆలోచించునట్టి వారు వంశానుగతికముగా రోగములతో ముక్తులు కాని వారిని గురించి యోచించవలెను. వారి తాత ముత్తాతలు, తల్లిదండ్రులు వివిధ రోగములను సంక్రమింప జేసుకొనిరి. నేటి బాలకుడు పూర్వీకులు గ్రహించుకొనిన రోగముల మూటను నెత్తిన వేసుకొని జన్మించును. పాలన, పోషణ కూడా నియమముల ననుసరించి జరుగుట లేదు. బాలకుని కడుపును ఉత్తేజకరమైన పదార్థములతో నింపుటలో యే లోపము జేయరు. అతనిని మురికికూపములో వదిలివేయుదురు. భ్రష్టాచారులతో, పతితులతో నిరాటంకముగా ఆడుకొన నిచ్చెదరు. బ్రహ్మచర్య నియమములను ఒక్కొక్క దానినే కావలసి భంగపరచును. ఇట్టి కుళ్ళిన పరిస్థితులలో పెరిగిన బాలకుడు 14, 15 సంవత్సరముల ప్రాయములో స్వప్న దోషమునకు గురియగుటలో ఆశ్చర్యమేమి గలదు. అతడు పెరిగిన అస్వాభావిక పరిస్థితులు అతనిని కామోద్రేకుని శీఘ్రముగా జేయును. పూర్ణ ఆరోగ్యవంతుని వీర్యకోశము 20 సంవత్సరముల ప్రాయమున కూడా నిండదు. కాని యిక్కడ చిన్న పిల్లల వీర్యకోశము 13, 14 సంవత్సరముల ప్రాయముననే నిండును.

చిన్నవయస్సులోనే అండకోశములు పనిజేయుచుండుట గమనార్హము. బహిఃస్రావము కూడా తొందరగానే ప్రారంభమగును. కోర్కెలు పెరిగిన కొలది స్రావము అధికమగును. వారాని కొకసారి, రెండు రోజుల కొకసారి, ప్రతి నిత్యము, ఒకేరాత్రి అనేకసార్లు కోరిక కలుగుట, అది నెరవేర్చుటయను చక్రభ్రమణము భయంకర వేగముతో విజృంభించును. బాలకులలో అంతఃస్రావమే బహిఃస్రావముగా పని చేయును. ఎదిగిన వయసులో అంతఃస్రావము మరియు శుక్రకణముల కూటమినే బహిఃస్రావమందురు. అంతఃస్రావములను ఆధునిక భాషలో హార్మోను లందురు. హార్మోనుల లోపము వలన కలుగు వ్యాధులు వీర్యనాశము వలన కలుగును. వీర్యనాశము అంతఃస్రావము అనగా హార్మోనుల నాశము వలన కలుగును.

వర్తమాన సభ్యత యొక్క సంతానము అనారోగ్యముతో నున్నారనుట అందరెరిగిన సత్యమే. సంపూర్ణ ఆరోగ్య వ్యక్తిత్వమునకు మనము కోసుల దూరములో నున్నాము. లక్ష్యము నుండి అత్యంత విచలితులమై యున్నాము. ఇట్టి పరిస్థితులలో సాధారణ రూపములో ఆరోగ్యముగా నున్నవారికి యిచ్చు సలహా లిట్లు గలవు. తెలియకుండ రాత్రిపూట అనేకసార్లు స్వప్నదోషమైనచో దానివలన అధికముగా నష్టము చేకూరును. రెండు, మూడు వారాల కొకమారు స్వప్నదోషము జరిగి దానివలన బలహీనత కలుగకుండా నున్నచో అంతగా విచారించ వలసిన పనిలేదు. స్వప్నదోషము అధికముగా జరిగినచో దాని నాపుటకు ప్రయత్నించవలెను లేనిచో స్నాయుశక్తికి ప్రమాదము కలుగును. స్వప్నదోషము అస్వాభావికమైనదిగా గుర్తించవలెను.

ఉత్తేజన కలిగిన స్థితిలో కాముకతతో కూడిన స్వప్నము వలన స్వప్నదోషము కలుగును. వెంటనే మెలకువ కలుగును. ఆత్మగ్లాని,

అసమర్థత, లజ్జ మరియు నిస్సారత భావములు నలువైపుల నుండి క్రమ్ముకొనును. స్వప్నము వలన ఉత్తేజన కలుగవచ్చును లేక ఉత్తేజన వలన దుస్వప్నములు కలుగవచ్చును. ఇవి వీర్యస్రావమునకు పూర్వమే కలుగును. వీర్యస్రావము కాకుండినచో భయము లేదు కాని దుస్వప్న పరంపర వీర్యస్రావమునకు దారితీయును. పరిస్థితులు విషమించి దురాలోచన కలుగుటతోనే వీర్యస్రావ మగును. చీటికి మాటికి కలుగు ఉత్తేజన నపుంసకత్వమునకు దారితీయును. స్వప్న దోషము రాత్రిపూటనే గాక ఆలోచన కలిగినంత మాత్రమున పగటి పూట కూడా వీర్యస్రావము కలుగును. ఆతడు నిరాశజెంది మరణానికి ఉపాయము వెతుకుచు దుఃఖించును.

బాలకుడు వీర్యస్రావము నాపుటకు యెట్లెట్లు ప్రయత్నించునో అట్టి విధముగనే పెరుగుచునే యుండును. స్వప్నదోషము వలన బలహీనత కలిగిన యెడల ఆతని దుఃఖము చరమస్థాయికి చేరును. బాలకుడు ధర్మచింతన కలవాడై తానెట్టి దుష్కృత్యమునకు తలపెట్ట లేదని ఆలోచించినపు డాతనికి కలుగు దుఃఖము హద్దులను దాటును. ఆతడప్పుడు నిస్సహాయుడై తన ఉపవాసము వలన తన సాధన వలన యేమి ప్రయోజనమని మొత్తుకొనును. చిన్న చిన్న ఉల్లంఘనలు అనేక విషమ సమస్యల నుత్పన్నము జేయునని తెలుసుకొని నిరాశ జెందక చక్కదిద్దుకొనుటకు ప్రయత్నించవలెను. స్వప్న దోషములకు కారణములు మరియు దాని చికిత్సను గురించి చర్చించుట అవసరము.

స్వప్నదోష కారణములు : తెలియకుండా జరుగు వీర్యనాశము రోగ చిహ్నమని యింతకు పూర్వము అనేకసార్లు చెప్పబడినది. సంపూర్ణ ఆరోగ్యవంతుడైన బాలకుని కుమారావస్థలో కూడా వీర్య కోశము ఖాళీగానే యుండును. అతని మానసిక, శారీరక వికాసము

కొరకై అంతఃస్రావము అవసరమగును. నేటి అస్వాభావిక పరిస్థితులలో బాలకులకు చిన్న వయసులోనే కామోద్రేకము కలుగుచుండుట వలన వీర్యకోశములో వీర్యము కూడుచుండును. చిన్న వయసులోనే వీర్య నష్టము కూడా జరుగుచుండును. వీర్య నాశనమునకు గల భౌతిక, మానసిక కారణములను వేర్వేరుగా ఆలోచించుట అసంభవమైనప్పటికి విషయ సౌలభ్యము కొరకు వేర్వేరుగా ఆలోచించెదము. దానితోపాటు చికిత్సను గురించి కూడా చర్చించెదము గాక !

## భౌతిక కారణములు మరియు చికిత్స

1. <u>భోజనము</u> : అనేకులు తిండి కొరకే జీవించెదరు. ఆకలిని మించి తినెదరు. తిన్న వస్తువు జీర్ణమైనచో యెట్టి బాధ లేదు. కాని అట్లు జరుగదు. జీర్ణము కాని పదార్థము కడుపులో కుళ్ళును. జీర్ణ క్రియకు జననక్రియకు దగ్గరి సంబంధము కలదు. జీర్ణకోశములో పదార్థము కుళ్ళి మంట కలిగినచో దాని ప్రభావము నుండి జననకోశము తప్పించుకొనజాలదు. జనన ప్రణాళికలో యిట్టి మంట కలిగినపుడు ఉత్తేజము కలుగును. మనుష్యుని మానసికస్థితి కూడా చెడిపోవును. ఈ మంట వలననే నిదురలో స్వప్నదోషము కలుగును. అజీర్ణ ప్రక్రియలో దీర్ఘ కాలమునకు పరోక్షముగా హాని కలుగును. మసాలాలు కారము, పచ్చళ్ళు, మిఠాయి, టీ, కాఫీల వలన ప్రత్యక్షముగా హాని కలుగును. దాని ప్రభావము సూటిగ ఉత్పాదక అంగములపై పడును. అవి తినుట వలన యెట్టి ప్రయోజనము చేకూరదు. కేవలము జిహ్వా చాపల్యము మాత్రమే దీనికి కారణము. సాయంకాలపు విద్యుచ్ఛక్తి కాంతి పుంజములో వెలుగొందు మిఠాయి రాశిని జూచియే సరసుని హృదయము ఆకర్షించబడదు? వేల యీగలు పోగుజేసిన మలినముతో చక్కెర మిఠాయి తిని సోడాసీసాయో కప్పు టీయో ఖాళీ చేయుదురు.

విశృంఖలముగా తిరుగు యువకుని ప్రకృతి యెప్పుడు క్షమించజాలదు. అతనిని ముంచివేయును.

అందుచేత స్వప్నదోషమునుండి కాపాడుకొనుటకు ఆహారము విషయములో శ్రద్ధవహించవలెను. రోజుకు రెండుసార్లు నియమిత సమయములలో పరిమిత సాత్విక భోజనము తీసుకొనుట అభ్యసించవలెను. "తినుటకు జీవించుట"కు బదులు "జీవించుటకు తినుట"ను నేర్చుకొనవలెను జిహ్వా సలహాకు బదులు కడుపు సలహా తీసుకొనుట ఉచితము. ఇందు మద్య మాంసములు పేర్కొనబడలేదు. బ్రహ్మచర్యమువంటి పవిత్ర ఆశయము గురించి ఆలోచించువారు వీటి విషయమై ప్రస్తావించుటకు కూడా సిగ్గు పడుదురనుట యథార్థము.

## మూత్రాశయము మఱియు మలాశయము నిండుట

అస్వాభావిక వాతావరణములో మన జీవితములు నడుచుటవలన చిన్న వయసులోనే శుక్ర కోశములో వీర్య సంచిత మారంభమగును. శుక్ర కోశమునకు యెదురుయెదురుగా మూత్రాశయము, మలాశయములు గలవు. అవి రెండు నిండుటవలన శుక్రకోశము పై వత్తిడిపడును. పడుకునేముందు యెక్కువగా తిన్నచో మలాశయ, మూత్రాశయములు నిండి వీర్య కోశముపై వత్తిడిపడి స్రావముకలుగు అవకాశముగలదు. కాని యిది వీర్యము కాకుండా రసమగును. అప్పుడప్పుడు శౌచమువలన వత్తిడి కలుగుటచే వీర్య స్రావమగును. మలబద్ధకమువలనకూడా అప్పుడప్పుడీ పరిస్థితి యేర్పడును.

స్వప్నదోష రోగి సాయంకాలము అల్పాహారము మాత్రమే గైకొనవలెను. అనేక బాలకులు పడుకునేముందు నీళ్లలేక పాలు త్రాగెదరు. ఈ చిన్న పొరపాటు అనేక సమయములలో స్వప్న

దోషమునకు దారి తీయును. ఈ అలవాటును మానుకొనవలెను. పడుకునేముందు మూత్ర విసర్జన చేయవలెను. వ్యాధి ముదిరినచో పొట్టను కూడా శుభ్ర పరచుకొనుట ఉత్తమము. రాత్రిపూట ఒకసారిలేచి మూత్ర విసర్జన చేయవలెను. బోర్ల పడుకొనుటవలన లేక యెదుపు రొమ్ముపై చేతులు పెట్టుకొని బడుకొనుట అనేకసార్లు ఉపద్రవమునకు దారితీయును. వెన్నుకు వెనుక బట్టముడి వేసికొనినచో బోర్లపడు కొనుట తప్పును.

మలినము గోకుడు మఱియు మంట : అప్పుడప్పుడు మూత్రాశయములో మలిన పదార్థములుకూడి దానిలో మంట కలిగించును. ఈ మంట మూత్ర ప్రణాళినుండి శుక్ర కోశమువరకు జేరును. అందుచేత స్వప్నదోషమగును. సాత్త్వికాహారము మఱియు రక్త శోధక ఔషధముల వలన మూత్రములో మంట కలిగించు పదార్థము దూరమగును. అప్పుడప్పుడు ఉత్పాదక అంగములలో జేరునట్టి మైల దురద మఱియు మంటను ఉత్పన్నముజేయును. దీనివలన స్వప్న దోషము మఱియు హస్త మైథునమునకు దారి తీయును. ఈ అంగములను యెల్లప్పుడు శుభ్రముగా నుంచవలెను. మూత్ర వ్యాధులవలన మఱియు జననేంద్రియ వ్యాధులవలన స్వప్న దోషము కలుగును.

హస్త మైథునములేక అతి మైథునము : ఒక పనిని మాటిమాటికి జేసినచో అది మనుష్యుని అంతరాత్మలో భాగముగా మారును. క్రమక్రమముగా ఆ పని జేయుటలో మనసు పెట్టనవసరములేదు. అందువలన తెలియకుండా స్వప్న దోషము కలుగును. తెలియకుండా జరుగు యీ స్వప్న దోషము హస్త మైథునపు అలవాటువలనగాని లేక అతిమైథునమువలనగాని కలుగును. మైక్ ఫేడ్ మహోదయుడు తన గ్రంథము "Encyclopedia of Physical Culture" నందు హస్త

మైథునమున కలవాటుపడిన వ్యక్తి దానిని మానివేసినచో కొంతకాలము వరకు ఆతనికి స్వప్న దోషమగును. అటులే అతిమైథునమునకలవాటు పడిన వ్యక్తి ఒంటరిగా నున్నప్పుడు స్వప్న దోషమునకు గురియగును. శరీరమును కొత్త పరిస్థితులకు మలచుటకు కొంతకాలము పట్టును. స్వప్న దోషమునుండి కాపాడుకొనుటకు రోగియైన వ్యక్తి హస్త మైథునము, అతి మైథునమును విసర్జించవలెను.

అప్పుడప్పుడు జాగ్రదావస్థలో తృప్తిరహితమైన లేక అణచివేయ బడిన కామేచ్ఛపడుకొని యున్నప్పుడు తన మార్గము చూచుకొనును. యువకులకు తృప్తిరహితమైన కామేచ్ఛ లేక అణచివేయబడిన కామేచ్ఛ వలన కలుగు నష్టము స్నాయు తంతువుల కపకారముజేయును అట్టి నష్టము హస్త మైథునము, అతి మైథునమువలన కలుగు నష్టముకంటె మించినదిగానగును. తృప్తి రహితమైన కామేచ్ఛ మస్తిష్కములో ఒకసారి ప్రవేశించి స్నాయు తంతువులతో ఘోర సంగ్రామ మొనరించును. ఇట్టి అసంతృప్తికర యిచ్ఛను కలుగనీయకుండా యుండుటే ఉత్తమము.

మెలకువతోనున్నప్పుడుచేసిన హస్తమైథునము నిదురలోకూడా ఎదలదు. డా॥ ఎల్బర్ట్‌మాల్ "Sexual Life of a Child" గ్రంథమునందు యీ విధముగా వ్రాయుచున్నారు. నిద్రావస్థలో తెలియకుండా పిల్లవాని చెయ్యి జననేంద్రియముపై సంచాలనము గావించును. ఇట్టి అనేక ఉదాహరణలు మనకు గన్పించుచున్నవి. నిదురలోనే హస్తమైథునము గావించును. దీనినుండి కాపాడుకొనుటకు జాగ్రదావస్థలో హస్తమైథునము చేయరాదు. రాత్రి పడుకొనునప్పుడు చేతులు జన నేంద్రియముపైకి పోకుండునట్లు బంధించవలెను. ఇది కేవలము అట్టి అలవాటు ఉన్న వ్యక్తులకొఱకు మాత్రమే వర్తించును. అందరికిగాదు.

బలహీనత : స్థంభన శక్తి లేకపోవుటచే కూడా అప్పుడప్పుడు స్వప్నదోషమగును. తగిన వ్యాయామమువలన బలహీనత తొలగిపోగలదు. ప్రపంచములోగల ఔషధములన్నియు బ్రహ్మ చర్యముతో సామాన్య జీవితము గడుపుటవలన కలిగిన సుగుణములలో సగము గుణముకూడా కలిగించవు. భిన్నభిన్నవ్యక్తుల విషయములో వారి వ్యక్తిగత కష్ట సుఖములననుసరించియే యేమైన చెప్పవచ్చును. అయినను ప్రజలకు ఔషధములపై విశ్వాసముగలదు. అందుచేత బ్రహ్మ చర్యమును కాపాడుకొనుటకు కొన్ని ఔషధములను పేర్కొనుచున్నాము.

1) మఱ్ఱిపాలు బత్తీసాలతో ఒక నెలవరకు ఉదయమే యేమి తినక ముందే తినవలెను.

2) డిజిటాలిస్ 3 × హోమియో మందు ప్రాతః కాలమున సేవించిన సముచిత లాభము కలుగును.

3) ఏసిడ్‌ఫాస్ 30 రోజుకు మూడుసార్లు చొప్పున రెండు రోజులు తీసుకొనవలెను.

మానసిక కారణములు మఱియు చికిత్స : భౌతిక కారణములను తెలిసికొనిన పిదప మానసిక కారణములు తెలిసికొనుట అవసరము. అలసిపోయిన మనిషిని స్వప్నములు బాధించవు. పగలంతా కష్టపడి పనిజేసి అలసిపోయిన మనిషిని స్వప్నములు బాధించవు. స్వప్న దోషములు కలుగవు. స్వప్నములు రానట్టి నిద్రను కలిగించుకొనుట స్వప్న దోషమునకు మొదటి వైద్యము. మధ్యరాత్రి ప్రగాఢ నిద్రవలన స్వప్నములురావు. గాఢనిద్ర కలుగు సమయములు చాలా తక్కువ.

గాఢ నిదుర వచ్చుటకు పూర్వము, తర్వాత రెండు సమయములలో యీ పిశాచి కనిపెట్టుకొని యుండును. అందుచేత గాఢ నిదుర వచ్చు నంతవరకే పడుకొని మెలకువ వచ్చినంతనే లేచి కూర్చొనినచో స్వప్న దోష భయముండదు. గాఢ నిద్రలేని సమయమున అతడు మేల్కొని యుండడు లేక నిదురలో యుండడు. అట్టి సమయమున దురాలోచనలు ప్రవేశించును. మనసు స్వాధీనమందుండదు. ఆ సమయములో భయంకరమైన కాముకతా స్వప్నములు, ఉత్తేజనా పూర్వకముగా నుండును. దానివెంట ఆత్మగ్లాని కలిగించు వికారము స్వప్నదోషము.

మనుష్యుని మనసు జాగ్రదావస్థలో ఖాళీగా యుండదు. ఏదో ఒకటి అవశ్యము చేయుచుండును. నిదుర లేకుండా పక్కపై పరుండుట వలన పరిణామ స్వరూపముగా మనసు స్వప్నములలో మునిగిపోవును. అన్ని స్వప్నములు చెరుపు కలిగించవు. కొన్ని భవిష్యత్తులో దాగియున్న విషయములు స్వప్నముగావచ్చును. అటు వంటి స్వప్నములతో మనకు సంబంధములేదు. మనకు స్వప్న దోషము కలిగించు స్వప్నములే హాని కలిగించును. అటువంటి స్వప్నములు రెండు రకములు. కాముకత కలిగించునవి, విచారము కలిగించునవి.

<u>కాముకతా స్వప్నములు</u> : ఇటువంటి స్వప్నములు జాగ్రదా వస్థగాని, నిద్రావస్థకాని కానటువంటి పరిస్థితులలో వచ్చును. ఇట్టి అవస్థ వగలైన కావచ్చును లేక రాత్రియైవను కావచ్చును. స్వప్నములు చూచువారి మనసులో యెవరో ప్రేమికులుందురు. స్వప్నములో వారికి సంబంధించిన దృశ్యములే కనుపించును. ప్రతి దినము వీర్య స్రావము వలననో లేక యితర ఘట్టములవలననో యీ క్రమము చెదిరిపోవును. పగలుకూడా యిట్టి స్వప్నములే ఆ తర్వాత రావచ్చును. ఇవి రాత్రి

పూట ఎక్కువగా వచ్చును. రాత్రి పండుకొనిన వెంటనే స్వప్నము వచ్చును. దానివెంట స్వప్న దోషమగును. స్వప్నములు చూచు దృశ్యములు పగలు జాగ్రదావస్థలో తయారగును. పగటిపూట అనుభవములు రాత్రిపూట క్రొత్త రూపము ధారణ జేయును. ఈ స్వప్నములయొక్క ఆధారము జాగ్రదావస్థలో లభించును.

విచారముత్పన్నముజేయు స్వప్నములు : విచారము యొక్క అభిప్రాయము అశాంతి. అశాంతివలన మొత్తము స్నాయు సముదాయము బిగిసికొని యుండును. కాముకతయొక్క దుష్ట స్వప్నములవలన స్వప్న దోషమగుననుట భ్రమ మాత్రమే. విచారములో మునిగి యుండుటవలన కూడా స్వప్నదోషము కావచ్చును. దీని దుష్ప్రభావము ఆరోగ్యముపై నెక్కువగా నుండును. విచారమువలన ఒకవైపు స్నాయు మండలమునకు నష్టము కలుగును. మరొకవైపు వీర్యనాశమువలన ప్రాణశక్తి క్షీణించును. డా॥ మౌల్ తన అభిప్రాయమునిట్లు వెల్లడించెను. "విచారమువలన స్వప్నదోషమగును. కాని స్వప్నములోకూడా అనేక విచారములతోగూడిన స్వప్నములవలన కూడా స్వప్నదోషమగును, ఒక్కొక్కసారి స్వప్నములో దొంగలు దోచుకొన్నట్లు లేక క్రూర మృగము వెంటాడుచున్నట్లు భయంకరమైన స్వప్నములు వచ్చును. నలువైపుల భయముతోకూడిన స్వప్నములవలన స్వప్నదోషము కలుగును. స్వప్నములో అనేకసార్లు రైలు పట్టుకొనుటకు పోవుట, స్టేషనుకు పోగానే రైలు దాటి పోవుట జరుగును. దానివలనకూడా స్వప్నదోషమగును. ఏ విధముగానైన స్నాయుమండలము బిగుసుకొని పోవుటవలన స్వప్నదోషము జరుగును. ఎక్కువగా తినుటవలన, తినక పోవుటవలన, చాలా అలసిపోవుటవలన, యే మాత్రము కాళ్లు చేతులు కదిలించకపోవుటవలన కామ, క్రోధ, లోభ, మోహ, భయ విచారము

మొదలగువాటి అధిక్యతవలన స్నాయు సముదాయము బిగుసుకొని పోవుటవలన స్వప్నదోషమగును.

ఈ విధమైన మానసిక కారణముచేత స్వప్నదోషము యొక్క దుష్ప్రభావము శరీరముపైబడును. డా॥ ఫూట్ యిట్లు వ్రాయుచున్నాడు. పురుషులకు మఱియు స్త్రీలకు యిద్దరికి స్వప్నదోషమగును. మఱియు యిరువురికి శారీరకముగా నష్టము కలుగును. స్త్రీ స్వప్నదోషమువలన వీర్యమువంటి యే తత్త్వము స్రావము కానప్పటికి వారి స్నాయుశక్తికి గొప్ప నష్టము చేకూరును. కాముకతయొక్క స్వప్నము ఒక విధముగా తెలియని హస్తమైథునము అని చెప్పవచ్చును. ఏ వ్యాయామమైనను శూన్యములో కాళ్లు చేతులు కదిలించినంతగా అలసట కలుగజేయదు. మెట్లు దిగుచున్నప్పుడు యితను ఒక మెట్టు దిగవలెనని తెలియక కాలు క్రిందికి పోనిచ్చిన యెడల శరీరమున కొక దెబ్బవంటిది తగులును. మొదలే యీ విషయము తెలిసియున్నచో కాలు అందుకు సిద్ధపడును మఱియు శరీరమునకెట్టి బాధయు కలుగదు. శరీరమునకు కలిగిన యీ జలదరమువంటిదే స్నాయు మండలమునకు కామవాంఛా పూరితమైన యీ స్వప్నము. శరీరముయొక్క ప్రతి అంగమునుండి స్నాయుశక్తి సంఘటితమై శక్తిలేని ఒక వ్యక్తి కౌగిలిలో చేరును. ఆ శక్తి స్వప్న దోష రూపములో వెడలును కాని దానికి ప్రతీకార శక్తి అవతలివ్యక్తి నుండి లభించదు. అవతలి శక్తి కల్పితము, ఊహా జనితమైనది. స్నాయు శక్తికి కలిగిన యీ జలదరింపు మఱియు నష్టము పునరావృత్తమైనచో మనుష్యుని యెల్లప్పటికి శక్తిహీనుని జేయునంతటి భయంకరమైనదిగానుండును. ఇది కేవలము శరీరమును శక్తిహీనము జేయుటయేగాక మానసిక శక్తిని, జ్ఞాపక శక్తిని బలహీనపరచును.

జాగ్రదావస్థలో కామవాసనతో కూడిన ఆలోచనలు మనసులో

చోటు చేసుకొనినచో స్వప్నావస్థలో కూడా యివి మనసును ఆక్రమించు కొనియే యుండును ఊహించుటలేక కల్పనవలన దీని ఘాతుక శక్తి పెరిగిపోవును. జాగ్రదావస్థలో నోటినుండి వెడలిన ఒకే ఒక అశ్లీల శబ్దమైనను స్వప్నావస్థలో అనేక అపవిత్ర స్మృతులకు స్థానము కలిగించును. అందుచేత జాగ్రదావస్థలోనే కడు జాగరూకులై యుండుట వసరము. నికృష్ట సాహిత్యపఠనము, సినిమాలు చూచుటవలన, స్త్రీల సహవాసమువలన, ఒంటరిగా పనిలేకుండుటవలన మనసునకు నిద్రా వస్థలో నికృష్టమైన మసాలా తయారుజేసి యిచ్చిన వారము కాగలము. అటువంటి పదార్థమును మనసు విడిచి పెట్టుటకు సిద్ధముగా నుండదు. కామవాంఛా స్వప్నమునుండి తనను తాను కాపాడు దలచుకొనినవారు జాగ్రదావస్థలో యిటువంటి దుష్ట ఆలోచనలను దరికి రానీయకుండా తన మానసిక స్థితిని కుదుట పరచుకొనుటత్యంతావశ్యకము. తమ ఆలోచనలను పటిష్టము గావించుకొనవలెను. కామ పూరిత స్వప్నముల వలన భయభ్రాంతులగుదురు. భయమువలన యెంత తప్పించుకొనజూతె దరో కామమునకంత గురియయ్యెదరు. భయమువలన ఆలోచనా శక్తిని బలహీనము కానీయరాదు. స్వప్నదోషము చెడ్డదైనప్పటికి దానిని చూచి భయపడుట మరింత చెరుపుచేయును. భయమువలన స్వప్నదోష సంఖ్య అధికమగును. అట్టి వ్యక్తులను గురించి మోలినోస్‌యొక్క అభిప్రాయములను విలియమ్స్‌జేమ్స్ మహోదయుడు "Varieties of Religious Experience" లో పేర్కొనిన విషయములు సదా స్మరించదగినవి.

ఒకవేళ నీతో యేదైన అపరాధము జరిగినచో అదెట్టిదైనను దానిని మాటిమాటికి తలచుకొని దుఃఖించవలదు. అపరాధము మనుష్యునితో మాత్రమే జరుగును. ఒకటి రెండుసార్లు పతనము జెందినప్పటికి యెల్లప్పుడు అట్లే జరుగునని భావించరాదు. పరమేశ్వరుని

వైపునుండి హెచ్చరిక చేయబడును. ఓ అమృతపుత్రా! కండ్లు తెరచి నీ పతనమునకు కారణమైన ఆలోచనలపై తెరవేయుము. పరమేశ్వరుని దయపై విశ్వాసముంచుము. పరుగు పందెములో క్రిందపడిపోయినప్పుడు యేడ్చుచు కూర్చుండుటవలన ప్రయోజనము శూన్యము. బుద్ధిమంతులు ఆతనినిలేచి తిరిగి పరుగెత్తమని హెచ్చరించెదరు. అటువంటివారు పడిపోలేదనియే చెప్పవచ్చును ఒకసారిగాక అనేకసార్లు పతనము జెందినప్పటికిని నిరాశజెందక ఈశ్వరునిపై విశ్వాసముంచి నీకిచ్చిన ఔషధము కొంగున ముడివేసుకొనుము. ఈ అస్త్రముతో నీవనేక రంగములలో గెలుపొందెదవు నీ హృదయ బలహీనతపై విజయము సాధించెదవు.

నీ బలహీనతల గురించియే నీవు యెల్లప్పుడు ఆలోచించవద్దు. నీ సంకల్పమును దృఢముగా శక్తివంతముగా జేసికొనుము. చెడు పరిస్థితులనుండి కాపాడుకొనుము. పడుకొనుటకు పూర్వము మంచి భజనలు పాడుకొనుము. వేదమన్త్రములను పఠించుము. ఉత్తమ పుస్తకములను చదువుము, దుస్వప్నములకు బదులు మంచి స్వప్నములు రాదొడంగును. స్వప్నములనుండి కాపాడుకొనుటకు యింతకంటె మంచి ఉపాయము వేరొకటిలేదు. ఈ అధ్యాయము ముగించుటకు పూర్వము డా॥ కోవెడ్‌యొక్క సలహాను యిచట పొందు పరచుటకు వివశుడనగుచున్నాను.

తన యిచ్ఛాశక్తిని యెల్లప్పుడు పతనావస్థకు పోనీయకుండెడి వాడు తన ఆలోచనలను కనీసము జాగ్రదావస్థలోనైన తన వశము ందుంచుకొనవలెను. వాటిని పవిత్రముగా నుంచుకొనును. ఒకవేళ తనమైనచో అది కావలసి మాత్రమేయని తలంచవలెను. మెలకువతో న్నప్పుడు తన ఆలోచనలను పవిత్రముగా నుంచుకొనునట్లే నిద్రా

వస్థలో కూడా సుంచుకొనుట కఠినముగాదు. తమ స్వప్నములను తమ వశమందుంచుకోలేమనుట వట్టి భ్రమ మాత్రమే. మెలకువతోనున్నప్పుడు యేర్పడిన ఆలోచనలకు స్వప్నములతో గాఢమైన సంబంధము గలదు. మెలకువతో నున్నప్పుడు చెప్పబడు ఆలోచననే నిదురలో స్వప్నములుగా పేర్కొనబడును. మెలకువతో నున్నప్పుడు కలిగిన అశ్లీల, అపవిత్ర ఆలోచనలే నిదురలో కూడా కలుగును. ఒక ఉన్నత స్థితిలోనున్న ఇటలీ దేశస్తుడు స్వప్నదోషమువలన వివశుడై నిదురలో అపవిత్ర భావమేర్పడినప్పుడు లేచి కూర్చొనుటకు దృఢ సంకల్పము గావించెను. ఈ అలవాటును పగటిపూట బాగా అభ్యాసము గావించెను. అశ్లీల ఆలోచనలు రాత్రి నిదురలో వచ్చినప్పుడు లేచి కూర్చొనెడివాడు. పడుకొనుటకు ముందు యిట్టి ఆలోచనలనే అనేక పర్యాయములు పునశ్చరణ జేయుచుండెడివాడు. తన సంకల్ప శక్తినంతయు యీ ఆలోచనలలోనే పెట్టుచుండెడివాడు. దీనివలన స్వప్నదోషమునుండి విముక్తుడగు మంచి పరిణామము కలిగెను.

## వీర్యమనగానేమి దాని మహత్వము

ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే గర్భమన్తః
తంరాత్రీస్తిస్ర ఉదరే బిభర్తితం జాతుం ద్రష్టుమభి సంయన్తి దేవా॥
అధర్వవేదము.

మనుష్య శరీర తత్త్వ భాగమే వీర్యము. వీర్యమును శరీరములో యిముడజేయుట కష్ట సాధ్యము. దీనిని రక్షించుకొను మనో సంకల్పము యోగుల యోగనిద్ర కన్నులలో, ఋషుల ముఖము యొక్క ముదుతలలో, బ్రహ్మచారుల నియన్త్రిత దిన చర్యలో యెవ్వరికి గన్పించదు? మూర్ఖులు ప్రాణశక్తి రహస్యమును గ్రహించక పోవచ్చును కాని

జ్ఞానులు లేక తెలివిగలవారు వీర్య రక్షణ జీవితముయొక్క లక్ష్య బిందువని గ్రహించెదరు. హిమాలయమువంటి కఠినమైన దురూహ్య కార్యమునందు తత్త్వజ్ఞానులు శరీరములోని అన్ని అంశములను శరీరమునందే యిముడజేసినచో విద్య మరియు బలము వృద్ధి జెందుననెడు ఆలోచనలో నుందురు. వీర్య నాశమువలన నలువైపుల నుండి నష్టమే జరుగును. వీర్య రక్షణ మహత్వ పూర్ణ కార్యము.

వీర్య రక్షణ మహత్వము తెలిసికొనుటకు వీర్యమును గుర్తించ వలెను. ఇచట భారతీయ ఆర్య విద్వాంసులు మరియు పాశ్చాత్య ఆయుర్విజ్ఞానుల వీర్య సంబంధ అభిప్రాయముల నిచట పొందుపర చెదము. మా పాఠకులు శ్రద్ధ వహించెదరు గాక!

భారతీయ ఆయుర్వేదము: "అష్టాంగహృదయ" శరీర స్థానము అధ్యాయము 3 శ్లోకము 6 లో యిట్లు వ్రాయబడినది.

"రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదస్తతో స్థిచ అస్థనో మజ్జాతతః శుక్రం............"

భోజన పదార్థమువలన రసమేర్పడును. రసమునుండి రక్తము రక్తముతో మాంసము, మాంసమునుండి మేధ, మేధనుండి యెముకలు, యెముకలనుండి మజ్జా, మజ్జానుండి వీర్యమేర్పడును. వీర్యము అంతిమ ధాతువు, శరీర రూప యంత్రములో యిది యేర్పడు స్థానము యేదవది. దీనిని యేర్పరచుటకు శరీరము యెక్కువగా పరిశ్రమ జేయవలసి యుండును. రసముకంటె రక్తమునందు తత్త్వ భాగము అధికముగా నుండును. అటులే సార భాగము పెరుగుచునే పోవును. శారీరక, భౌతిక శక్తుల అంతిమసారము వీర్యము. కొద్దిగా వీర్య మేర్పడుటకు చాలా రక్తము అవసరమగును. కొంచెము వీర్య నష్టము యెక్కువ

రక్త నష్టమునకు దారి తీయును. భారతీయ ఆయుర్వేద యీ సిద్ధాంతముతో పాశ్చాత్య విద్వాంసులనేకులు యేకీభవించుచున్నారు. డా॥ కోవెన్ తన ప్రసిద్ధ పుస్తకము "The Science of New Life" యొక్క 106వ పుటలో యిట్లు వ్రాసిరి.

శరీరముయొక్క యే భాగమునుండియైనను 40 ఔన్సుల రక్తము తీసినచో అది యొక ఔన్సు వీర్యముతో సమానమగును. ఒక ఔన్సు వీర్య మేర్పడుటకు 40 ఔన్సుల రక్తము అవసరమగును. అమెరికాకు జెందిన ప్రసిద్ధ శరీర వృద్ధి శాస్త్రజ్ఞుడు మెక్ ఫేడన్ మహాదయుడు తన "Manhood and Marriage" పుస్తకములో యిదే అభిప్రాయమును వెల్లడించెను. "Encyclopedia of Physical Culture" యొక్క 2772 పుటయందిట్లు రచియింపబడినది

"అనేక విద్వాంసుల అభిప్రాయము ననుసరించి 40 ఔన్సుల రక్తముతో ఒక ఔన్సు వీర్యము యేర్పడును. కాని కొంతమంది విద్వాంసుల అభిప్రాయములో ఒక ఔన్సు వీర్యమేర్పడుటకు 60 ఔన్సుల రక్తమవసరమగును."

పాశ్చాత్యులలో యీ భావము యిటీవలెనే యేర్పడినది. రక్తములో మనుష్యుని జీవింపజేయులేక మరణింపజేయుశక్తి యున్నప్పుడు రక్త సారమైన వీర్యములోకూడా యిట్టి శక్తి యింక యెక్కువగా నుండును. ఆయుర్వేదమునను సరించి రక్తమునుండి వీర్య మేర్పడుటకు యేడు స్థానములు నధిగమించవలెను. "వీటి పరస్పర సంబంధమును గురించి వీర్య మేర్పడునంతవరకుగల పరివర్తనలు స్పష్టముగా ఆయుర్వేదము అను సంధానము జేయనప్పటికి రక్తమునుండి వీర్యమేర్పడుటకు నిడువైన యేడు బాటలనుండి గడువ వలసివచ్చును.

ఆయుర్వేదము ననుసరించి వీర్యము యొక్క స్థానము సంపూర్ణ శరీరము. హృదయములో కామ సంబంధిత కోరిక కలిగినప్పుడు వీర్యము శరీరములో మథనము జేయబడి అండ కోశముల ద్వారా ప్రకటిత రూపములో ఉత్పన్నమగును. ఈ విషయమునే స్పష్టపరచుచు భావ ప్రకాశకారుడు ఇట్లు వ్రాయుచున్నాడు.

యథా పయసి సర్పిస్తు గూఢశ్చేక్షౌ యథా రసః।
ఏవం హి సకలే కాయే శుక్రం తిష్ఠతి దేహినామ్ ॥240॥

కృత్స్న దేహస్థితం శుక్రం ప్రసన్నమనసస్తథా।
స్త్రీషు వ్యాయచ్ఛతశ్చాపి హర్షాత్త త్సంప్రవర్తతే ॥242॥

పాలను చిలుకుటవలన నెయ్యి వెళ్లినట్లు చెఱకునుండి రసము వెళ్లునట్లు వీర్యవంతుని దేహ మథనమువలన వీర్యము వెడలును. పూర్తి శరీరములోనుండు వీర్యము మానసిక ప్రసన్నతవలన మరియు సంభోగమువలన వెడలును. ఈ విధముగా భారతీయ ఆయుర్వేదము ననుసరించి వీర్యము యొక్క స్థానము సంపూర్ణ శరీరము. కేవలము అండకోశము కాదు.

<u>పాశ్చాత్య ఆయుర్విజ్ఞానము</u> : పాశ్చాత్య ఆయుర్విజ్ఞాన పండితులు వీర్యమును ఏడు ధాతువుల సారముగా గుర్తించరు. అది యేడు స్థావరములనుండి పయనించవలసిన పనిలేదు. వారి అభిప్రాయాను సారము వీర్యము రక్తమువలననే యేర్పడును. దానికి ఏడు గమ్యముల నుండి పయనించవలసిన అవసరములేదు. వారు వీర్యమును సంపూర్ణ శరీరస్థముగా గుర్తించరు. మనో వికారమువలన అండకోశములు పనిజేసి యీ ద్రవమును ఉత్పన్నము జేయు నని వారి అభిప్రాయము. ఈ ద్రవమునే ఉత్పన్న వీర్యమందురు. ఉత్తేజక పదార్థ సంపర్కము

వలన కన్నులనుండి నీరు, నోటిలో లాలా జలము యేర్పడునట్లు కామోత్తేజమున అండకోశముల గ్రంధులనుండి వీర్యము వెడలును.

అండకోశములనుండి రెండు విధములైన రసము లుత్పన్న మగును. అంతఃస్రావము, బహిఃస్రావము. అంతఃస్రావమును ఇంటర్నల్ స్క్రేషన్। బహిఃస్రావమును " External Secretion " అందురు. అంతః స్రావము యెప్పుడైనను అండకోశములనుండి ఉత్పన్న మగును. శరీరము లోపలనే యిమిడిపోవును. ఈ రసము మొత్తము శరీరములో వ్యాపించి కన్నులకు తేజస్సు, ముఖమునకు కాంతి, మరియు అన్ని అంగములకు అందము చేకూర్చును. పదిహేను, పదహారు సంవత్సరముల వయసులో బాలునిలో కలుగు మార్పులకు అంతః స్రావము అనగా శరీరములో వీర్యము యిముడుటయే కారణము. అండ కోశములు తీసివేసిన ప్రాణులు క్రియాశూన్యులై, స్ఫూర్తిహీనులై యుండును. గుఱ్ఱములు, యెద్దులు మరియు మేకలను జూచిన యీ విషయము సులభముగా అర్థము కాగలదు. మనుష్యులలోకూడ అండ కోశములు తీసివేయబడినవారు నిస్తేజులై నిర్వీర్యులై యుందురు. వారి స్థితి నపుంసకులవలె నగును. వారే విధమైన మానసిక, శారీరక పనులలో నుండరు.

బహిఃస్రావ విషయములో పాశ్చాత్యుల అభిప్రాయము నను సరించి యిందు శుక్ర కణములతోపాటు జనన ప్రదేశ అనేక స్థానముల నుండి ఉత్పన్నమైన స్రావములు కూడా కలియును. శుక్ర కణములు (Spermatozoa) మరియు ఆస్రావముల కలయిక పదార్థమునే వీర్య మందురు. శుక్ర కణముల ఉత్పత్తి అండకోశములనుండి జరుగును. మరియు అవే సంతానోత్పత్తికి కారణములగును. వీర్యములో కణము లేని మనుష్యుని నపుంసకుడందురు. సార, పొగాకు, టీ, కాఫీ,

నల్లమందు మొదలగు పదార్థముల సేవనమువలన యీ కణములు క్రియాహీనమై పోవును. అందుచేత ఉత్పాదన శక్తి స్థిరముగా నుంచుటకు యీ పదార్థముల సేవనము విసర్జించవలెను. శరీరమునుండి బయటకు వెళ్లకుండినచో ఈ జీవాణువులు శరీరములో ఇమిడిపోవునా లేదా యను విషయములో విద్వాంసులలో అభిప్రాయ భేదము కలదు. డా॥ కోవన్ మరియు యితర పండితుల అభిప్రాయములో కుకర్మల వలన దుష్ట ఆలోచనలతో వీనిని శరీరమునుండి తీసివేయకుండినచో ఉత్పాదన శక్తిగల ఆ జీవాణువులు శరీరములో యిమిడి శారీరక,మానసిక బలమును అద్భుతముగా వృద్ధిజేయును. డా॥ గార్డనర్ మహోదయుడిట్లు తెలుపుచున్నాడు. వీర్య కణములు రక్తముయొక్క సారము. ప్రకృతి దీనికి ఉత్పత్తి శక్తియే గాక జీవితమును సమృద్ధపరచు శక్తిని కూడా ప్రసాదించినది. వీర్య కణములు శరీరములో యిమిడి పోయినప్పుడు సమస్త దేహములో సంజీవని శక్తిని సంచారము చేయును.

మనుష్యుని శారీరక రచనను తెలిసికొనిన వారెవరైనను వీర్యము యొక్క అంతఃస్రావ బహిఃస్రావముల దురుపయోగము శరీరమునకు తీవ్ర నష్టము కలిగించుననుటలో యేకాభిప్రాయము కలిగియున్నారు. శారీరక, మానసిక, ఆత్మిక ఉన్నతి కొరకై ఆత్మ సంయమము ద్వారా వీర్య స్తంభనము అత్యంతావశ్యకము.

భేదములు : వీర్య సంబంధముగా ప్రాచ్య మరియు పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయములను సేకరించి వాటిని ఆలోచించినప్పుడానందము కలుగును సామాన్య దృష్టితో ఆలోచించినప్పుడీ భేదములు గన్పించును.

భేదములు : ఆయుర్వేదములో వీర్యము యేడు ధాతువుల

క్రమముతో యేర్పడును. పాశ్చాత్యులు రక్తము ద్వారా మాత్రమే వీర్యమేర్పడు ననిరి.

2) ఆయుర్వేదము వీర్యము శరీరమంతట నిండియున్నట్లు చెప్పగా పాశ్చాత్యులు యిది అండకోశముల ద్వారా ఉత్పన్నమైనట్లు చెప్పుచున్నారు.

3) పాశ్చాత్య ఆయుర్విజ్ఞానమునందు వీర్యము యొక్క రెండు రూపములు అంతఃస్రావము (Internal Secretion) బహిఃస్రావము (External Secretion) లో స్పష్ట రూపముగా అంగీకరించబడినది. ఆయుర్వేద మునం దీ భేదము కనుపించదు.

4) పాశ్చాత్య విజ్ఞానమునందు శుక్ర కణముల (Spermotozoa) పరిభాష లభించును. శుక్ర కణములు 'ఉత్పాదక వీర్యము' యొక్క పేరు. ఆయుర్వేదములో ఉత్పాదక వీర్యమును విశేష కణములను గుర్తించలేదు. శుక్రమునుండియే ప్రాణోత్పత్తి జరుగుచున్నది.

సామాన్య బుద్ధికి ప్రాచ్య, పాశ్చాత్య విద్వాంసుల ఆలోచనలలో ప్రముఖముగా యివే భేదములు గన్పించుచున్నవి. మా దృష్టితో ఆలోచించినప్పుడు యీ భేదముల అంశములు చాలావరకు లోపించి యిద్దరి ఆలోచనలలో సమాన గుణములు గోచరించుచున్నవి.

సమాన గుణములు : ఆయుర్వేద గ్రంథములలో నిస్సందేహముగా వీర్యము యేడు ధాతువులనుండి పయనించి యేర్పడుచున్నట్లు చెప్పబడుచున్నది. కాని కొన్ని గ్రంథములలో యీ విషయము చెప్పబడలేదు. రక్తము శరీరము యొక్క భిన్న భిన్న అంగములకు భిన్న భిన్న రసము లందించును. తోటలో ప్రవహించు నీటినుండి భిన్న భిన్న పూల మొక్కలు భిన్న భిన్న రసములు గైకొనునటులనే రక్తము శరీర

అవయము లన్నింటియందు ప్రవహించి సంపూర్ణ శరీరమునకు శక్తి నిచ్చుచున్నది. రక్తము అండకోశములందు చేరినపుడు దానినుండి వీర్యము లాగుకొనును. ఈ భావము పాశ్చాత్య ఆయుర్విజ్ఞాన భావములకు సరిపోవుచున్నది. కాని యీ భావమే సరియైనదని చెప్పుటకు వీలులేదు.

2) ఆయుర్వేదము వీర్యము సంపూర్ణ శరీరమందున్నట్లు చెప్పుచున్నది. పాశ్చాత్య విజ్ఞానము యిది అండకోశ జనితమని అంగీకరించుచున్నది. అనేకుల కథనానుసారము వీర్యోత్పత్తి స్థాన సంబంధ భేదము కలదు. కాని యిది వాస్తవికమైన భేదము కాదు. అండకోశములు వీర్యము యొక్క ఉత్పత్తి స్థానము లని మాత్రమే అంగీకరింతురు. దీర్ఘాలోచన తర్వాత వీర్యము అండకోశములలో ప్రకటితమగునను విషయము ఉభయ పక్షములు ఆమోదించును. ఇద్దరి మతానుసారము వీర్యము శరీరము మొత్తమునుండి ప్రవహించుచున్నది, మరియు అండకోశమునుండి వెడలుచున్నది.

3) ఆయుర్వేదమునందు అంతఃస్రావము, స్పష్టముగా గన్పించనప్పటికి మా ఆలోచన ప్రకారము ఆయుర్వేదములో 'తేజము' మరియు, 'ఓజము' అంతఃస్రావమునకు 'రేతస్' మరియు 'బీజము' బహిఃస్రావమునకు పర్యాయ పదములుగా ప్రయోగించబడినవి. 'శుక్రము', 'వీర్యము' రెండింటికి ఉపయోగింపబడినవి. వాగ్భటుడు 'ఓజము'ను క్రింది విధముగా వర్ణించెను.

ఓజశ్చ తేజో ధాతూనాం శుక్రాన్తానాం పరం స్మృతమ్ ।
హృదయస్థమపి వ్యాపి దేహస్థితి బంధనమ్ ॥
యస్య ప్రవృద్ధ్యౌ దేహస్య తుష్టి పుష్టి ఫలోదయాః ।
యన్నాశో నియతో నాశో యస్మిన్ స్తిష్ఠతి జీవనమ్ ॥

నిష్పద్యన్తే యతో భావా వివిధదేహ సంశ్రయాః ।
ఉత్సాహ-ప్రతిభా-ధైర్య-లావణ్య-సుకుమారతా ॥

ఓజము సంపూర్ణ శరీరమందు వ్యాపించియున్నది. ఇది దేహ ఉనికికి కారణము. ఓజస్సు వలన తుష్టి, పుష్టి మరియు బలము ఉత్పన్నమగును. ఓజస్సు నష్టమగుట వలన యివన్నియు నష్టమగును. ఓజస్సు నుండి ధైర్యము, లావణ్యము, సుకుమారత్వము మొదలగు అనేక విధముల భావములు ప్రకటితమగును.

ఈ వర్ణన అంతఃస్రావము లేక హార్మోన్ల విషయములో పాశ్చాత్య వైజ్ఞానికుల వర్ణనలకు సరిపోవుచున్నది. "Macfedon" మహోదయుడు "Internal Secretion" అంతఃస్రావము విషయములో యిట్లు వ్రాయుచున్నాడు.

ఈ గ్రంథులనుండి వెడలిన ఒక్కొక్క బిందువు శరీరములో యిమిడిపోవుచున్నది. దీని పరిణామముగా అనవరత ఉత్సాహవృద్ధి మరియు ఆరోగ్యము కలుగును. ఇది బాల్యములో విశేషముగా గన్పించుచున్నది.

అంతఃస్రావము విషయములో వాగ్భట్టు మరియు మేక్‌ఫేడన్ వర్ణనలలో యే మాత్రము భేదము లేదు. బహిఃస్రావ విషయములో ప్రాచ్య, పాశ్చాత్య ఆయుర్విజ్ఞానములో భేదము అవశ్యముగా గలదు. బహిఃస్రావక శక్తిని ఆయుర్వేదము గ్రహించినది. భావ ప్రకాశము నందిట్లు వ్రాయబడినది.

శుక్రం సౌమ్యం సితం స్నిగ్ధం బల పుష్టికరం స్మృతమ్ ।
గర్భ బీజం వపుఃసారో జీవస్యాశ్రయ ఉత్తమః ॥237॥

అనగా వీర్యము సోమాత్మకము, శ్వేతము, స్నిగ్ధము బలమును మరియు పుష్టికారకము, గర్భ బీజము, దేహముయొక్క సార రూపము, ప్రాణియొక్క ఉత్తమ ఆశ్రయ రూపము. వీర్యముయొక్క ఈ వర్ణన యే పాశ్చాత్య లేఖకుని బహిఃస్రావ వర్ణనతోనైన సరితూగును.

"బహిఃస్రావ" రూప విషయములో యిద్దరి వైజ్ఞానికుల భావములో స్పష్టమైన భేదము గలదు. ఆయుర్వేద బహిఃస్రావమునందు శుక్ర కణముల వర్ణన గనుపించదు. పాశ్చాత్య విజ్ఞానములో గన్పించును. ఆయుర్వేదములో "శుక్రం" అను శబ్దము మాత్రమే ఉపయోగించబడి యున్నది.

అండకోశముల బహిఃస్రావ విషయములో రెండు రకముల ఊహాగానములు గలవు. ఆయుర్వేదము ననుసరించి శుక్రమే బహిః స్రావము పాశ్చాత్య ఆయుర్విజ్ఞానము ననుసరించి శుక్ర కణములు బహిఃస్రావము. ఆయుర్వేదము శుక్రమును బహిఃస్రావముగా గుర్తించి శుక్రి కణములు అని చెప్పుటకు తిరస్కరించలేదు. ఆ శుక్రమునే శుక్ర కణము లనిన యెడల ఆయుర్వేదమున కెట్టి బాధయు లేదు.

బహిఃస్రావమునకు శుక్ర కణము అని పేరు పెట్టవచ్చునా? ఈ కదిలే మెదిలే చలించే పదార్థములో వేరే ప్రాణియున్నదా? అందు మనుష్యుని ఆత్మకంటె భిన్నమైన ఆత్మ గలదా? లేక అది ప్రాణి యొక్క భౌతిక చేతన రూపాంతరమేనా?

మా అభిప్రాయములో ఉత్పాదక వీర్యమునకు కణ విశేషమనుట అనుచితము. ఉత్పాదక వీర్యమునందు చలనము గలదు. అది కదలిక గలిగి అటు యిటు తిరుగును. అందుచేత దానికి పాశ్చాత్య ఆయు ర్విజ్ఞులు "స్పర్మటోజువా" లేక చేతనా విశిష్ట జీవాణువను పేరు పెట్టి నారు. వాస్తవముగా అది శుక్రము. భారతీయ ఆయుర్వేదముతోపాటు

ఆధ్యాత్మిక శాస్త్రము కూడా కలిసినది. శుక్రమును శుక్ర కణములని పిలిచినచో అందు మనుష్యులకంటె భిన్నమైన చైతన్యము కలదను భావ మేర్పడును. ఈ విషయము భారతీయ ఆధ్యాత్మిక శాస్త్రము అంగీకరించదు. అందుచేత శుక్రమును శుక్ర కణమని పేర్కొనలేదు. మరియు యీ పేరుతో పిలుచుట అనుచితమగును. దానికి కణములేక జీవాణువు అను పేరు యెందుకు యివ్వవలెను. దాని చలనము వలన దానికి ప్రత్యేక చైతన్యము లేక ప్రాణి యున్నదనుట తగదు. శుక్ర కణముల చలనము, చైతన్యము, మనుష్యుని మస్తిష్కము యొక్క చలనము లేక చైతన్యముతో పోల్చవచ్చును దానికి వాస్తవముగా శుక్ర మను పేరు తగియున్నది. అది కణము లేక జీవాణువు కాదు. కేవలము వ్యవహారము కొరకు దానియందు చలనము కనుపించుటవలన కణము అని అనవచ్చును. "స్పర్మలో జావాలో వేల కణములు గలవని వాటిలో ప్రతి కణములో ఆత్మకలదని భావించుట మా కత్యంతరకరము.

<u>మూడవ ఆలోచన</u> : ఉత్పాదక వీర్యముయొక్క చలనమునకు మస్తిష్కము కారణమని చెప్పబడినది. ఉత్పాదక వీర్యమునకు వేరే చైతన్యము లేక ఆత్మ లేదు. ఈ ఆలోచన మూడవ ఆలోచనకు అవకాశము కలిగించుచున్నది.

అనేక మంచి వైజ్ఞానికులు ఉత్పాదక వీర్యముయొక్క ఉత్పత్తి రక్తము లేక అండకోశములనుండి గాక మస్తిష్కమునుండి జరుగునని చెప్పుదురు. వీర్యనాశము మస్తిష్క నాశమునకు దారి తీయుచున్నది. వీర్యము, మస్తిష్కము రెండు ఒకే పదార్థమునుండి యేర్పడుచున్నవి. వీర్యము మరియు మస్తిష్కమును తయారు జేయు రసాయనిక పదార్థ మొక్కటే. రెండింటిని పోల్చినపుడు కొంచెము భేదము మాత్రమే కనుపించును. ఈ విషయములో యింకను తీవ్రమైన అన్వేషణ

అవసరము. రసాయన శాస్త్రముద్వారా యీ విషయము నిర్ధారింప బడినచో బ్రహ్మచర్యము కాపాడుకొను విషయమునకు సంబంధించిన ఒక విశిష్ట ఆధారము లభించును. వైద్యులు, రసాయన శాస్త్రజ్ఞులు యీ విషయమై మథనమొనర్చి క్రియాత్మక నిర్ణయములు గైకొనినచో చాలా లాభము కలుగును.

ఈ సిద్ధాంతమును ప్రతి పాదించిన ముఖ్యులలో అమెరికాకు జెందిన డా॥ ఏండ్రూస్ జేక్సన్ డేవిడ్‌గారొకరు. వారు తమ పుస్తకము " Answer to ever recurring question from the people " లో 293 పుటయందిట్లు పేర్కొనిరి.

అనేక శరీర శాస్త్రజ్ఞులు వీర్యము రక్తమునుండి ఉత్పన్న మగునను భావమును భ్రమ పూర్వకముగా గల్పించిరి. ఈ సిద్ధాంతము వలన చతురులైన వ్యభిచారులకు లాభము కలుగుచున్నది. రుధిరము ద్వారా వీర్యమేర్పడి అండకోశముల ద్వారా ప్రకటితమగునని చెప్ప బడుటచే వీర్య దురుపయోగమును, పౌష్టికాహారముతో నష్టమును పూరించ వచ్చునను వాదనను లేవదీయ వచ్చును. యథార్థ మేమన 'ఉత్పాదక వీర్యము' 'వీర్య కణములు' మరియు "స్పర్మెటోజువా"ల ఉత్పత్తి మస్తిష్కమునుండి జరుగుచున్నది అన్య ద్రవములతో కలిసి అది అండకోశములలో బహిఃస్రావ రూపములో ప్రకటిత మగును. ఉత్పత్తి కార్యము జీవితము యొక్క సమస్త కార్యములకంటె పెద్దది మరియు అలసట కలిగించునది. ఇందు మనుష్యుని సమస్త శక్తులు సమస్త భావములు, శరీరము మరియు మనసు యొక్క ప్రతి భాగము పాల్గొనును. మస్తిష్కమునుండి ఉత్పన్నమైన ప్రతియొక శుక్ర కణము ఒకవేళ బయటకు వచ్చినచో మస్తిష్కము యొక్క అంతే అంశము పూర్తిగా నాశనమైనదిగా గుర్తించవలెను. శారీరక

పరిశ్రమ, మానసిక పనులు యేదో ఒక పనివైపు నిరంతరముగా లగ్నమై యుండినచో వీర్య కణములు లేక "Spermatozoa" మస్తిష్కమునందే యిమిడిపోవును. వీర్య కణములను కేవలము ఉత్పత్తి కొరకై ఉపయోగించిన యెడల మనుష్యుని శారీరక మానసిక శక్తులు నష్టముగాకుండా రక్షించబడును.

ఉత్పాదక పదార్థములను మితముతప్పి వ్యయపరచిన లేక ప్రకృతి నియమములను ఉల్లంఘించిన మస్తిష్కముపై అత్యాచారము జరుపుటయే యగును. ఇట్లు జేయుటవలన మెదడుకు సంబంధించిన అన్ని విధముల రోగములు కలుగునని చెప్పుట యథార్థము. బాలుర పోషణ భారము వహించువారీ విషయములను మరచిపోగూడదు.

మస్తిష్కమునకు వీర్యమునకు ప్రత్యేక సంబంధము గలదు. వీర్యనాశముయొక్క ప్రభావము మెదడుపై కలుగును. ఇందు దాపరిక మేమియు లేదు. డా॥ కోవన్ ననుసరించి మస్తిష్కమునుండి ఒక ద్రవము ఉత్పన్నమై మనుష్యుని మనో భావములవైపు పయనించును. అండకోశములనుండి ఒక పదార్థము ఉత్పన్నమై మస్తిష్కములో జేరును. అచ్చటినుండి యౌవనావస్థలో ప్రకటితమగు శారీరక మార్పులను ఉత్పన్నము జేయు నని డా॥ హాల్ పేర్కొనుచున్నారు. మస్తిష్క వీర్య సంబంధము ఆలస్యముగా కనుగొనబడిన దని డా॥ బ్లౌస్ అభిప్రాయపడుచున్నారు. శైలింగ్‌యొక్క "Natural Philosophy" లో మస్తిష్కమును అండకోశముల రసమునుండి యేర్పడు మెదడు అని పేర్కొనబడినది.

"వీర్య స్వరూపము" నకు చెందిన మూడు ముఖ్య ఆలోచనలను పేర్కొనినాము. దీని ఉద్దేశ్యము ప్రతి వ్యక్తి వీర్య రక్షణకై దీనికంటె వేరే మార్గము లేదని తెలిసికొనవలెను. మూడు ఆలోచనలు ఒకే

విధమైనవి. ఏ దృష్టితో చూచి నప్పటికి వీర్య రక్షణ గావించుట జీవిత రక్షణకై అత్యంతావశ్యకము. మన నవ యువకులు పాశ్చాత్య భావముల తెరవెనుక తమ బలహీనతలను మరుగు పరచుకొనుచున్నారు. కాని వారు తమ ఆత్మ ప్రబోధము నాదరించి తమను నాశనమునుండి కాపాడుకొనుటకు యత్నించవలెను. పాశ్చాత్య వైజ్ఞానికుల పరిశీలన బ్రహ్మచర్య రక్షణ కనుకూలముగా నున్నది. డా॥ స్టాల్ పుస్తకము "What a young husband ought to know" జీవ శాస్త్ర దృష్టిలో అత్యుత్తమమైనది.

వృక్ష సౌందర్యము రక్షించుకొనుటకు దాని ఫలోత్పాదన సమయము పెంచుట ఆవశ్యకము. దానిలో విత్తనము లేర్పడనంత వరకు చెట్లు పూలతో సుశోభితముగానుండును. పుష్పములో బీజమేర్పడు సమయము ఆలస్యము గావించిన పుష్పములు మొదటికంటె యెక్కువ కాలము విచ్చుకొని యుండును. వీర్య నష్టము కాకుండా ఆపబడిన కీటకములు యితర కీటకములకంటె యెక్కువ కాలము జీవించును. సీతాకోక చిలుకలను పరీక్షించినపుడు జనన శక్తిని ఉపయోగించునవి కొంత కాలము మాత్రమే జీవించెను. జనన శక్తిని ఉపయోగించని సీతాకోక చిలుక రెండు మూడు సంవత్సరము లధికముగా జీవించెను.

ఈ పరీక్షలవలన వీర్య రక్షణ జీవితమునందుగల మహత్త్వము అఖండిత రూపముగా సిద్ధమైనది. ఇందు సందేహానికి అవకాశము లేదు.

## వీర్య రక్షణయే జీవితము వీర్య నాశనమే మరణము

శారీరక ప్రారంభావస్థయందు సంచయ శక్తి ప్రధానముగా నుండును. మనము తిని, త్రాగి, విలాసముగా జీవింతుము. ఎట్టి విచారము

ఉండదు. శరీరము పెరుగుచునే యుండును. బాల్యము యొక్క ఒక్క అడుగు పొడవుగల చిన్న ఆకార మెక్కడ ? ఆరు అడుగుల పొడుగు గలిగి మణుగున్నర బరువు కలిగిన యువకుని ఆకార మెక్కడ ? ఈవృద్ధిలో అవే కండ్లు, ముక్కు, చెవి అవయవములు మరియు ఆత్మ గలవు. అవే అవయవములు పెరిగి పెద్ద వగును. తేలిక వస్తువు బరువు యెక్కువైనది. ఆశ్చర్యకరమైన మార్పునకు శరీరము నందుగల సంచయ శక్తియే కారణము. అధికమైన పరిశ్రమవలన శరీరమునందు ఉపాదేయ పదార్థ సంగ్రహము జరిగినది. అందుచేతనే నేడు శరీరము ఉన్నతమై మరియు సమృద్ధముగా గన్పించుచున్నది.

కాని యీ వృద్ధి చిరస్థాయి కాదు. ప్రొద్దు పెరిగి గ్రుంకుట మొదలు పెట్టును. సుదృఢమైన శరీరము కూడా బలహీనమగును. లేచిన అలలు పడిపోవును. సంచయము తర్వాత విచయము ప్రారంభ మగును. పుట్టుక తర్వాత మరణము అడుగు పెట్టును. దైనిక వ్యవహారములలో మనుష్యునకు సమృద్ధము కలిగియుండియు శక్తులు కొంత దూరములో ఆగిపోవును. కుంఠితమై పతనోన్ముఖ మగును. ఈ పెరుగుదలకు తరుగుదలకు కారణ మాలోచించుడు.

సంచయము తర్వాత విచయము, ఉన్నతి తర్వాత నాశనము అను చక్ర భ్రమణమును గురించి విచారించినవారు దీని కారణము జీవిత ప్రౌఢావస్థ తర్వాత రెండు పరస్పర విరుద్ధ ప్రవృత్తుల ఢీ కొనుట యని చెప్పుచున్నారు. శరీర వృద్ధియొక్క స్వార్థమంతా ప్రవృత్తి ప్రజా జననము యొక్క పరమార్థ ప్రవృత్తివలన అణచివేయబడును. మనుష్యుడు యిల్లు కట్టుకొని కూర్చొనును. తన శరీరమునందు సంచయముచేయుట విడిచిపెట్టి సంతానోత్పత్తి చేయుట ప్రారంభించును. తిని, త్రాగి తన శరీరము విషయమాలోచించువాడు పరమార్థ వలయ

మ లో చిక్కుకొనును. తన సంతానము కొరకై కఠినమైన కష్టమును కూడా సహించుటకు సిద్ధపడును. స్వభావ సిద్ధ క్రమముతో స్వార్థ అవస్థనుండి స్వార్థ త్యాగ అవస్థకు జేరును.

మనుష్యుని శక్తి యొక్క క్షీణదశ మరియు ప్రజా జననము రెండు ఒకే సమయమున ప్రారంభమగును. ప్రజోత్పత్తి తర్వాత శారీరకోన్నతి అధికముగా జరుగు అవకాశములేదు. ఏ తత్త్వముతో శారీరకోన్నతి సంభవ మగునో అది సంతానోత్పత్తి క్రమము నందు పయోగపడును. అందుచేత శారీరకోన్నతి ఆగి పోవును. సంతానోత్పత్తి దుష్కార్యము గాదు. ఉన్నతమైన ఆదర్శములో ఇది బ్రహ్మ (పరమాత్మ) ను అనుకరించుటయే యగును. కాని దీనివలన కలుగు పరిణామములు ఆగిపోవు. "సంచయ" శక్తిని 'విచయ' శక్తులాక్రమించును. మనుషుని అడుగులు మృత్యువు వైపు సాగిపోవును. సంజీవని శక్తియొక్క బీజములు శరీరమునుండి బయటకు వెళ్లుట జీవనమునకు శత్రువు. శరీరమునందు వృద్ధి అధికముగా కాజాలనపుడు ఉత్పత్తి ప్రారంభించుటలో నష్టము కలుగు అవకాశము లేదు. కాని అంతకు పూర్వమే ఉత్పత్తి ప్రారంభించినచో వినాశము తప్పదు. శరీర వృద్ధి చరమ స్థాయికి జేరినపుడు మాత్రమే సంతానోత్పత్తి స్వాభావిక పరిణామము కావలెను. దీనినే బ్రహ్మచర్య మందురు. శరీర వృద్ధిలేక సంచయ సమయమునందు హస్తమైథునము, వ్యభిచారము, బాల్య వివాహము మొదలగు రూపములలో వీర్య నాశనము గావించుట మృత్యువు నాహ్వానించుటయే యగును. బ్రహ్మచర్యమే జీవనము, బ్రహ్మచర్య ఉల్లంఘనమే మృత్యువు.

మనుష్యుడు మృత్యువు లేకుండా అమరుడుగా నుండజాలడు. ఏదో ఒకరోజు మరణము తథ్యము. తాను అమరుడుగా నుండుటకు

సంతానమే యేకైక మార్గము. ఉత్పత్తితో వినాశమునకు అవినాభావ సంబంధము కలదు. ప్రజోత్పత్తిలో వీర్య నాశము సంభవించును. వీర్య నాశము ద్వారా మృత్యురూప మూటను శిరముపై మోయవలెను. జీవన శాస్త్రము వ్రాసినవారి గ్రంథములనుండి అనేక దృష్టాంతములను సంగ్రహించవచ్చును.

'Arotic Symbalism' అను పుస్తకములో రచయిత హైవీలాక్ ఏలిస్ మహాశయుడు 138 వ పుటలో యీ సంబంధమైన అలోచనల నిట్లు పేర్కొనెను.

"వీర్య నాశమువలన జ్ఞానతంతువులకు కలుగు బిగుసుదల దానివలన శరీరమునకు కలుగు తీవ్ర ఆఘాతము అతి భయంకరమై నందువలన యీ దుష్పరిణామములు కలుగుట స్వాభావిక మగును." ఉత్పత్తితో వినాశమునకుగల సంబంధము దృష్టిలో పెట్టుకొని బ్రహ్మ చర్యమున కిట్టి ప్రాముఖ్యత నిచ్చిరి. బ్రహ్మచర్య ఆదర్శమును విస్తృత పరచిరి. వసు, రుద్ర, ఆదిత్య బ్రహ్మచర్యములలో వసు బ్రహ్మచర్యము నికృష్టమైనదిగా పేర్కొనబడినది. ఇరవై నాలుగు సంవత్సరముల ప్రాయమువరకు బ్రహ్మచర్యము పూనుట వారి దృష్టిలో సరిపోదు. బ్రహ్మ చర్యమును తర్క వివాద విషయముగా గాక జీవన్మరణ సమస్యగా గ్రహించిరి. నేటి వైజ్ఞానికులు విజ్ఞాన విషయములో జూపిన శ్రద్ధ నాడు వీరు బ్రహ్మ చర్య విషయములో జూపిరి. సంయమము, బ్రహ్మ చర్యమును లక్ష్య ములో పెట్టుకొని నాడు వారు గురుకులములను నడిపిరి. నేటి కళా శాలలు, విశ్వ విద్యాలయాలలోవలె పాఠములు కంఠస్థము జేయించి ధనమార్జించు యంత్రములను తయారుజేయు ఉద్దేశ్యము నాటి గురుకుల స్థాపకులకు లేకుండెను. వారి ధ్యేయము ఆచరణమై యుండెను.

పుస్తకములు చదువుట నేటి పాఠశాలల చరమ లక్ష్యమైనట్లు నాటి గురుకులములు బ్రహ్మ చర్యమును పాలించుట సంయమ జీవితము గడుపుట నేర్పుట యే వారి చరమ లక్ష్యమై యుండెను. నాడు బ్రహ్మ చర్యము ఒక వైజ్ఞానిక విషయమై యుండెను. దాని కొరకై పెద్ద పెద్ద విద్వాంసులు ఆలోచనలో మునిగిపోవుచుండిరి. ఋషులు జీవిత మహత్త్వపూర్ణ సమస్యకు పరిష్కారము కనుగొనిరి. అదియే బ్రహ్మచర్యము. "బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత" అని వారి సందేశము. బ్రహ్మచర్యాగ్ని ద్వారా దేవతలు మృత్యువును జయించిరి.

"బ్రహ్మ చర్య ప్రతిష్ఠాయాం వీర్య లాభః : "బ్రహ్మ చర్యము వలన శారీరక, మానసిక, ఆత్మిక బలము చేకూరును. "మరణం బిందు పాతేన, జీవనం బిందు ధారణాత్" బిందు పాతములో మరణము, బిందు రక్షణలో జీవన రక్షణ గలదు. చిన్న చిన్న యీ సంస్కృత వాక్యములలో సుందరమైన భావము జీవిత సమస్యలకు పరిష్కార మార్గములు చూపబడినవి. వీర్య నాశమువలన మనిషి వెంటనే మరణిస్తాడని మా భావముకాదు. ప్రకృతిలో వికాసము కలుగుటవలన వీర్యనాశమునకు మృత్యువునకు గల సంబంధము తాత్కాలికముగా విడిపోయినది. అందుచేతనే వీర్యనాశ మార్గమునకు అలవాటుపడి మానుకోలేక పోవుచున్నాడు. కాని పై వివరణవలన వీర్య నాశమునకు, శక్తి నాశమునకు అవిచ్ఛిన్న సంబంధము స్పష్టమగుచున్నది.

## బ్రహ్మచర్య నియమములు మరియు ఋషుల బుద్ధి చతురత

ఋషులు సదాచార జీవనము అనగా బ్రహ్మచర్య జీవనమెట్లు

గడుపవలెనని ఆలోచించిరి. దాని ఆధారముగా బ్రహ్మచర్య నియమములను నిర్ధారించిరి. వారు ప్రతి పాదించిన నియమములు సామాన్యమైనవిగా గన్పడినప్పటికి వానిలో మనో వైజ్ఞానిక విషయములు ప్రగాఢముగా నిక్షిప్తమై యున్నవి. వాటి ఆజ్ఞలు వర్తమాన పరీక్షలను, అన్వేషణలను సార్వభౌమిక అనుభవములతో సంపూర్ణముగా వైజ్ఞానికమైనవిగా నిరూపితమైనవి. నిమ్న శ్లోకములు బ్రహ్మచర్య సిద్ధాంతములను సంక్షిప్తముగా తెలుపుచున్నవి.

స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్య భాషణమ్ ।
సంకల్పోధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తి రే వచ ॥

ఏతన్మైథున మష్టాంగం ప్రవద న్తి మనీషిణః ।
విపరీతం బ్రహ్మచర్య మేతదేవాష్ట లక్షణమ్ ॥

ఈ అష్టాంగమైథునమువల నిషేధము, ఉపనయన సంస్కార సమయములో "మైథునం వర్జయ" ఉపదేశము గావించబడును. యౌవనావస్థలో అష్ట విధమైథునములనుండి దూరముగా నుండవలెను. ధ్యానము, కథ, స్పర్శ, క్రీడ, దర్శన, ఆలింగన, ఏకాంతవాసము మరియు సమాగమములలో యే ఒక్కదానికి వశపడకుము. వీర్యమును రక్షించుకొనుము. ఏ ఒక్కదానికి లోనైనప్పటికి బ్రహ్మ చర్యమును కాపాడుకొనజాలవు.

గురు కులములలో ప్రవేశించగనే బ్రహ్మచర్య రక్షణకై యీ ఉపదేశ మివ్వబడుచుండెను. జ్ఞానసాధనలో పంచేంద్రియములను యిష్ట మొచ్చినట్లుగా విహరించ నీయవలదు. ఒక్కొక్క యింద్రియమునే వశములో నుంచుకొనుటకు సంధ్యావందనములో విశేషముగా చెప్ప బడినది. ప్రతి యింద్రియ దురుపయోగమువలన బ్రహ్మచర్యమునకు

హాని చేకూరు అవకాశముగలదు. ఒక్కొకక్క యింద్రియమునకు సంబంధించిన విషయము వర్ణించుచు పంచేంద్రియములగూర్చి ఆధునిక, ప్రాచీన శాస్త్రవేత్తల అభిప్రాయములను పోల్చి చూచినచో యెట్టి భేదము కనుపించదు.

పంచేంద్రియముల పతనమును గురించి వ్రాయుటకు పూర్వము "అవకాశము"ను గూర్చి వ్రాయుట ప్రకరణాంతరము కాబోదు. అవకాశము చూచుకొనియే రూపము మొదలగునవి ఆక్రమణ సాగించును. అవకాశము పతనానికి ముఖ్య సాధనము. బాల బాలికలకు పెద్ద వయసువారికి ఆవకాశము పతనానికి దారి తీయును. అవకాశము ధర్మ కర్మలను మరపించును. ఉపదేశకులుకూడా అవకాశము దొరకుటతోనే మహా పాతకములకు గురియగు అవకాశము కలదు.

బాలురను విచ్చలవిడిగా వదులుట భయంకర పాపము. వారి ప్రతి కదలికపై ప్రేమమయ నియంత్రణ ఉంచని యెడల వారు ఘోరమైన పాపములను నేర్చుకొనుట స్వాభావికముగా జరుగును. పిల్లల అసత్య ప్రశంసచేయు తల్లి దండ్రుల మూర్ఖత్వముపై మాకు జాలి కలుగును. వారి పిల్లలు సందు గొందులలో పనిలేక తిరుగు చున్నప్పటికి వారి నడవడికయందెట్టి పతనము రాలేదని వారు భావించెదరు. ఏదైన ఒక పనిలో నిమగ్నము జేయనిదే వారు సదాచారులుగా నున్నారని భావించుట భ్రమ మాత్రమేయగును. పనిలో మునిగియున్నవారు అశ్లీలమైన మాటలు నేర్చుకొనుటకు, పతనము జెందుటకు అవకాశము తక్కువ. అందుచేతనే ఋషులు వేదారంభ ఉప దేశములో "కర్మ కురు"యని బోధించెదరు పనిచేయుము. వ్యర్థముగా నుండరాదు. మీ శక్తులను ప్రతి క్షణముసంచయ మొనర్చుకొనుము. వాటిని సదుపయోగమొనర్చి సద్వ్యయము గావించుము. పతనము

జెందిన బాలకుల వినాశము, దుఃఖము జూచి మనకు ఆశ్చర్యము కలుగును "Sexual life of the child" లేఖకుడు ఒక బాలకుని విషయ మిట్లు రచించెను.

నే నొక పదునాలుగు సంవత్సరముల బాలకు నెరుగుదును. అతడు క్రమము తప్పకుండా చర్చికి వెళ్లుచుండెడివాడు మరియు కష్ట పడువాడు. అతనికి వీర్య పతన వ్యాధి యుండగా అతని తల్లి నా వద్దకు చూపించుటకు తీసుకొనివచ్చెను. నేను పరీక్షించి అతనికి గనేరియా వ్యాధికలదని చెప్పుటచే అతని తల్లి నా పై క్రుద్ధు రాలయ్యెను తన కుమారుడు సదాచారుదని ఆమె విశ్వాసము. అన్వేషణలో ఆ బాలుడు పదమూడు సంవత్సరముల వయసునుండియే వేశ్య వద్దకు వచ్చుచు పోవుచుండెను.

ఇటువంటి పరిస్థితి యెంతమంది బాలకులకు గలదో తెలియదు. కాని తల్లి దండ్రులు తమ సంతానము విషయములో యిట్టి మాటలు వినుటకు సిద్ధ పడరు. తమ బాలుర వినాశము జరుగునంతవరకు వారు విశ్వాసముతోనే యుందురు.

ప్రాచీన కాలములో గురు కులములలో బాల బాలికలను ఒకచోట చదివించక పోయెడివారు. గురుకులములను వనములలో నడుపు చుండిరి. అనుక్షణము గురువు బాలకుని కనిపెట్టుకొని యుండెడివాడు. బాలుని పతనమునుండి కాపాడుటకు సర్వదా ప్రయత్నము జరుగు చుండెడిది. వనములో రూప, రస, శబ్ద, గంధ, స్పర్శలకు అవకాశము లభించెడిదికాదు.

<u>రూపము</u> : మనుష్యుని మనో వికారములను జాగ్రత పరచుటలో నేత్రముల పాత్ర ముఖ్యము. అందుచేత వాటిపై నియంత్రణ అవసరము.

నేటి పట్టణ వాతావరణము బాల బాలికల పతనమునకు ద్వారములు తెరచినట్టివిగా నున్నవి. కన్నులెటు ప్రసరించినను ప్రలోభపెట్టు దృశ్యములు కానవచ్చును. ప్రతి పట్టణము నాటకములతో, సినిమాలతో నిండియున్నది. నృత్యము, గానము, రంగు, రూపము ఇవన్నియు యువకునిపై దురాక్రమణ గావించును. సామర్థ్యము లేనందువలన అణగిపోవును. నాటకములు చూచుటవలన కృత్రిమ వస్తువుల ప్రభావము వాస్తవిక వస్తువుల ప్రభావముకంటె తీవ్రముగా నుండును. మనో వైజ్ఞానికుడు విలియం జేమ్స్ ఇదే ప్రకరణములో ఒక రష్యన్ మహిళ వృత్తాంతమును పేర్కొనుచు నాటకములో ఒక మనుష్యుడు చలికి వణకుచుండుట గాంచి కన్నీరు పెట్టును. కాని ఆమె గుఱ్ఱము, బండి నడుపువాడు నాటకశాల బయట చలి తీవ్రతకు తట్టుకొనలేక వణకుచుండుట గమనించదు. నృత్యమును చూచు అలవాటు యూరపు, భారత దేశములందు ఎక్కువగా నున్నది. కాని లోకులు దీని దుష్పరిణామముల గూర్చి ఆలోచించరు. ఇది కన్నులుగల అంధత్వము. డా॥ కైలాగ్ "Plain facts" గ్రంథముయొక్క 322 పుటలో ఇట్లు వ్రాయుచున్నాడు.

ఆత్మ హీనత, రాత్రి జాగరణ, మధ్య రాత్రి భోజనము, అనుచిత దుస్తుల ధారణ, నృత్యము మనోవికారములను ప్రేరేపించును. వాసనలు జాగృతమగును. వాటివలన మనుష్యుడు దుష్ప్రవర్తనలో చిక్కుకొనును. ఈ దూషిత కార్యములు సదాచారమునకు తీవ్ర అఘాతము కలిగించుటయే గాక శారీరక మానసిక ఉన్నతికి ఆటంక మగును. నేత్రముల దురుపయోగమును దృష్టిలో పెట్టుకొని 'నర్తన-గీత-వాచన' ములను నిషేధించిరి.

బ్రహ్మచర్య నియమములలో అద్దము చూచుకొనుట నిషేధించ బడినది. అద్దములో తమ ప్రతిబింబము చూచుకొని నవయువకులు

అనేక మానసిక వికారములకు గురియగుదురు. ఈ విషయమును గురించి హేవలాక్స్ ఎలిస్ తన గ్రంథము "Sexual Selection in Men" యొక్క 187వ పుటలో ఇట్లు వ్రాయుచున్నాడు.

ఈ రోజులలో వేశ్యా గృహములలో మరియు యితర అలంకార గృహములలో అద్దమును ప్రయోగించుట యెక్కువగా కనుపించు చున్నది. అమాయక బాల బాలికలు తమ ప్రతి రూపమును అద్దములో చూచుకొని భావ ప్రపంచములో ప్రవేశింతురు. అద్దము ద్వారా వాసనలు ప్రజ్వరిల్లును.

ఇందు అతిశయోక్తి యే మాత్రములేదు. యువకులు గంటల కొలది సమయము అద్దము ముందర నిలుచుందురు. అనేక భావ ములలో మునిగి తేలుదురు. వారికి బ్రహ్మచర్యము కాపాడుకొనుట కష్టసాధ్య మగును.

<u>శబ్దము</u> : మనుష్యుని అనుచిత ఉద్వేగము నాపుటకై నృత్యముతోపాటు గానముకూడా శాస్త్రములలో నిషేధించబడినది. నృత్యగానములవలన బ్రహ్మచారిలో దుష్ట భావము లుత్పన్నమగును. "Sexual Selecti:n in Men" అను పుస్తకములో రచయిత హేమాక్ ఏలిస్ గానమునకు మనో వికారమునకుగల సంబంధమును వ్యక్తపరచుచు 123వ పుటలో యిట్లు రచించెను.

"భిన్న భిన్న ప్రాణులలో ముఖ్యముగా కీటకములు, పక్షులలో సంగీతము పురుష జాతి, స్త్రీ జాతి పరస్పరము ఆకర్షించుకొనుటకే నిర్దేశించబడినది. డార్విన్ మహోదయుడు తన పరిశోధనలో యిదే నిర్ణయమునకు వచ్చెను. హర్బర్ట్ స్పెన్సర్ యీ నిర్ణయమును సందే హించినప్పటికి ఆధునిక పరిశోధనలు మధుర సంభాషణ, సంగీతము

పురుష, స్త్రీ జాతుల పరస్పర ఆకర్షణకే యను విషయమును తెలుపు చున్నవి. గానము మఱియు ప్రేమ సంబంధమును స్పష్ట పరచుటకు ఆధారముగా ప్రాణి జగత్తులో పురుష, స్త్రీ జాతులలో ఒక్క స్త్రీ జాతికి మాత్రమే మధురమైన కంఠమీయబడినది. మనుష్యుల విషయములో కూడా పశుపక్షి జాతులలోవలె పరస్పర ఆకర్షణకే గాన ముపకరించుచున్నది. ఈ విషయములో ఏలిస్ మహోదయు డిట్లు పేర్కొనుచున్నాడు.

"పశు పక్ష్యాదులతోబాటు మానవునిలో కూడా యౌవనావస్థలో మధురమైన గానము మానసిక భావములతో సంబంధము కలిగియుండు ననుట నిర్వివాదాంశము."

ప్లేటో మహాశయుడు యీ విషయమును దృష్టిలో పెట్టుకొని తన ఊహా లోకములో యెట్టి గానమునకు అనుమతించవలెనను విషయ మాలోచించెను. ప్లేటో సంగీతము సదా మానవుని మనసుపై ఉత్తేజనా ప్రబావము కలిగించునని చెప్పక పోయినప్పటికి విశేష తరహా గానము నకు మానసిక వికార లు కలిగించుటలో సంబంధము కలదను విషయ మంగీకరించును. ఇట్టి సంగీతమువలన, మద్యపానము, కామ సంబంధము, సోమరితనము పెరుగును. ప్లేటో అభిమతము ననుసరించి పురుషులకేగాదు స్త్రీలకు కూడా సంగీతము నేర్పకూడదు. అతడు యుద్ధము, ప్రార్థన సంబంధ సంగీతమును మాత్రమే ఆమోదించెను.

పశు, పక్షి మనుష్యాదులలో సంగీతమునకు మనోవికారముతో సంబంధము కలిగియుండుట చూచిన తర్వాత బ్రహ్మచారులకు నృత్య గానములు నిషేధించుట సమంజస మనుపించు చున్నది. అన్నిరాగములు ఉత్తేజము కలిగించవు. కావున బ్రహ్మచారులకు కొన్ని రాగములు

అనుమతించబడినవి. సామవేదగానము వారికి విధిగా చెప్పబడినది. ఎక్కువగా గానమునకు మనో వికారములకు సంబంధము కలదు కాన గానము బ్రహ్మచారులకు ఋషులు నిషేధించుట బుద్ధిమంతుల లక్షణము.

గంధము: నాసికతో జనన శక్తికి ఘనిష్ఠ సంబంధము కలదు. ఆధునిక కాలములో వీటి పరస్పర సంబంధము విస్మరించబడుచున్నది. యౌవనావస్థలో బాల బాలికలకు ముక్కునుండి రక్తము కారుటకు జననేంద్రియ సంబంధమే కారణముగా భావించబడుచున్నది. ఇదే తరుణములో ముక్కుకు సంబంధించిన అనేక రోగములు కలుగుచున్నవి. ముక్కునుండి కారు రక్తమును జననేంద్రియముపై మంచుగడ్డ లుంచి నివారించుట జరుగుచున్నది. బలహీన స్త్రీ పురుషులలో సంభోగము తర్వాత ముక్కు అదరుట జరుగును. వీర్య పతనము తర్వాత నాసికా ద్వారములకు అవరోధము కలుగుట, తుమ్ములు వచ్చుట గమనించు చున్నాము. ఏలీస్, ఫేరీ, జేయన్. మెకంజీల వ్రాతల ననుసరించి వివాహము తర్వాత స్త్రీ పురుషులలో జలుబు, నాసిక సంబంధమైన యితర వ్యాధులు గమనించనైనవి.

ఈ పతనకాలములో పరమాత్ముడిచ్చిన ప్రతి వస్తువు దురుపయోగము గావించబడుచున్నది. బజారు వివిధ రకములైన వస్తువులతో నిండియున్నది. కస్తూరి ఉపయోగము పెరిగిపోయినది. పశువుల శరీరమునుండి తయారైన గంధ పూరిత ద్రవ్యములు ఉత్తేజకరముగా నుండును. అడవి జాతులలో యివి యెక్కువగా ఉపయోగించబడు చుండెను. సభ్యత పెరిగినకొలది జంతువుల శరీరమునుండి యేర్పడిన గంధపూరిత ద్రవ్యములకంటె పుష్పములతో తయారైన గంధ వస్తువుల ఉపయోగము యెక్కువైనది. అవి మనుష్యునిలో వాసనలను ప్రజ్వలిత

మొనర్చును. ఇవి రెండును బ్రహ్మచర్య పాలనలో ఆటంకము కలిగించును.

ఏలిస్ మహోదయుడు తన "Journal of Psychological Medicine" గ్రంథములోనుండి యీ అంశమును ఉదహరించెను. కృత్రిమ సుగంధ ద్రవ్యములు హాని కారకములగుటయేగాక బ్రహ్మచర్యమునకు దోహదపడవు. అందుచేతనే ఆచార్యుడు గంధము, పూలు, మాలల ఉపయోగమును బ్రహ్మచారులకు నిషేధించెను. నేడు పాఠశాల, కళాశాలలలో విద్యార్థులు సుగంధపు పూలను, అధికముగా ఉపయోగించుచున్నారు. ఇవి బ్రహ్మచర్య నియమ పాలనకు భంగము కలిగించును. సాధారణ సాత్విక జీవనము మరియు పవిత్ర జీవనమే ఆదర్శ జీవితము.

స్పర్శ : బేన్ మహోదయుడు తన పుస్తకము 'Emotions and will' అను గ్రంథములో స్పర్శ ప్రేమకు ఆది మరియు అంతము అనెను. మనో భావనలను జాగృత పరచు పెద్ద సాధనము స్పర్శ. ఈ విషయమును భారతదేశ ఋషులు యూరోపు దేశానికి జెందిన ఫీరీ, మెంటెగెజా, ప్రైంటా మరియు ఏలిస్ అందరు ముక్త కంఠముతో అంగీకరించారు. స్పర్శ మనుష్యుల ఉత్తేజ పరచుటలో కలిగించు ప్రభావమువలన అనేక పశ్చిమ దేశాలకు జెందిన రచయితలు సామాన్య స్పర్శనుకూడా చెడుగా భావించుచున్నారు. సభ్యతాయుగములో యిట్టి కాలము సభ్యతా పతనమునే సూచించుచున్నది. ఉన్నత సభ్యత అను పేర మనుష్యుడు పతనమునకే పోవుచున్నాడు. అటువంటప్పుడు యిట్టి కాలము వచ్చుటలో ఆశ్చర్యములేదు.

డా॥ బ్లాచ్ తన పుస్తకము "The sexual life of our times" 30వ పుటలో యిట్లు వ్రాయుచున్నాడు.

"స్పర్శవలన మానసిక వికారముల ఉత్పన్నమునకు ముఖ్య కారణము యేమనగా త్వచయొక్క జ్ఞాన తంతుపులు మరియు ఉత్పాదక అంగముల తంతువుల నిర్మాణము ఒకే పదార్థముతో జరిగినది. అన్ని అవయవములకంటె స్పర్శవలన మానసిక దుర్భావములు ఉత్పన్నమగుచున్నవి. స్పర్శయొక్క భయానక తుఫాను తాకిడికి తట్టుకున్న వాడు వాటివలన కలిగే దుష్పరిణామములనుండికూడా కాపాడుకొనును.

బాల బాలికలు చక్కలిగింతలు పెట్టుకొనుట అభ్యాసముగా మనము చూచుచున్నాము. గిలిగింతలవలన స్పర్శ ఉత్తేజము ద్వారా మనోవికారము కలుగుట స్వాభావికము, బాలురు యీ అభ్యాసమునుండి దూరముగా నుండుట అవసరము అనవసరముగా స్పర్శించుట బ్రహ్మచర్యమునకు భంగకరము.

మెత్తని సుకుమార పానుపులు బ్రహ్మచర్యమును భంగపరచును. డా॥ బ్లాచ్ బాల బాలికలు మెత్తని పక్కలపై పరుండుటవలన హస్త మైథునమువంటి దురభ్యాసములకు లోనుకాగల ప్రమాదము కలదని హెచ్చరించెను. బ్రహ్మచర్య నియమములో "ఉపరిశయ్యాం వర్జయ" కోమలమైన మెత్తని పక్కలపై పరుండుట నిషిద్ధము.

ఏలిస్ మహోదయుడు తన పుస్తకము "Modesty Sexual Precaution" యొక్క 175వ పుటలో యిట్లు వ్రాసెను.

అనేక రచయితలు గుఱ్ఱపుస్వారివలన, రైలు ప్రయాణమువలన వీర్యస్ఖలనమగునని వ్రాసిరి. ఇట్టి జ్ఞానము పాదరీలకు కూడా ఉండెను. శాస్త్రములలో ఆచార్యుడు బ్రహ్మచారికి ఉపదేశమిచ్చుచు "గవాశ్వ హస్త్యుష్ట్రాది యానం వర్జయ" అని ఆదేశించును. ఎద్దు, గుఱ్ఱము, ఏనుగు, ఒంటె మొదలగు వాటి సవారి వర్జించవలెను. కొన్నిచోట్ల

అసలు సవారియే పనికిరాదనిరి. బ్రహ్మచర్యము భంగము కాకుండా బ్రహ్మచారిని కాపాడుట వీటి ఉద్దేశ్యము. స్పర్శ విషయములో "అకామతః స్వయమిన్ద్రియ స్పర్శేన వీర్యస్ఖలనం విహాయ వీర్యమ్, శరీరే సంరక్ష్యోర్ధ్వరేతః సతతం భవ" ఇంద్రియ స్పర్శ జరుగకుండా వీర్యమును కాపాడుకొనుము. ఈ ఉపదేశము వలన ఆధునిక గురువులు ప్రాచీన గురువుల మధ్య భేదము స్పష్టము. ఆధునిక గురువు తన శిష్యు నుద్దేశించి విద్యా సంస్థలో వీర్య రక్షణ గావించుట జీవిత లక్ష్యమని బోధించునా? నేటి విద్యా విధానము కేవలము ధనార్జనచేయు యంత్రముగా మాత్రమే లక్ష్యము గలిగియున్నది. బాలుని సదాచారునిగా, సంయమిగా తీర్చి దిద్దుట వారి లక్ష్యమై యుండెను. గురు కులములలో విద్య నేర్పబడుచుండెను కాని వారి లక్ష్యము ఉన్నతమైనదిగానుండెను. నేటి గురువు "హెడ్ మాస్టరు" లేక "ప్రిన్సిపాలు" అనగా యజమాని లేక ముఖ్యుడు అని అర్థము కలిగియున్నది. వారు ఆచారము నేర్పుటకు సిద్ధముగాలేరు. ప్రాచీన శిక్షకుని ఆచార్యుడు అని వ్యవహరించిరి. అతడు శిక్షకుడు, ముఖ్యుడే గాకుండా ఆచారము నేర్పువాడుగా నుండెను.

రసము: గంధ, స్పర్శ, రూపములుకూడా రసములో కలిసి యున్నవి. గంధాది విషయముల సేవనము బ్రహ్మచారులకు నిషేధము. అందుచేత రసయుక్త పదార్థముల సేవనము స్వతఃహాని కారకము. సారాయి, టీ, కాఫీ, పొగాకువంటి పదార్థముల సేవనము సభ్యత పెరుగుచున్నకొలది పెరుగుచున్నది. వీటి సేవనము బ్రహ్మచర్యపాలనలో ఆటంకము కలిగించును.

సారాయి సేవనమువలన ప్రాణ సంబంధ ముఖ్య తత్త్వములు చెడిపోవునను విషయమై ఏ వైద్యుని అభిప్రాయ ప్రకటన అవసర

ముంచదు. సారాయి మత్తులో సదాచార క్షేత్రమునుండి చాలా దూరము తనను మరచి వెళ్లిపోవుట ప్రతిరోజు ఘటన. దీని విషయములో యేమి వ్రాయక పోవుట అంతయు వ్రాయుటతో సమానమని భావించెదను. టీ, కాఫీలవలన కలిగే భయంకర దుష్టపరిణామములతో సాధారణ వ్యక్తులకు పరిచయములేదు. అనేకులు యీ దుష్పరిణామములు తెలుసుకొనక పోవుట చేతనే టీ, కాఫీలు సేవించెదరు. యదార్థ విషయములు గ్రహించిన వెంటనే ఆ అలవాటును విడిచిపెట్టుటకు సిద్ధపడెదరు. డా॥ బ్లాచ్ అభిప్రాయానుసారము టీ, కాఫీ, మారిఫిన్ అధిక సేవనమువలన మనుష్యుడు నపుంసకుడగును. ఫ్రాన్స్ పరీక్షలలో రోజుకు 5. 6 తడవలు కాఫీ త్రాగినవారు నపుంసకులగుటను కని పెట్టిరి. కాఫీ మానుటవలన ఆరోగ్యవంతులై తిరిగి కాఫీ సేవనమువలన నపుంసకులైరి.

పొగాకు విషయములో డా॥ కెలాంగ్ "Plain Facts"లో యిట్లు వ్రాసిరి.

మనుష్యుని ఆచార వ్యవహారములపై పొగాకు దుష్ప్రభావము కొంతమందికి మాత్రమే తెలియును. బాల్యములో యీ దురభ్యాసానికి గురియైనవారు త్వరగానే కామవాసన ప్రదీప్తమై దుర్వ్యసనములకు గురియగుదురు. సదాచారి మరియు పవిత్ర భావములుగ యువకుడు కామవాసనల జ్వాలాముఖిగా మారును. అతని అంతఃకరణములో ప్రజ్వరిల్లు దుర్వ్యసనముల జ్వాలలనుండి అశ్లీలత మరియు దురాచార మను నల్లటి పొగ వెడలును. చాలా కాలము పొగాకు వాడకము వలన నపుంసకుడగు అవకాశము కలదు.

మిఠాయిల ఉపయోగము దుష్ప్రవృత్తుల కారణము మరియు పరిణామ మగును. డా॥ బ్లాచ్ "Sexual life of our Time"

యొక్క 34వ పుటలో యిట్లు వ్రాయుచున్నారు.

మిఠాయి యొక్క సంబంధము దుష్ప్రవృత్తులలో గలదు. మిఠాయి యిష్టముగా తిను బాలురు పతనము జెందు అవకాశముగలదు. వారు యితర బాలురతో పోల్చి చూచినపుడు హస్తమైథునమువైపు మొగ్గు చూపెదరు.

ఎక్కువగా తినుట యీ కాలపు వ్యాధి. వర్తమాన కాలములో ఆకలితో చనిపోవు వారి సంఖ్యకంటె యెక్కువగా తిని మరణించు వారి సంఖ్య అధికముగా కలదు. వీర్య రక్షణజేయక పోవుటచే బొజ్జ వచ్చును. దురాచారి వ్యక్తి నాలుకను తన వశమునందుంచుకొనడు. అవసరముకంటె అధికముగా ఆకలి లేకపోయినప్పటికి తినును. ఉప వాసము జేయుట ఆతనికి అసంభవమగును. డా॥ కెలాగ్ అధికముగా తినుట సదాచార శత్రువని పేర్కొనెను. ఎక్కువగా తినుటవలన వీర్య నాశము సంభవించును. ఆకలియైన దానికంటె కొంచెము తక్కువగా తినవలెను.

మన మనసు మన భోజనముతో యేర్పడునని బ్రహ్మచర్య ప్రాచీన నియమము. ఉపనిషద్‌లో "అన్నమయం హి సోమ్య మనః" అని చెప్పబడినది. సాత్వికాహారము ప్రోత్సహించబడినది. గురుకులములో ప్రవేశ మగునపుడు ఆచార్యుడు శిష్యునకిట్లు ఉపదేశించును. "తెలాభ్యఙ్గ నమర్దనాత్యమ్లాతితిక్త కషాయ క్షారరేచన ద్రవ్యాణి మా సేవస్వ" చాలా పులుపు, వగరు, కారము తినవలదని ఆదేశించును. రాజస భోజనమువలన కుసంస్కారములు మేల్కొనును. బ్రహ్మచారు లనేక మార్లు తినకుండా కేవలము రోజుకు రెండుమార్లు మాత్రమే భుజించ వలెను. మనుస్మృతిలో బ్రహ్మచారి నిరోగిగా నుండుటకిట్లు వ్రాయ బడినది-

సాయంప్రాతః ద్విజాతీనామశనం సంస్మృతినోదితమ్ ।
నాన్తరే భోజనం కుర్యాదగ్నిహోత్రసమో విధిః ॥

అనారోగ్యమనాయుష్యమస్వర్గ్యం చాతి భోజనమ్ ।
అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్ ॥ 2-57॥

## ఉపసంహారము

బ్రహ్మచర్య సందేశ మొక గొప్ప సందేశము. ఇది జీవితము యొక్క అమర సందేశము. ఇది ప్రాచీన భారత సందేశము. హిమాలయ పర్వత గగన భేది శిఖరములనుండి గంగా యమునల యొక్క అనవరత అలల ధ్వని నుండి. సముద్ర అలసట లేని ఉత్తుంగ అలల నుండి, కాననముల దుర్భేద్య నిర్జనత్వము నుండి, తపోమయ జీవనము గడుపు ప్రాచీన ఋషులయొక్క సందేశము నాకు వినుపించు చున్నది. ఆ సందేశమే బ్రహ్మ చర్యము. ఈ సందేశము వినే ఆత్మలు భారత మాతకు అవసరమున్నవి.

"బ్రహ్మ చర్యము" అనునది చిన్న శబ్దము కాని యిందులో గల భావముయొక్క నూరవ భాగమునైనా యీ పుటలో వ్రాయలేము. బ్రహ్మచర్యము యొక్క స్థూల రూపము వీర్యరక్షణకంటె కూడా బ్రహ్మ చర్యము అధికము, బ్రహ్మచర్యమొక వ్యాపక శబ్దము. బ్రహ్మ శబ్దము యొక్క అర్థము "మహాన్" లేక గొప్పవాడు. "చర్య" మనగా ఆచరించుట, బ్రహ్మచర్య మనగా "మహానతలో చరించుట" లేక గొప్పవాడగుట. మనము చిన్న చిన్న క్షేత్రములలో చరించెదము. తమను ప్రతి మాటలో చిన్న మరియు క్షుద్రులుగా జేసికొందుము. చిన్న వర్తులమును ఛిన్నా భిన్నము గావించి పెద్ద వర్తులమువైపు అడుగిడుట, తమను గొప్పవాడుగా చేసికొనుటయే బ్రహ్మచర్య మనబడును. వీర్యరక్షణ

గావించుకొనువారి హృదయములో గొప్ప భావములు స్వయముగా యేర్పడి యుండును. అందుచేత మహానుభావు డగు భావములయొక్క ఆధారముకూడా వీర్యరక్షణ. అందుచేత బ్రహ్మచర్య శబ్దమునకు వ్యాపక అర్థము ఉండియు యీ శబ్దమును వీర్యరక్షణయను సంకుచిత అర్థములో ఉపయోగించ బడుచున్నది. వీర్యరక్షణయను సంకుచిత అర్థము వెనుక బ్రహ్మచర్య శబ్దము యొక్క గొప్ప అర్థము కలదు. బ్రహ్మచర్య శబ్దముయొక్క అర్థము జీవితమును ఉన్నతమైనదిగా నొనరించుకొనుట, శక్తుల సమీకరణ, వాటిని చెల్లా చెదరుగాకుండా చూచుకొనుట, దానిని తన ఉన్నతిపై నడుపుట. బ్రహ్మచర్యము వ్యక్తులకేగాక సమాజమునకుకూడా అవసరము. మన సమాజము సంకుచిత మగుచున్నది. శక్తిహీన మగుచున్నది. సమాజములో బ్రహ్మచర్య శక్తి లేదని దీని భావము. వ్యక్తులకు, సమాజమునకు, దేశములకు బ్రహ్మచర్య అవసరముగలదు. చాలా అవసరముగలదు బ్రహ్మచర్యము వల్లనే శక్తి, మహానత చేకూరును. ఈ సమయములో నాలుగువైపుల సంకుచితత్వము, అసమర్థత, శక్తిహీనత మరియు క్షయ లక్షణములు గనుపించుచున్నవి. జీవనజ్యోతి వేగముగా కాలుచున్నది. ఇది త్వరగా ఆరిపోవు లక్షణములు గనుపించుచున్నవి. ఈ సంకుచిత ఆలోచనలు గల ఉత్సాహహీనులు, చైతన్య హీనులు, నిరాశమయ సమాజములకు కేవల మొకే ఒక సందేశము, బ్రహ్మచర్యము-బ్రహ్మచర్యము-బ్రహ్మ చర్యము. చతుర్ముఖ బ్రహ్మచర్యము. కేవలము శరీరమునకే గాదు. మనసునకు, ఆత్మకు, దేశమునకు బ్రహ్మచర్య మవసరము.

నవ యువకులారా! ఈ సందేశమును శ్రద్ధతో వినండి. ఈ ఆలోచనలో మునిగి పిచ్చివారు కండి. నీవీ ఆలోచనలలో పిచ్చివాడ వైనను యితర తెలివికలవారికంటె ఉత్తముడవు. నీ శక్తిని వ్యర్థము గానీయకుము. తర్వాత పశ్చాత్తాపము జెందవలసివచ్చును. ఈ పుటలలో

బ్రహ్మచర్యము యొక్క ఒకే స్వరూపము అవసరమును దృష్టిలో పెట్టుకొని వ్రాయబడినది. వీర్యమును రక్షించుకొనుము. బ్రహ్మచర్య జీవనమునకు వీర్య రక్షణ మొదటి అడుగు. నీవు పతనముజెందక పోవుటయే గాక నీ చుట్టు ప్రక్కలవారిని యే నవయువకునైనను పతనము కానీయకుము. ప్రతి యువకుడు భారతమాత సుపుత్రుడు. తల్లి కాతని అవసరము కలదు. యువకులు భారతమాత సంపద. వారిని దోపిడికి గురి కానీయకుము.

నవయువకు లీ సందేశము కొరకు తపించి పోవుచున్నారు. ఈ రచయిత వద్దకు అనేకులు ఉత్తరములు వ్రాసి యున్నారు. ఆ ఉత్తరముల వలన మనవా రెంత తపించుచున్నారో తెలియుచున్నది. హజారీ బాగ్ నుండి ఒక యువకుడు వ్రాసిన ఉత్తరములో ఇట్లు వ్రాసెను. "నేను మీరు వ్రాసిన ఇంగ్లీషు బ్రహ్మచర్య విషయక పుస్తకమును అనేకసార్లు పఠించితిని. చదివిన తర్వాత నా కన్నులు తెరచుకొనినవి. నా కింతవరకు యేమియు తెలియకుండుటచే నే నెంత దౌర్భాగ్యుడనో తెలిసికొనినాను. నేను మీ పుస్తకముల ప్రతులను నా అక్క కొడుకులకు, అన్నదమ్ములకు, అన్నదమ్ముల కొడుకులకు తెప్పించి యిచ్చినాను. నా ఉద్దేశ్యములో ఉన్నత పాఠశాలలకు జెందిన ప్రతి బాలుడు నిర్బంధముగా ఇది చదువవలసి యున్నది". అకోలా నుండి వేరొక యువకు డిట్లు వ్రాసెను. "నేనింతవరకు బ్రహ్మచర్యమును గురించి యిట్టి పుస్తకము చదువ లేదు. ఇటువంటి పుస్తకము కొరకు నేను వెదకు చుంటిని. మీ పుస్తకము చదువుటవలన మీ హృదయములో నవయువకుల కొర కెంత ఆవేదన యున్నదో తెలియుచున్నది. నే నొక విషమ సమస్యలో చిక్కుకొనినాను. నన్ను యీ సమస్యనుండి బయటకు తీయుండి. నా తండ్రి ధనవంతుడు. వారు నాచే బలవంతముగా మిఠాయి తినిపించెదరు. టీ త్రాగించెదరు. నేను నిరాకరిస్తే

నన్ను హేళన చేస్తారు. వీటివల్ల యెంత నష్టము కలుగునో నాకు తెలియును. కాని వారు ఒప్పుకొనరు. దయచేసి మీరు యీ విషయములో వారికి వ్రాసి ఒప్పించెదరా ? మరొక యువకుడు బొంబాయినుండి యిట్లు వ్రాయుచున్నాడు. "నా మిత్రుడొకడు 5, 6 సంవత్సరముల నుండి దుర్వ్యసనములకు గురియైనాడు, అకస్మికముగా మీ పుస్తకము అతని చేతిలో పడినది. దీనిని చదివి భవిష్యత్తులో తనను పతనము గానీయకుండా కాపాడుకొందునని ప్రతిజ్ఞ చేసినాడు. మీరాతని ఆత్మ శాంతికేమైన వ్రాసి పంపగలరా ?" లాహోరునుండి యువకుడొకడిట్లు వ్రాయుచున్నాడు, "నేను మీ పుస్తకము చదివినాను. నా జీవితములో ఒక క్రాంతి తెచ్చినది. నాలో ఆశ్చర్యకరమైన పరివర్తన తెచ్చినది. ఈ పుస్తకము ముందుగా దొరికినచో యెంత బాగుండెడిది ?" ఇట్టి అనేక ఉత్తరములు నా ముందరికి వచ్చినవి. వీటిని చూచి యువకులలో గల పిపాసను అర్థము చేసికొనవలదా ? ఇది నా సందేశము కాదు. ఇది ఋషుల సందేశము. ఈ సందేశమును దేశ మూల మూలలలో ప్రతిధ్వనింప జేయుము. నీవు బ్రహ్మచారిగానుండి యితర యువకుల చెవిలో యీ మంత్ర మూదుము. ఈ మంత్రము నీ కోరికలన్నింటిని తీర్చును.

పాఠకులతో శెలవు తీసుకునేముందు ఒక మాట తప్పని సరిగా చెప్పవలసియున్నది. బ్రహ్మచర్య సంబంధ చర్చ పంజాబు, ఉత్తర ప్రదేశ్‌లో నున్నంత యితరచోట్ల లేదు. కాని యీ ప్రాంతములోనే భ్రమను కలిగించే విషయములు ప్రచారములోనున్నవి. వాటిని నిరాకరించుట బ్రహచర్య మహత్తుయొక్క గుణములను గానము చేయుటకంటె అవసరమైనది. బ్రహ్మచారి, పహల్వాను శబ్దములను ఒకే అర్థములో వాడుకొనుచున్నారు. వారి దృష్టిలో బ్రహ్మచర్యము సర్వ రోగములకు దివ్యమైన ఔషధము. ఎవరికైనా జలుబు చేసినచో అతని సదాచారమును గురించి అనుమానము వ్యక్తము చేయుదురు.

ఇటువంటివారి వలననే బ్రహ్మచరము అపకీర్తి పాలైనది. బ్రహ్మచర్య విషయమును సరిగా అర్థము చేసికొనినవారు మాత్రమే ఆ విషయమై మాట్లాడవచ్చును. బ్రహ్మచర్యము పేరుతో అరచెడివాడు దాని మహిమను యెక్కువ జేయుటకు బదులు కించపరచుచున్నాడు. ఒక విషయ స్వరూపమును సరిగా అర్థము చేసికొనకుండా గుడ్డి ప్రేమ వలన దానికి హాని యితర విధాలకంటె యెక్కువగా చేకూరును.

బ్రహ్మచర్యమువలన శారీరక వృద్ధి జరుగుననుటలో సందేహము లేదు. శక్తి పెరుగును. కాని బ్రహ్మచారి గొప్ప పహల్వానుగా నుండు ననుకొనుట పొరపాటు. బలహీనుడుగా నుండుటకు వీర్య పతనమే కారణము కాని బ్రహ్మచారి అన్ని సమయాలలో పహల్వానుగా నుండు ననుకొనుట భ్రమ పూర్వకము. బ్రహ్మచర్యమునకు అర్థము క్రియాశీలత, శక్తి, తత్పరత, ఉత్సాహము, సహన శీలత మరియు తేజస్సు కలిగి యుండుట. దీని అర్థము లావుగా నుండునని కాని పహల్వాను అని కాని కాదు. ఒక వ్యక్తి క్రియాశీలుడై, ఆరోగ్యవంతుడై యున్నను పహల్వాను కాకపోవుటచే అతని ఆచార వ్యవహారాలను శంకించుట పొరపాటు. వారు బ్రహ్మచర్యమును పేరును తీసుకొందురు కాని దాని నర్థము చేసికొనలేరు.

అథర్వ వేదము యొక్క 11 వ కాండము యొక్క 5 వ సూక్తము బ్రహ్మచర్య సూక్తము. ఈ సూక్తములో బ్రహ్మచర్య శబ్దముతోపాటు 'తపము' అను శబ్దము జోడించబడినది. 26 మంత్రములుగల యీ సూక్తములో 15 సార్లు "తపము" అను పదము ఆవృత్తి యైనది. 'స ఆచార్య తపసాపిపతి బ్రహ్మచారీ ధర్మ వసాన స్తపసోద తిష్ఠత్' 'రక్షతి తపసా బ్రహ్మచారీ' "తపము" అను శబ్దమునకు లావుతో సంబంధములేదు. బ్రహ్మచర్యము శారీరక స్వాస్థ్యము చేకూర్చును.

సహన శక్తి, ఉత్సాహము మరియు సాహసము చేకూర్చును. బ్రహ్మచర్యముతో మానసిక శక్తుల వికాసము జరుగును. ఆత్మ ఉన్నతి మార్గములో నడచును. బ్రహ్మచర్యము యీ విషయమునే బల్లగుద్ది చెప్పును.

ప్రపంచములో యే విషయానికైన అనేక కారణాలు ఉండుననుట మరువకూడదు. బ్రహ్మచర్యము ఆరోగ్యమిచ్చునట్టిది, ప్రాణ శక్తిని సంచారము చేయుననుటలో అతిశయోక్తిలేదు.కాని యిదొకటే కారణము, వేరొక కారణము లేదనుకొనుట పొరపాటు. ప్రపంచములో అతి భయంకర రోగములు కలవు. అంటుననుటతో కలిగెడు రోగములు కలవు. బ్రహ్మచారులను, అబ్రహ్మచారుల నిరువురుని అవి బాధించ గలవు. కొన్ని వ్యాధులు తల్లిదండ్రులవలన సంక్రమించును. అవి అజన్మ బ్రహ్మచర్యమువలన కూడా తగ్గక పోవచ్చును. కొందరు అన్ని నియమములను పాలించుచు బక్క పలుచగా నుందురు. వారే ఆకస్మికముగా ధనము దొరికినపుడు దృఢకాయులై చురుకుగా కన్పించెదరు. కొన్నిచోట్ల గాలి, కొన్నిచోట్ల భోజనము, కొన్నిచోట్ల నీరు చెడుగా మరియు దారిద్ర్యము ఆతనిపై పనిజేయును. అన్నిటి పరిణామ మొక్కటిగానే యుండును. బ్రహ్మచర్య శబ్ద ప్రయోగము వీర్యరక్ష అర్థములో చేయవలెను. అది ప్రాణ శక్తియొక్క ఒకే కారణముపై ఆలోచన చేయబడుచున్నదని భావించవలెను. ఇదే దృష్టి. బ్రహ్మచర్యమొక పెద్ద నియమము. ఇదే భారత దేశ ప్రాచీన ఋషుల స్థిరమైన అభిప్రాయము, ఇదే నూతన జీవన సంచారముజేసిన ఆదిత్య బ్రహ్మచారి ఋషి దయానందుని సందేశము.

ఓం తత్ సత్

## మా ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1, | అగ్నిహోత్రము - వైజ్ఞానిక స్వరూపము (డా॥ కోడూరి సుబ్బారావు) | 4.00 |
| 2. | వైదిక వైజ్ఞానిక సంస్కృతి ,, | 4.00 |
| 3. | మానవ ధర్మము ,, | 2.00 |
| 4. | గాయత్రీ మహిమ ,, | 2.50 |
| 5. | వైదిక క్రాంతి పథం ,, | 5.00 |
| 6. | చతుర్దశ భువనములు ,, | 3.00 |
| 7. | గోమాత ,, | 5.00 |
| 8. | యజ్ఞోపవీత వైశిష్ట్యము ,, | 1.00 |
| 9. | యుగ పురుషుడు శ్రీ కృష్ణుడు (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 6.00 |
| 10. | పురుషోత్తముడు - శ్రీరాముడు ,, | 8.00 |
| 11. | వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి | 1.00 |
| 12. | వైదిక అర్థనీతి (టి. సూర్యనారాయణ) | 1.00 |
| 13. | నమస్తే సమీక్ష ,, | 1.00 |
| 14. | దేవునకు మానవునకు మధ్య.... ,, | 1.00 |
| 15. | దగాపడిన హిందూ సోదరా ,, | 1.00 |
| 16. | దయానందుని ఆదర్శ రాజ్యము ,, | 1.00 |
| 17. | వైదిక వివాహ వైశిష్ట్యము (సంధ్యావందనం లక్ష్మీదేవి) | 3.00 |

(పోస్టు ఖర్చులు అదనము)

## మా రాబోవు ప్రచురణలు

1. జనని - జన్మ భూమి (అచ్చులో)
2. వైజ్ఞానిక సంస్కృతి (2వ భాగము)
3. ఆరోగ్యకర ఆహారము
4. వరదా వేదమాతా



స్వామి దయానందసరస్వతి

## ప్రియ యువ పాఠకులారా !

ఈ 'బ్రహ్మచర్య విజ్ఞానము'ను చదివిన మీకు బ్రహ్మచర్యము - వీర్యరక్షణ వలన కలుగు లాభము లెట్టివియో కొంత అవగతమై యుండును. పూర్ణ బ్రహ్మచర్యమును పాలించిన వ్యక్తి దృఢమైన శరీరమును, తీక్ష్ణమైన బుద్ధిని, మానసిక ప్రసన్నతను పొందును ఇంతేగాక 26 మంత్రములు గల అథర్వ వేదములోని 11వ కాండము నందలి ఐదవ సూక్తము (బ్రహ్మచర్య సూక్తము) బ్రహ్మచర్యము వలన కలుగు మరెన్నో లాభములను వివరించును

మహర్షి దయానందుడు ఆదిత్య బ్రహ్మచారి. అతడు దృఢమైన శరీరమును, తీక్ష్ణమైన బుద్ధిని, అత్యంత ధైర్య సాహసములను పొందుటయే గాక క్షమాదమములను కలిగియుండెను. ఒకసారి అతని బలమును పరీక్షింపగోరిన సర్దార్ విక్రమసింహునికి, సభాసదులకు ఆశ్చర్యము కలుగునట్లు రెండు గుఱ్ఱముల బగ్గిని ఒక అంగుళమైనను జరుగకుండ పట్టి ఆపెను. ఆయన గ్రంథములలో అనేకచోట్ల బ్రహ్మచర్యమే జీవిత మూలమనియు, అది పునాది వంటిదనియు, దానిపైననే భావి జీవితము సుఖమయ మగుననియు హేతుబద్ధముగా వివరించెను వారు రచించిన సత్యార్థ ప్రకాశాది గ్రంథములు చదివిన మరెన్నో జీవిత సత్యములు తెలిసి మీ కెంతో మేలు కలుగును.

— ప్రకాశకులు

Gayatri Series No. 20

BRAHMACHARYA VIJNANAMU **Rs. 15-00**




ఇయం సమిత్ పృథివీ ద్యౌర్ ద్వితీయా
ఉతాన్తరిక్షం సమిధా పృణాతి ।
బ్రహ్మచారీ సమిధా మేఖలయా
శ్రమేణ లోకాంస్తపసా పిపర్తి॥
(అథ. 11-5-4)

శరీర వికాస కాలమగు కౌమారావస్థయందు బ్రహ్మచర్య-వీర్యరక్షా దీక్షితుడైన వ్యక్తి అగ్నిహోత్రము వలె పృథివీ ద్యు అంతరిక్ష లోకములను పూర్ణము చేయును- చక్కగా సేవించును.

బ్రహ్మచారి తన సమిధా- సేవలతో, మేఖలయా- కటిబద్ధతతో, శ్రమేణ- అలసట ఎరుగని పరిశ్రమతో, తపసా- శీతోష్ణాది ద్వంద్వ సహనముతో ముల్లోకములను పోషించును- సేవించును- రక్షించును.